AMMA NUDI
Telugu Monthly

Vol. 1
Issue 2
Rs. 20
April 2015
Tenali, AP

తెలుగుజాతి పత్రిక

1993-2013 నడుస్తున్న చరిత్ర

# అమ్మనుడి

ఏప్రిల్ 2015



## కృష్ణాతీరాన ఆంధ్ర రాజధాని - అమరావతి

గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి

♦ సాటి తెలుగువారితో ఇలాగ వ్యవహరిస్తారా? ♦ తెన్నాడులో తెలుగు ఉద్యమం

# ‘నడుస్తున్నచరిత్ర’ నెలకొల్పిన ఉన్నత సంప్రదాయాల్ని ‘అమ్మనుడి’ కొనసాగించాలి.

## 2015 మార్చి 5న తెనాలిలో ‘అమ్మనుడి’ విడుదల సభలో పెద్దల ఆకాంక్ష



సభకు ముందు దీపాన్ని వెలిగిస్తున్న పెద్దలు




అధ్యక్షోపన్యాసం




పత్రికను విడుదల చేస్తున్న ముఖ్యఅతిథి, పెద్దలు




ముఖ్య అతిథి ప్రసంగం



సభలో పాల్గొన్న పెద్దలు



ప్రచురణకర్త ప్రసంగం



సంపాదకుని ప్రసంగం

‘అమ్మనుడి’ పత్రిక తొలిసంచిక మార్చి 5న తెనాలిలో విడుదల అయింది. ఈ సందర్భంగా తెనాలి – శ్రీ రాధాకృష్ణ కళ్యాణమండపంలో నిండైన బహిరంగసభ జరిగింది. సభకు డా॥ పాటిబండ్ల దక్షిణామూర్తి అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా స్థానిక శాసనసభ్యులు, మాజీ మంత్రి శ్రీ ఆలపాటి రాజేంద్రప్రసాద్, విశిష్ట అతిథిగా తెనాలి పురపాలకసంఘ అధ్యక్షులు శ్రీ కొత్తమాసు తులసీదాసు, ఆత్మీయ అతిథులుగా ‘ప్రజాసాహితి’ కొత్తపల్లి రవిబాబు, కుమార్ పంప్స్ సంస్థల అధినేత శ్రీ కొత్త సుబ్రహ్మణ్యం, బౌద్ధ రచయిత శ్రీ బొర్రా గోవర్ధన్, ప్రముఖ నేత్రవైద్యులు డా॥ కొత్త శివరామకృష్ణ ప్రసాద్, రామా రూరల్ విద్యాసంస్థల అధినేత శ్రీ కొలసాని తులసీ విష్ణుప్రసాద్ పాల్గొన్నారు.

(తరువాయి.... 50వ పుటలో)

# 'పత్రికొక్కటున్న పదివేల సైన్యము...'



**'అమ్మనుడి'**గా నడుస్తున్నచరిత్ర మళ్లీ వెలువడినందుకు కొందరు పెద్దలు, రచయితలు, పత్రిక చదువరులు ఫోన్ ద్వారా, ఉత్తరాల్లోనూ సంతోషాన్ని తెలియజేశారు. 20 ఏళ్లుగా ప్రచారమై వున్న 'నడుస్తున్నచరిత్ర' పేరునే కొనసాగిస్తే బాగుండేదని కొందరు అభిప్రాయపడినా, పత్రిక రాకడను స్వాగతించారు. తమ హర్షామోదాల్ని వెల్లడించారు. వారందరికీ నా ధన్యవాదాలు. అందరికీ నా విన్నపం ఒక్కటే...

"మీ అందరి ఆదరాభిమానాలతోనే ఇంతకాలం పనిచేయ గలిగాను. ఆటంకాలను దాటుకొని, దృఢసంకల్పంతో పత్రికను మళ్లీ బయటకు తెస్తున్నాను. తెలుగుజాతి పునరుజ్జీవనోద్యమాలకు అండదండగా, వెన్నుదన్నుగా **'అమ్మనుడి'** తన సేవను కొనసాగిస్తుందని మనవి చేస్తున్నాను. ఇందుకు మీరంతా పూర్తి సహకారాన్నందించాలని కోరుతున్నాను. పత్రికకు చందాదారులుగా మీరు చేరడం మాత్రమేగాక అన్నిస్థాయిల విద్యాసంస్థలను, అధ్యాపకులను, గ్రంథాలయాలను చందాదారులుగా చేర్చుటకు తమ సహకారాన్ని వేడుతున్నాను. ఆర్థికంగా వీలైనంత తోడుపడడానికి శక్తికొద్దీ విరాళాలను కూడా అందించాలని కోరుతున్నాను. శాశ్వత చందాదారులుగా చేరడం ద్వారా కూడా పత్రికకు ఆర్థికంగా తోడ్పడ గోరుతున్నాను.

ఇక్కడ మరింకొక మనవి చెయ్యవలసి వుంది. ఆర్థిక వనరులు లేకపోతే పత్రికను ప్రచురించలేం. అయితే, ఆర్థికవనరు లుండడం వల్ల మాత్రమే పత్రికను – ముఖ్యంగా – ఇటువంటి ఉద్యమ పత్రికను ప్రచురించలేం. అందుకు ఆ ఆశయలక్ష్యాల సాధన కోసం తగిన రచనలను చెయ్యగలవారి తోడ్పాటు లేకుండా అడుగు ముందుకు పడదు. మేధావుల, సామాజిక ఉద్యమకారుల నైతిక సహకారం, మద్దతు లేకుండా ముందుకు దారి తెరచుకోదు. రెండు పదుల ఏళ్ల కృషి వల్ల ఇటువంటి తోడ్పాటును అందించగల పెద్దలు, మిత్రులు, రచయితలు, సహచరులు కొందరు ఈ పత్రికకు ఒనగూడారు. అటువంటి శ్రేయోభిలాషులంతా తమ సహకారాన్ని మరింతగా కొనసాగించాలని మరీ మరీ విన్నవిస్తున్నాను.

మప్పిదాలతో

మీ

**సామల రమేష్‌బాబు**

సంపాదకుడు, ఫోన్ : 9848016136

---

**ఆంధ్రప్రదేశ్** రాజధానికి పెట్టినపేరు **అమరావతి.** పైనుంచి చూస్తే ఇప్పుడున్న అమరావతి ఇలా కన్పడుతుంది. దీన్నొక ఆధునిక మహానగరంగా రూపొందించాలనుకొనే పాలకులు ఇక్కడ తెలుగుదనం ఉట్టిపడేట్లు ఆ నిర్మాణాలను తీర్చిదిద్దాలి. అంతేకాదు, రాష్ట్రంలో తెలుగు భాషాసంస్కృతి పట్ల ప్రభుత్వ విధానం, ప్రణాళిక ఏమిటో ప్రకటించాలి. **పుటలు 9-11**




## లోపలి పుటలలో....




కైసేత : **అ. రాజ్యలక్ష్మి** రేఖాచిత్రాలు : సరసి, బాబు, అలెగ్జాండర్

ముఖచిత్రం : **తమ్మా శ్రీనివాసరెడ్డి** (ఫొటో ఇండియా)





రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు

డాక్టర్ సామల రమేష్‌బాబు, సంపాదకుడు, **అమ్మనుడి,**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com

దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక
**అమ్మనుడి**
మాసపత్రిక
• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు **డా॥ సామల రమేష్‌బాబు**

శాలివాహన శకం 1937 మన్మథ నామ సంవత్సర చైత్ర *(ముత్తాపి) శుక్ల ద్వాదశి బుధవారము నుండి వైశాఖ *(కొంగాపి) *(ముత్తాపి) శుక్ల ద్వాదశి గురువారము వరకు

* ముత్తాపి, కొంగాపి = తెలుగు నెలలు

**చందా వివరాలు**

| | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|
| శాశ్వత చందా : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు

**'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**'అమ్మనుడి' చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో పత్రికను పంపగలము. ఇందుకోసం మీ మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

**చందాదారులకు తప్పనిసరి సూచనలు**

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాను.

**శాశ్వత చందాదారుల విషయంలో మనవి :**

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలమని, అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

## విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

**- ప్రచురణకర్త**

**అన్ని భాషలకన్నా అమ్మ భాషే మిన్న**

**మాతృభాషను ప్రేమించలేనివాడు, మాతృమూర్తినీ మాతృభూమినీ ప్రేమించలేడు.**

# తెలుగుజాతి (ట్రస్టు)

## నడుస్తున్న చరిత్ర పాఠకులకు, తెలుగు భాషోద్యమకారులకు, పెద్దలకు, మిత్రులకు విన్నపం

'నడుస్తున్న చరిత్ర' పత్రిక 20 ఏళ్లుగా నిరాటంకంగా ప్రచురింపబడుతూ, 15 ఏళ్లపాటు తెలుగు భాషోద్యమ నిర్మాణానికై చేసిన కృషి మీకు తెలుసు. తెలుగువారి చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయే పత్రికల్లో ప్రముఖమైనదిగా 'నడుస్తున్న చరిత్ర' కీర్తిని సంపాదించింది.

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే గాక, పొరుగు రాష్ట్రాల్లోనూ తెలుగువారి శ్రేయస్సుకు తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేగాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు ఈ దిశగా పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు తరచుగా కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. ఈ అవసరాన్ని తీర్చడానికే ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నిర్మాణం చేయ తలపెట్టి, ఆ సంస్థను రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తమ భాషాసంస్కృతులను కాపాడుకొంటూ, పెంపొందించుకొంటూ తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు మాతృభాషగా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక చుట్టూ వున్న రాష్ట్రాల్లోనూ, దేశమంతటా అల్లుకునివున్న తెలుగుప్రజలు ఇతరదేశాల్లో వున్నవారితో కలిపి మొత్తం తెలుగు జనసంఖ్య 18 కోట్లకు పైమాటే.

'నడుస్తున్న చరిత్ర' పత్రిక ప్రచురణ 2013 అక్టోబర్‌తో నిలిచింది. దానిని మరింత సమగ్రంగా తెలుగుజాతి పత్రికగా తీర్చిదిద్దాలనే ఆశయంతో **'అమ్మనుడి'** అనే పేరుతో పత్రిక ప్రచురణను మొదలుపెట్టాము. **'అమ్మనుడి'** తొలిసంచికను మార్చి నెలలో చదువరులకు అందించాము. కొన్ని ప్రత్యేకమైన పుస్తకాల్ని కూడా ప్రచురించాలని తెలుగుజాతి ట్రస్టు సంకల్పించింది. తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'** విడుదల చేశాము. తెలుగుజాతి ఆత్మగౌరవాన్ని ప్రతిభా వ్యుత్పత్తులను చాటేందుకు కొన్ని ఇతర కార్యక్రమాల్ని కూడా ట్రస్టు చేపడుతుంది. ఇందుకోసం ఈ ట్రస్టును బలమైన పునాదులతో, వనరులతో ఏర్పరచాలని నిర్ణయించాము. దీనినొక శాశ్వతసంస్థగా రూపొందిస్తున్నాము. అందుకు మీ అందరి చేయూత కావాలి. 'నడుస్తున్న చరిత్ర' పాఠకులుగా, భాషోద్యమం పట్ల శ్రద్ధాసక్తులు కలిగివున్న తాము 'తెలుగుజాతి' ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**ట్రస్టుకు ఈ క్రింది విధంగా విరాళాలనిచ్చి ప్రోత్సహించగోరుతున్నాము.**

| | | | |
|---|---|---|---|
| **ప్రోత్సాహకులు** | **రు. 10,000/-లు** | **పోషకులు** | **రు. 25,000/-లు** |
| **విశిష్ట పోషకులు** | **రు. 50,000/-లు** | **రాజ పోషకులు** | **రు. 1,00,000/-లు** |

వీరికి ప్రతినెలా పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.
వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068



తొలిగా స్పందించి
ఒక లక్ష రూపాయలు
విరాళమందించిన

### శ్రీ కోటిపల్లి సుబ్బారావు

ట్రస్టీ
**ఫోన్ : 7702662932**



**కోటిపల్లి సుబ్బారావుగారు** నాబార్డులో జనరల్ మేనేజర్‌గా రిటైరై ప్రస్తుతం హైదరాబాదులో వుంటున్నారు. వాస్తుశాస్త్ర నిపుణులు. 'వాస్తుశాస్త్ర విజ్ఞానం' పుస్తక రచయిత. తెలుగు భాషోద్యమ సమాఖ్యలో చురుకైన కార్యకర్త. వీరు పశ్చిమగోదావరి జిల్లా సిద్ధాంతం శివారులోని నక్కావారి పాలెంలో - 1950 జూన్ 11న జన్మించారు. తండ్రి కోటిపల్లి సత్యంగారు, తల్లి ముసలమ్మగారు.

పేరు తెలుపడం ఇష్టంలేని ఒక పెద్దాయన విశాఖపట్నం నుండి తెలుగుజాతి ట్రస్టుకు ప్రోత్సాహకులుగా రు. 10,000/-లు పంపించారు. పలువురు మిత్రులు వాగ్దానాలు చేశారు. వచ్చేసంచికలో కొన్ని వివరాలు తెలుపగలం.

## కథారచయితలకు, కవులకు...

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.
2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.
3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

## వ్యాసరచయితలకు, స్పందనలు రాసేవారికి...

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి.
2. రచనలు, వార్తలు ప్రచురణకు తీసుకోవటం సంపాదకుని నిర్ణయం ప్రకారమే జరుగుతుంది. దయచేసి ఎటువంటి సిఫార్సులు, ఒత్తిడి చేయవద్దు. అత్యవసరమైన వాటిని 15 వ తేదీలోపుగా పంపించాలి.

## అందరికీ ......

1. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని పంపించ వచ్చు. లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ఇ-మెయిల్‌కు పంపాలి. లేదా కొరియర్‌లో గాని, రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో గాని పంపవచ్చు.
2. ప్రచురణ కోసం పంపించే రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.
3. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

**రచనలు పంపవలసిన చిరునామా :**

**డా॥ సామల రమేష్‌బాబు**, సంపాదకుడు **'అమ్మనుడి'**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం,
విజయవాడ-520004. ఫోన్ : 9848016136, 0866-2439466
e-mail: ammanudi@gmail.com

## కొత్త రచయితలు ముందుకు రండి చదువరులు స్పందించండి.

1. **'అమ్మనుడి'** లో వచ్చిన రచనలపై మీ స్పందనను తెలియజేయండి.
2. వివిధ అంశాలపై మీ అభిప్రాయలు, విమర్శలు రాయండి. పత్రికలో ప్రచురించని అంశాలపై కూడా రాయవచ్చు.
3. సమాధానం కోరే సందేహాలను, ప్రశ్నలను సంపాదకుని ఉద్దేశించి పంపవచ్చు. వాటికి పత్రికలోనే సమాధానాలు ఇవ్వబడతాయి.

**రచనలు పంపవలసిన చిరునామా :**

డా॥ సామల రమేష్‌బాబు,
సంపాదకుడు **'అమ్మనుడి'**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ,
హిందీ కళాశాల వీధి, మాచవరం,
విజయవాడ-520004. ఫోన్ : 9848016136,
0866-2439466
e-mail: ammanudi@gmail.com

## మార్చి సంచికలో దొరలిన తప్పులు ఇవి:

*60, 61 పుటలలో ఇచ్చిన తెలుగు మాటలలో 4 తప్పులున్నాయి.
55. Fast food centre కు 'వడితిండ్లు' అని పడింది. 'వడితిండిలు' అని ఉండాలి.
87. Ribbon కు 'జడాలు' అని పడింది. 'జడాటు' అని ఉండాలి.
65. Leggins అంటే 'కాలుడుపు' అని ఉండాలి. 'పు' బదులు 'వు' పడింది.
95. Shipping కాదు. Skipping అని ఉండాలి.

*28 వ పుటలో ఇచ్చిన రచయిత్రి ఫోన్‌నెంబరు తప్పు. సరియైనది: 8096999177

*ముఖచిత్రంపై జిల్లాలపేర్లలో 3వది గణపతి కాదు. గజపతి అని ఉండాలి. 55వది - 'ధర్మపురం' కాదు. అది 'ధర్మపురి'.

*37వ పుటలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారి బొమ్మ క్రింద 'వేటూరి'కి బదులు 'వేమూరి' అని పడింది.

సంపుటి : 1 సంచిక : 2
అమ్మనుడి
ఏప్రిల్ 2015

సంపాదకీయం

# అమ్మనుడుల రక్షణకై జాతీయ విధానం

**క**న్నడ భాషను ఒక మాధ్యమం (మీడియం) గా ఒకటి నుండి ఐదో తరగతి వరకు తప్పనిసరి చేస్తూ కర్ణాటక ప్రభుత్వం ఒక చట్టాన్ని తెచ్చింది; ఒకటినుండి పదో తరగతి వరకు కన్నడను ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేసింది. కేంద్రప్రభుత్వ చట్టమైన 'పిల్లలకు ఉచిత, తప్పనిసరి విద్యాచట్టం (ఆర్.టి.ఇ) – 2009' ను ఇందుకోసం సవరించింది. దీనిపై చర్చోపచర్చలు జరుగుతున్నాయి. ఇంగ్లీషు మీడియంకు చెందిన విద్యాసంస్థల నిర్వాహకులు తీవ్రంగా విరుచుకుపడ్డారు. ఏ మాధ్యమంలో చదవాలనేది విద్యార్థుల, తల్లిదండ్రుల ఇష్టం అని, ఆ స్వేచ్ఛను ప్రభుత్వాలు నియంత్రించడం రాజ్యాంగ వ్యతిరేకమని ఇటీవల భారత ఉన్నత న్యాయస్థానం ఇచ్చిన తీర్పుకు కర్ణాటక ప్రభుత్వ చర్య పూర్తిగా వ్యతిరేకమని వారు విమర్శిస్తున్నారు. కేంద్ర చట్టానికి రాష్ట్రప్రభుత్వం సవరణను ప్రతిపాదించడం చెల్లదనీ, దీనిపై మరలా న్యాయస్థానానికి వెళతామని వారు ప్రకటించారు. ముఖ్యమంత్రి సిద్దరామయ్య ఒక స్పష్టమైన ప్రతిపాదనతో ముందుకు వచ్చారు. కేంద్రప్రభుత్వం ఒక రాజ్యాంగ సవరణ ద్వారా ఈ అంశంలో స్పష్టతను తీసుకురావాలని, అప్పుడే రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విషయంలో నిర్దిష్టమైన విధాన నిర్ణయంతో ముందుకు వెళ్ళగలవని ఆయన అన్నారు. ఇది సరియైన ప్రతిపాదన. ఈ సందర్భంగా తెలుగురాష్ట్రాల సంగతి చూద్దాం.

2003లో అప్పటి చంద్రబాబు గారి ప్రభుత్వాన్ని తెలుగు భాషోద్యమ సమాఖ్య ఒప్పించి జి.ఓ.నెం. 86 ను ఇప్పించగలిగింది. దాని ప్రకారం రాష్ట్రంలో ఏ మాధ్యమంలో బోధించే పాఠశాలలైనా, ప్రభుత్వ, ప్రయివేటు నిర్వహణలో అవి ఉన్నా తెలుగును ఒక తప్పనిసరి బోధనాంశం (సబ్జెక్టు)గా ఒకటి నుండి పదవ తరగతి వరకు నేర్పవలసివుంది. దీనిని అమలు పరచడంలో నాటినుండి నేటివరకు ప్రభుత్వాలు పట్టీపట్టనట్టు వ్యవహరిస్తున్నాయి. తరువాత రాజశేఖరరెడ్డిగారి ప్రభుత్వంలో జి.ఓ.నెం.76 ద్వారా అన్ని ప్రభుత్వ పాఠశాలలలో 6వ తరగతి నుండి 10 వరకు ఇంగ్లీషు మీడియంను ప్రవేశపెట్టారు. ఇప్పుడు 5వ తరగతివరకు ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగుమాధ్యమం వుంది. ప్రైవేటు పాఠశాలల్లో ఎలిమెంటరీ స్థాయిలో కూడా దాదాపు తెలుగు తుడిచిపెట్టుకు పోయింది. తెలుగు మాధ్యమంతో వున్న ప్రభుత్వ పాఠశాలలు ఇంగ్లీషు మాధ్యమ పాఠశాలల పోటీని తట్టుకోలేక కుదేలవుతున్నాయి. ఈ జీవోను ప్రశ్నిస్తూ, రాజ్యాంగంలో 350–ఎ అధికరణం ఆధారంగా మాతృభాషను ప్రాథమిక స్థాయిలో తప్పనిసరి మాధ్యమంగా చేయాలని కోరుతూ తెలుగు భాషోద్యమ సమాఖ్య రాష్ట్ర ఉన్నత న్యాయస్థానంలో ప్రజాప్రయోజన వ్యాజ్యం వేసింది. ప్రభుత్వ విధాన నిర్ణయం కనుక ఆ దావాను స్వీకరించజాలమంటూ రాష్ట్ర హైకోర్టు దానిని త్రోసిపుచ్చింది. జి.ఓ.నెం.86/2003 ప్రకారం తెలుగుభాషను ఒక సబ్జెక్టుగా తప్పనిసరిగా నేర్పవలసి వున్నప్పటికీ తెలుగు బోధనపై తొలినుండీ శ్రద్ధ వహించకుండా, పరీక్షల్లో ఉత్తీర్ణత కోసం చెప్పే మొక్కుబడి చదువుల వల్ల 10వ తరగతిలో తెలుగులోనే విద్యార్థులు ఎక్కువ సంఖ్యలో పరీక్ష తప్పుతున్నారు. తెలుగు బోధనాస్థాయి అట్టడుగుకు చేరింది.

నిన్నటిదాకా సమిష్టి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కాని, నేటి రెండు రాష్ట్రాల ప్రభుత్వాలకు కాని ఒక భాషావిధానమంటూ ఎన్నడూ లేదు. అందువల్ల తెలుగుభాష రక్షణకు కాని, అభివృద్ధికి కాని ఒక ప్రణాళికంటూ లేకుండా పోయింది. భాషోద్యమకారులు ఎంతో పోరాడగా జి.ఓ.నెం. 909/31-12-2013 ప్రకారం తెలుగుకు ఒక మంత్రిత్వశాఖను సాంస్కృతిక శాఖతో కలిపి ఏర్పరచారు. కొత్తగా ఏర్పడిన రెండు రాష్ట్రాలలోనూ ఆ శాఖ ఉంది. కాని, బడ్జెట్లలో దాని ప్రస్తావనే లేదు. కనుక ఆ శాఖ పని తీరేమిటో మంత్రులకు, ఇతర బాధ్యులకు సరియైన అవగాహన కాని, నిర్దిష్టమైన కార్యాచరణ ప్రణాళిక కాని లేదు.

సంపాదకీయం

నేటి, రేపటి అక్కరలను తీర్చగలిగిందిగా తెలుగును అభివృద్ధిపరచుకోవలసి వుంది. అందుకోసం ప్రత్యేక కృషి ఏమీ జరగకపోగా శాస్త్ర, సాంకేతిక అవసరాలకు తెలుగు భాష సరిపోదని ప్రచారం చేస్తున్నారు. ఇందుకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో విద్య, పాలన రంగాలలోని వారు బాధ్యులు. ఉపయోగిస్తుంటేనే భాష పెరుగుతుందనే కనీస అవగాహన లేని వారి చేతిలో ప్రభుత్వాలున్నాయి. ఇంగ్లీషు గాలికి కొట్టుకుపోవటమే తప్ప, ఎంతో పటిష్టమైన పునాదులు గల మన జనభాషను కావలసిన స్థాయికి పెంచుకుందామన్న ఆలోచనే మన నాయకులకు లేకుండా పోయింది. అందువల్లనే వారు పరిపాలనలో, విద్యారంగంలో తెలుగును పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. ఈ కారణం చేతనే నానాటికీ తెలుగుభాష కేవలం మాట్లాడుకోవటానికి, ఆటపాటలకు, సాహిత్యానికి, కొంతవరకు సాంస్కృతిక అవసరాలకు పరిమితమైపోతోంది. కనుక బోధన మాధ్యమంగా తెలుగు సరిపోదని, ఇంగ్లీషు తప్ప వేరే దిక్కులేదని విద్యారంగంలోనివారు వాదిస్తున్నారు. కార్పొరేట్ విద్యాసంస్థలు సాక్షాత్తు ఆ ప్రభుత్వాల్లోనే భాగమైపోయినందువల్ల ఈ పరిస్థితినే కొనసాగిస్తారు. వారు మాతృభాషా మాధ్యమాన్ని ఒప్పుకోరు.

ఇక్కడ కొన్ని మౌలిక ప్రశ్నలు తలెత్తుతున్నాయి. మాతృభాషా మాధ్యమాన్ని తప్పనిసరి చేసే స్వేచ్ఛ రాష్ట్రాలకు లేనప్పుడు భాషాప్రాతిపదికన రాష్ట్రాలనెందుకు ఏర్పరచినట్లు? మాతృభాషలో విద్య, పరిపాలన జరగనప్పుడు భాషారాష్ట్రాల ప్రయోజనం ఏమిటి? వాటి మనుగడకు అర్థం ఏమిటి? భారతదేశంలో వున్న వైవిధ్యాలలో భాషావైవిధ్యం ముఖ్యమైనది. అందువల్లనే అన్ని వైవిధ్యాలను కలుపుకుంటూ "భిన్నత్వంలో ఏకత్వం" అనే సూత్రాన్ని స్వాతంత్ర్యోద్యమ నేతలు మనముందుకు తెచ్చారు. ఆ సూత్రంపైనే భారతదేశ ప్రభుత్వ ఏర్పాటు, మనుగడ ఆధారపడి వున్నాయి.

రాజ్యాంగంలోని 350–ఎ అధికరణం ప్రకారం దేశంలో ఎక్కడ నివసిస్తున్నా "భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాలవారికి ప్రాథమిక స్థాయిలో వారి మాతృభాషలోనే విద్యాబోధన జరిగేందుకు అవసరమైన అన్ని సదుపాయాలను, అవకాశాలను కల్పించటం స్థానిక రాష్ట్రప్రభుత్వాల, స్థానికసంస్థల బాధ్యత." కాని ఇది అమలు జరగడం లేదు. భాషాప్రయుక్త రాష్ట్రాల వల్ల ఈ విధంగా నష్టపోతున్నవారిలో తెలుగువారే ఎక్కువగా వున్నారు. అనేక చారిత్రక, సాంస్కృతిక, రాజకీయ కారణాల వల్ల మొత్తం దేశంలోని తెలుగువారిలో సగంమంది రెండు తెలుగురాష్ట్రాల బయటే వున్నారు. అందువల్ల వారి మాతృభాష కేవలం ఇంట్లో మాట్లాడుకోవటానికే పరిమితమై అణచివేతకు గురవుతున్నది. ఇది మానవహక్కుల అణచివేత గాక మరేమిటి?

ఈ నేపథ్యంలో సుప్రీంకోర్టు తాజా ఆదేశాన్ని పరిశీలించవలసి వుంది. మాతృభాషలో ప్రాథమిక విద్య అనే శాస్త్రీయ దృక్పథాన్ని స్వేచ్ఛకు ఆటంకం అనే కారణంగా కోర్టులు త్రోసిపుచ్చితే – ఇదేవిధమైన వాదాన్ని అన్నిరంగాలకూ వర్తింపజేస్తే – మొత్తం వ్యవస్థలన్నీ కుప్పకూలిపోవా? ఈ అంశం కూడా ఇప్పుడు చర్చకు రావాలి. ఈ పరిస్థితిలో భాషకు సంబంధించిన 350 వ అధికరణాన్ని మొత్తంగా పునఃపరిశీలించి, అవసరమైన సవరణలను తేవలసిన అవసరం వుందేమో రాజ్యాంగ నిపుణులు పరిశీలించాలి.

ఇప్పటి కేంద్రప్రభుత్వం మాతృభాషలను ప్రోత్సహిస్తామంటోంది. లోగడ ఎన్నడూ లేని విధంగా ఈ ఏడాది అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవాన్ని (ఫిబ్రవరి 21) మానవ వనరుల మంత్రిత్వశాఖ పూనిక వహించి – అన్ని రాష్ట్ర ప్రభుత్వాల అక్షరాస్యత, వయోజనవిద్య వ్యవస్థలతో కలిసి నిర్వహించింది. ఈ నేపథ్యంలో కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు మొత్తం దేశానికి సంబంధించి 'మాతృభాషావిధానా'న్ని అందరి ఆమోదంతో ముందుకు తేవలసి వుంది.

మాతృభాషల రక్షణకై అందరి సమ్మతితో ఒక జాతీయవిధానాన్ని రూపొందించితే అది భాషాపరమైన అన్ని సమస్యలను పరిష్కరిస్తుంది. దేశంలోని అన్ని భాషాజాతులవారు తమ అమ్మనుడులను కాపాడుకుంటూ సహజచైతన్యంతో అన్నిరంగాలలో ముందుకు సాగగలుగుతారు. దేశంలో భాషాపరమైన సంఘర్షణలు నశించి, ఐక్యతతో సమిష్టి సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడుకోగలుగుతారు. అప్పుడే రాష్ట్రాల్లో భాషావిధానం, దానితో పాటు విద్యావిధానం సరైనపద్ధతిలో సాగుతాయి.

**10-4-2015**

సామల రమేష్ బాబు

**ఏ రాష్ట్రంలో ఉన్నా ఏ దేశంలో ఉన్నా తెలుగువారంతా ఒక్కటే**

అట్టపై బొమ్మ

**- డాక్టర్ ఈమని శివనాగిరెడ్డి**

# కొత్తరాజధానిలో తెలుగుదనం ఉట్టిపడాలి!

తెలుగువారు రెండు రాష్ట్రాలుగా విడిపోయారు. భాషకు గుర్తుగా తెలంగాణ, జాతి పేరు మీదుగా ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలుగా పేర్లను సార్థకం చేసుకొన్నాయి. కోరుకున్నట్లే కొత్త రాజధానికి తెలంగాణ రాష్ట్రమన్న పేరును మూడుకోట్లకు పైగా ఉన్న తెలంగాణ ప్రజలు నిండుమనసుతో స్వాగతించారు. ఎపుడో క్రీ.పూ.3వ శతాబ్దంలోనే మౌర్యచక్రవర్తి అశోకుడు ఇక్కడి జాతి ప్రజలను 'ఆంధ్రులు'గా పిలవటంవల్ల, మద్రాసు నుంచి విడిపోయినపుడు కోస్తా ప్రాంత కొత్తరాష్ట్రానికి ఆంధ్రరాష్ట్రమని పేరు పెట్టుకొన్నాం. నిజాంరాష్ట్రంతో కలిసి భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటులో భాగంగా, 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. క్రీ.పూ. 3వ శతాబ్దం నుంచే వాడుకలో నున్న 'ఆంధ్ర'పదం, నిజానికి 'అంధక' శబ్దంలో బుద్ధునికాలం (క్రీ.శ.6-5 శతాబ్దాలు) నుంచే ప్రచారంలో ఉన్నట్లు సుత్తనిపాతం లాంటి బౌద్ధసాహిత్యంలో ఆధారాలున్నాయి. కొంతమంది పరిశోధకులు మరికొంతముందుకెళ్లి క్రీ.పూ. 8వ శతాబ్దినాటి ఐతరేయ బ్రాహ్మణంలోనే ఆంధ్రుల ప్రస్తావన ఉందని ప్రచారంగావించారు. ఇంతటి చారిత్రక నేపథ్యమున్న ఆంధ్రుల కొత్తరాష్ట్రం ఆంధ్రప్రదేశ్‌గానే కొనసాగుతున్నది.

ఇక కొత్త రాజధాని విషయానికొద్దాం. ఒక్కసారి చరిత్రపుటల్ని తిరగేస్తే, క్రీ.శ. 1వ శతాబ్దిలోనే శాతవాహనుల రాజధానిగా వెలుగొంది, తెలుగు-ప్రాకృత భాషలకు పట్టంగట్టిన అలనాటి (ధనకటకం), ఈనాటి అమరావతేనని తెలుగువారికందరికీ తెలుసు. ఆనాటి రాజధాని సువిశాల నగరంగా, కృష్ణాతీరరేవుపట్టణంగా, ఎత్తైన కోటగోడలతో, విలక్షణ బౌద్ధవాస్తుకట్టడాలతో, సమున్నతంగా శిల్పశోభితమై మహాస్థూపంతో, దేశీ, విదేశీవర్తకులు, బౌద్ధ భిక్షువులతో సార్వజనీన రాజధానిగా విలసిల్లింది. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి పాలిస్తున్నపుడు, రెండో బుద్ధునిగా పేరుగాంచిన మహాయాన బౌద్ధాచార్యుడైన నాగార్జునుడు నడయాడిన ప్రదేశంగా నాటి అమరావతి పేరుగాంచింది. ఇక్ష్వాకుల కాలాన్ని మినహాయిస్తే తొలి పల్లవుల రాజధానిగానూ, అటు తరువాత కోట (ధరణికోట) రాజుల రాజధానిగానూ కొనసాగింది. రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు తన జమీందారీని ధరణికోటకు మార్చుకొని, పక్కనే - దేవతల రాజైన ఇంద్రుని రాజధాని అమరావతిలా - కొత్త పట్టణాన్ని నిర్మించి 1797లో తన రాజధానికి 'అమరావతి' అని పేరు పెట్టుకొన్నాడు.

క్రీ.పూ. 3వ శతాబ్దిలో అశోకచక్రవర్తి పంపిన బౌద్ధభిక్షువు మహాదేవుడు ధాన్యకటకాన్ని చేరుకొని ధమ్మాన్ని ప్రచారం చేశాడు. స్థూపం చుట్టూ రాతికంచెను ఏర్పాటుచేసిన అశోకుడు వేయించిన చిన్న శాసనం కూడా అమరావతిలో దొరికింది. మంజుశ్రీ బోధిసత్వుడు, సుమేధ, సుధన, ఆచార్య నాగార్జున, ఆర్యదేవ, భావవివేక, బుద్ధఘోష, చీనీయాత్రిక భిక్షువు హుయెన్‌త్సాంగ్, శ్రీలంక బౌద్ధభిక్షువు ధర్మకీర్తి, టిబెట్ బౌద్ధ గురువు లామా తారానాథులు సందర్శించిన ధాన్యకటక-అమరావతిని ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కొత్త రాజధానిగా ప్రకటించటాన్ని అందరూ హర్షించారు. బౌద్ధులతోపాటు, అమరేశ్వరాలయమున్న అమరావతిని శైవులు, ప్రక్కనేవున్న క్రీ.పూ. 3వ శతాబ్దినాటి శైవస్థావరమైన వడ్డమాను వల్ల జైనులు, వైకుంఠపురంలో కొలువైవున్న వెంకటేశ్వరస్వామి వల్ల వైష్ణవులు - ఇలా అన్నివర్గాలవారు, మతాలవారూ హర్షాతిరేకాన్ని ఇప్పటికే ప్రకటించారు. ఆంధ్రనగరిగా కూడా పేరుగాంచిన అమరావతి, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్, నవ్యాంధ్రప్రదేశ్ రాజలాంఛనమైన పూర్ణఘట చిహ్నాన్ని అందించింది. విధికుడనే చర్మకారుడు స్థూపాన్ని అలంకరించటానికి క్రీ.శ. 1వ శతాబ్దిలో బహూకరించిన పూర్ణఘటశిలాఫలకం అమరావతికి చెందిందే.

ఇంతటి పేరుప్రఖ్యాతులున్న అమరావతి కొత్త రాజధానిగా రూపుదిద్దుకోబోతున్న సందర్భంగా ప్రభుత్వం ప్రతి నిర్మాణంలోనూ, ప్రభుత్వ కార్యక్రమాల్లోనూ తెలుగుదనం ఉట్టిపడేలా, గత వైభవ ప్రాభవాలు మళ్లీ దేదీప్యమానంగా వెలుగొందేలా ప్రధానకూడళ్లు, వీధులు, కార్యాలయాలు, సమావేశమందిరాలు, చరిత్ర, సంస్కృతి, భాష, కళల పట్ల కృషిచేసిన అలనాటి, ఈనాటి ప్రముఖ వ్యక్తుల పేర్లుపెట్టాలి. అలాగే అన్ని మతాలను ప్రతిబింబించే పేర్లను కూడా వ్యాప్తిచేయాలి. ప్రధానకూడళ్లలో ఆచార్య నాగార్జునుని లాంటి కాంస్య విగ్రహాలను ఏర్పాటుచేయాలి. గౌతమీపుత్ర శాతకర్ణి, హుయన్‌త్సాంగ్, కోట కేతరాజు, వేంగిచాళుక్య భీముడు, అనవేమారెడ్డి, శ్రీకృష్ణదేవరాయలు, వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు లాంటి వ్యక్తుల విగ్రహాలను కూడా నిలబెట్టాలి. తోరణాలు, ప్రభుత్వ భవనాల ముఖచిత్రాలు బౌద్ధసంస్కృతినీ తెలుగువారి కట్టడ కళనీ ప్రతిబింబించాలి. పురావస్తుశాఖ, భాషాసాంస్కృతికశాఖ, సమాచారశాఖ, ఉన్నత విద్యాశాఖలతో ఒక సమన్వయకమిటీని నియమించి, తెలుగుభాష-సంస్కృతిపై నిర్దిష్ట ప్రణాళికను రూపొందించడానికి ప్రభుత్వం పూనుకొని ఒక విధానాన్ని ప్రకటించాలి.

అందరూ ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. మనం మద్రాసు రాష్ట్రంతో కలిసి ఉన్నంతవరకూ తెలుగు సంస్కృతి, సంప్రదాయాలు యథాతథంగా కొనసాగాయి. విడిపోయి, రాజధాని హైదరాబాదుకు పోయిన తరువాత తెలుగుభాషను గానీ, సంస్కృతీ సంప్రదాయాలను గానీ ప్రభుత్వం పట్టించుకోలేదన్న విమర్శ బాగా వినిపిస్తున్నది. అందుకే తెలుగు సంస్కృతి వెల్లివిరియటానికి పక్కరాష్ట్రాలైన తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల బాటను అనుసరిస్తే బాగుంటుంది. ఇదే ఆంధ్రులంతా కోరుకొంటున్నారు.

**వ్యాసరచయిత - పురావస్తు పరిశోధకుడు**
**విజయవాడ కళాకేంద్రం. ఫోన్ : 9848598446**

అట్టపై బొమ్మ

– డాక్టర్ వావిలాల సుబ్బారావు

# ఆంధ్రుల వారసత్వ రాజధాని – అమరావతి



అమరావతి ఒక అందమైన పేరు. ఒక అందమైన కల్పన– త్రిదశుల నిత్యోత్సాహానికి – జ్ఞానుల కొలువుకు, పుణ్యఫలాలకు, భూలోకవాసులు ఆశించే చిరంజీవత్వానికి, పరమ సుఖాలకు, అమరత్వానికి చేసుకున్న కవితాత్మక కల్పన 'అమరావతి'.

అది కల్పనకాక వాస్తవమే అయి భువి నుండి దిగివస్తే ఎంత బాగుండునో అని సువిశాలమయిన నందనవనాన్ని తన ఉద్యానభూమిగ – తన నివాసాన్ని దేవేంద్రుని వైజయంతిగ మలచుకొని, తెల్లగుర్రాన్ని, తెల్లఏనుగును ఉచ్చైశ్రవ–ఐరావతాలకు ప్రతిరూపాలుగ సంతరించిన ఒక భావనాశబలుడు – వీరోత్సాహి అయిన రాజావాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తన జమీందారీకి ముఖ్యపట్టణంగా 'అమరావతి' అని ఏ శుభసమయాన నామకరణం చేశాడో అప్పటినుండి ఆ పేరు ఒక మధురస్వరమై అనేకసంస్థలకు, వ్యవస్థలకు శుభనామమై అలంకరించింది. రెండువేల సంవత్సరాల క్రితం రూపుదిద్దుకున్న శిల్పాలు 'అమరావతి శిల్పా'లయి దేశదేశాలలో కీర్తిని ప్రతిష్ఠించాయి.

*"చిన్న చిన్న రాళ్లు చిల్లరదేవుళ్లు / పల్లెనాట"*నన్న పదమురద్దు
*జీవశిల్పమిచట చిన్నెలుదిద్దుకో / గలిగె, మున్నె రాతి పలకలందు*

'మా తెలుగుతల్లి'కి వేసిన మల్లెపూదండలో అమరావతి మరుమల్లెయై ఆమె హృదయస్థానంలో నిలుస్తుంది. అమరావతి అంటే ధాన్యకటకం – అంటే ఆంధ్రశాతవాహనుల రాజధాని. రాచరికకేంద్రంగా ద్వితీయస్థానమేగాని ఆంధ్రుల సాంస్కృతిక వారసత్వ రాజధానిగా దానిది ప్రథమస్థానం.

*"......కరుడువారిన మాంద్యము వీడి లెమ్ము, నీ*
*ఘనతను పాడుకొమ్ము, మొనగాడవు కమ్ము, తెలుంగు బిడ్డడా!*
*అని తల నోరుచేసుకొను యప్పురి నంటిన కృష్ణవేణియున్"*

సూక్ష్మధ్వనులు వినగల చెవులున్నవాడు అమరావతి ధరణికోట క్షేత్రంలో (చారిత్రకనామం–ధాన్యకటకం) చరిత్రగౌరవం మనసులో నింపుకొని – వాహనాలరద్దీ, మైకాసురుల భీకరధ్వనులు సద్దుమణగిన తర్వాత – ప్రశాంతనిశీధిలో టి.వి.ల సెల్లుఫోన్ల నోళ్లుమూసి, కాస్త బయటకు వచ్చి నదీతీరంలోనూ, మహాచైత్య శిధిలాలవైపో, ధరణికోట కోటదిబ్బలవైపో కాస్త కాలుసాగిస్తే చరిత్ర సంవేదనలు తెలుస్తాయి.

☼ ☼ ☼

కృష్ణాస్రవంతి సరసన కూర్చొని, శిల్పులు తెల్లని శిలాఫలకాల ముందు ధ్యానులై విచ్చిన కనులతో శిలలలో దాగిన అపూర్వమూర్తులను, దృశ్యాలను ఉలుల ధ్వనులతో పిలవటం, ఫలకంలో నుండి ఫలకం పైభాగానికి వారిని చేయిబట్టి తీసుకురావటం వినిపిస్తుంది, కనిపిస్తుంది.

*"..... నిదురించువేళ గలదందురు రాతికి, దానినేర్చి నీ*
*మానసవీధి నిల్పు నతిమానుషశిల్పము గ్రుద్దినాడవే*
*మో నవశిల్పభారతి! నమోస్తు! ఋణంపడె జాతి నీకహో!"*

☼ ☼ ☼

కొంత దక్షిణదిశగా సాగితే మహాచైత్యక్షేత్రం, సుత్తపఠనాలు, అనేకమంది భిక్షువులు చేసే బృందగానంలాగా, మార్మిక మంత్రసంగీతం లాగా, మన మనసును శబ్దాలతోనే నిశ్శబ్దంలోకి పిలుచుకుపోతాయి. వెన్నెలనీడల్లో తరుచ్ఛాయల్లో పద్మాసన బద్ధులైన భిక్షువులు తమ మనసులలో లోనికి చూపు సారించి శూన్యతాన్వేషణ చేస్తూ బుద్ధత్వ యానంలో వివిధ అంతరువులలో లీలగా సాక్షాత్కరిస్తారు. "సుగతువాక్సుధలోన జొక్కిన హృదయంబు లరవిచ్చి కనుల మాటలందు" చున్నట్లు కనిపిస్తారు.

☼ ☼ ☼

మరికొంత పడమరగా ధరణికోటవైపు కాలుసాగించామా.... సైనికుల పదఘట్టనలు, తురంగ తరంగాలు, గజ ఘీంకారాలు, రథచక్రఘోషల సుదూర ధ్వనులు, విజయోత్సవాల కేరింతలు, స్వాగత గానాలతో పురకాంతల ఎదురుచూపులు, మసక మసక వెన్నెలలో దృశ్యాలు దృశ్యాలు కదలిపోతుంటాయి. మరికొంత ముందుకుసాగితే.....

నిరాడంబరమైన రాజసభ. సరళశిల్పాలతో సుందరమైన సింహాసనంపై ఉన్నది ఎవరు? రాజుగారే కాబోలు! దర్పంలేని రాజఠీవి. ప్రసన్న సుందరమైన ముఖతేజం, రౌద్రరేఖ లేని వీరత్వస్ఫూర్తి. అతిశయం

లేని దాతృత్వం. భీతిగొల్పని గాంభీర్యం. గర్వంలేని విజయశోభ. యజ్ఞశ్రీ శాతకర్ణి మహారాజు కాబోలు!

ఒక మహాలేఖను దౌవ్వారికుడు తెచ్చియిచ్చాడు. స్వీకరించి కనుల కద్దుకున్నాడు రాజు. ఆచార్యులవారు పంపిన లేఖకాబోలు – అన్నీ మరచి చదువుకుంటున్నాడు. నగరంలోనే ఉన్న ఒక మహాతత్త్వవేత్త, దక్షిణాపథ చక్రవర్తి, విజేత ఐన మహారాజును స్నేహితునిగా సంబోధిస్తూ, వ్రాసిన ధర్మలేఖ అదే "సుహృల్లేఖ–రత్నావళి". ".... గాలికెరటాలు శాంతి గీతాలు పాడి, ఎంత బౌద్ధము పండించెనీ ధరిత్రి"

*"అన్ని భోగాలు పోయి యిట్లున్న క్షేత్ర/మిట్టి యనుభూతి మనకిడునట్టిదైన / సర్వసౌభాగ్య శోభకాస్థానమైన / కాలమందిది యేస్వర్గ ఖండమౌనొ"*

అనుకుంటూ జ్ఞాపకాలలో తిరిగి తిరిగి వర్తమానంలోకి వచ్చేస్తాం.

☼ ☼ ☼

ఇవన్నీ ప్రతిరాత్రి మనసున్న ప్రతివారికి మనోచిత్రం మీద ప్రతిఫలించే దృశ్యాలే. ప్రపంచ సంస్కృతీ చరిత్రలో "అమరావతి"కి స్థిరమైన స్థానాన్ని కల్పించిన ఘట్టాలివి. మన అమరావతికి చారిత్రకమైన ఆనవాళ్లు ఏవీ? కోటలు ఏవీ! బురుజులు కనిపించవే! అగడ్తలెక్కడ? దర్బారు హాలు ఏదీ! దాదాపు 1500 సంవత్సరాల చరిత్రకు గురుతు లెక్కడ? అని వెతికే చరిత్ర పర్యాటకులకు తృప్తిగా ఒకటీ కనిపించదు. ఆ దొరకకపోవటమే మన సంస్కృతీ విలక్షణత.

మన సంస్కృతి విశిష్టత భౌతిక నిర్మాణాలలో కనిపించదు. మహావిజేతల రూపశిల్పాలలో కనిపించదు. దృఢమైన కోటలో, సుందర సమాధులలో కనిపించదు. మనచరిత్ర పేర్లు చెప్పుకొనటంలో తారీఖులు నమోదుచేసుకొనటంలో కనిపించదు. వాటిని వెల్లడించకుండా దాచు కొనటంలోనే కనిపిస్తుంది. వ్యక్తిగతమైన వివరాలను మరుగుపరచి, అందరకు దారిచూపగల తమ జనశ్రేయోదర్శనాన్ని మనముందుంచి, ప్రక్కకు తప్పుకొని అజ్ఞాతంలోకి అదృశ్యం కావటంలోనే ఆచార్యుల సంస్కృతి కనిపిస్తుంది. "స్వాతిశయ నిగ్రహమే సంస్కృతి" అన్న సూచన ధ్వనిస్తుంది.

ఏదీ అమరావతి? ఎక్కడ ధరణికోట. అంటూ వెతుక్కుంటూ వచ్చే చరిత్ర తీర్థయాత్రికులకు

*"పాడుబడినట్టి గుంట దీపాలదిన్నె / శిల్పపూర్ణత లేని విచిత్రశాల*
*కోట లేనట్టది ధరణికోటగండి / వేడికన్నీటి బిందువులే విధిగ గూర్పు"*

– అని నిరాశ కలుగుతుంది. భావనాలోకంలో మనకు నిర్మించుకోవాలి. *"కోటలు తుంగహర్మ్యములు గోపురముల్ మినుముట్టు స్తూపముల్ నేటికి వర్ణరూపమున నిల్చు చరిత్రలు"* .... కాని *"ఆచోటుల పాటిదుమ్మెగసి సుళ్లుగనిల్చి భ్రమింపగజేయు నీ వీటి తొంటివైభవము...."* ఆకాశాన్ని అంటిలేచే సుడిగాలులలోనే అన్ని ఔన్నత్యాలు ఊహించుకోవాలి. అంతా మన ఊహకే వదిలేశారు. అక్కడ ఉన్నవారు ఎవరూ పలకరు. ఎందుకో?

*మౌనముద్ర యిదేల! మా బౌద్ధరాజ ప్ర*
*సిద్ధశక్తుల దెల్పు బుద్ధదేవ!*
*మూకరోదనమేల! పూర్వాంధ్రశౌర్య వ*
*ర్ణన సల్పవమ్మ కృష్ణాస్రవంతి*
*శిలవోలె గుడిలోన నిలతేల! నీ క్షేత్ర*
*మభివర్ణన మొనర్పు మమరలింగ!*

అని అక్కడ ఉన్నవారినందరిని నిలదీశాడు ఒక కవి. వాటికి మనం సమాధానాలు వెతకాలి. పునర్నిర్మించుకోవాలి.

ఇది ఒకరి పని కాదు. ప్రభుత్వం ఒక్కరి పనిమాత్రమే కాదు. పూర్వవైభవ గౌరవాన్ని వారసత్వ సంపదగా గుర్తించి ప్రజలు కూడ తమ భక్తికి కార్యరూపం యివ్వకపోతే, అమరావతి ఒక అందమైన పేరుగా మాత్రమే మిగిలిపోతుంది. ధనసంపాదన ఒకటే లక్ష్యమైనపుడు, అందుకు వ్యాపారమొకటే మార్గమైనపుడు, "అనుభవమంతా నాకే" అనుకున్నంతకాలం–అట్లాంటివారినే కేంద్రంగా చేసుకొని అధికార ఉపగ్రహాలన్నీ పరిభ్రమిస్తున్నంతకాలం, నేలను నమ్ముకున్నవారి శ్రేయస్సు కన్న నేలను అమ్మకంపెట్టినవారి శ్రేయస్సే ప్రధానమై, వంకరచూపే శుభదృష్టి అనుకున్నంతకాలం స్వర్గం నరకంవైపుకే ప్రయాణిస్తుంది. అమరావతి అసురావతిగానే మారుతుంది.

అమరావతి అంటే ఒక నగరం కాదు. పూర్వరాజుల పాలనాకేంద్రం మాత్రమే కాదు. రాజ్యవిస్తరణ వీరగాథల సంస్మరణ స్థలం మాత్రమే కాదు, మతవిశ్వాసాల పాతరకాదు. అది ఒక ఉన్నత సంస్కృతీవికాసానికి ప్రయోగశాల. ప్రజాగతమైన ఉన్నత జీవన పరిణామమే దేశసంస్కృతి. అందుకు పునాదులు వేసిన మంగళానుభూతి అమరావతి. ఆ పునాదుల నుండి సంస్కృతీ పునర్నిర్మాణం జరగాలి.

*ఈ ధరాగర్భమందెన్ని ఆంధ్రుల సిద్ధ*
*శిల్పాలు సుషుప్త స్థితిని గనెనొ..!*
*ఈ పాటిదిబ్బల నెన్ని నిక్షేపము*
*లజ్ఞాతవాస మోక్షాభిరతులొ.!*
*ఈ మంటిలోతుల నెన్ని బౌద్ధ విశుద్ధ*
*ధర్మశాస్త్రములు భూస్థాపితములొ!*
*ఈ నేల యొడిలోన నెన్ని చారిత్ర శా*
*సనములు పండి విశ్రాంతి గొనెనొ !*
*కాలమెరుగును, మన ధాన్యకటకమెరుగు,*
*...............................................*
*......................................... తెల్గు*
*తల్లి యెరుగును, సృష్టిసంధాత యెరుగు.*

రాజ్యపాలన ఎట్లా ఉండాలో చూపిన చారిత్రక చక్రవర్తి అశోకుడు. ప్రజాధర్మమే రాజధర్మమని, ప్రజాక్షేమమే రాజ్యలక్ష్మమని, రాజ్య నిర్వహణలో అపూర్వ ప్రయోగం చేసినవాడు ఆ సమ్రాట్ అశోకుడు. అంతట క్షేమంకర పరిపాలకుని తీర్చిదిద్దటం కోసం సర్వకాలికమైన "రాజవృత్తోపదేశం" చేసినవాడు ఆచార్య నాగార్జునుడు. ఆబోధ ప్రసారమైనది ఈ అమరావతినుండే. ఆతడు రాజుకు వ్రాసిన లేఖలు "సుహృల్లేఖ–రత్నావళి". ప్రపంచ సాహిత్యంలోనే అమూల్యమైన రాజనీతి తత్వలేఖలు. సర్వదేశ సర్వకాల పరిపాలకులూ కొంత అయినా అధ్యయనం చేయదగినవి.

*ధర్మముకొరకె నీ రాజ్యము / కీర్తికొరకుకాదు – కామ్యములకునుగాదు*
*అట్లగుటచేతనే కల్గు పూర్ణఫలము / అన్యవిధమైనచో అన్ని యనర్థములె*

(పై సూక్తులు ఆచార్య నాగార్జునుడు రచించిన "రత్నావళి" నుండి అమరావతి గురించిన పద్యాలు కీ.శే.వావిలాల నరసింహారావుగారు రచించిన "విజయప్రస్థానము" ఖండకావ్యం నుండి)

ఇటువంటి సంస్కృతిని పునరుద్ధరించినపుడు మన రాష్ట్రము, రాజధాని అక్షరక్రమంలానేగాక ఆదర్శంలోగూడ ప్రథమస్థానంలో ఉంటుంది.

**రచయిత ఫోన్ : 9866402973**

# తడి ఇసుక



కనిపించని కమనీయ దృశ్యంలా
వినిపించని ఆనందార్ద్ర గీతంలా
తొలిశ్వాస ఎగరేసిన గువ్వ..... మా అమ్మమాట!

యాంత్రికత ముసుగులోకి జొరబడి
సహజస్పందనలు లేని కలల పంజరంలో
నన్ను నేను బంధించుకున్నప్పుడు
నా చుట్టూ ఆవరించిన నీడల్ని నులిమేసి
తోడయి నడిచిన ఊపిరిదీపం.... మా వూరి మాట!

అగ్నిపర్వతాన్నీ..... అణగారిన భావాన్నీ
బద్దలవుతున్న రహస్యపేటికల్ని
జారిపోనీకుండా జ్వలింపచేసి
అక్షరకణాలు అద్దింది.... మా గురువు పలుకుబడి!

బాల్యం తినిపించిన గోరుముద్దల పాట
నన్ను ఆప్యాయంగా అల్లుకోని రోజు
నాచుట్టూ గాలి కూడా స్తంభించిపోతుంది
గుండె గమకాలన్నీ అనుభూతుల్లో దాచుకుని
కాలనేత్రాలు మూసేసినట్లుంటుంది
పసగల తెలుగు పద్యాన్ని
దుఃఖమకుటంతో ముగించినట్లుంటుంది

ఆ విత్తనం ఎక్కడ మొలకెత్తుతుందో
విత్తనానికే తెలీనప్పుడు
మట్టి రంగుల గురించి మాటలెందుకు?
తోటిమనిషిని స్పర్శించినంత సహజంగా
నది నీటిని తాకినంత నిర్మలంగా
నా రక్తంలోకి ఇంకి
నాతోబాటు ఎదిగిన నా మాటని
గాలిగుప్పెట్లో నీరెండలా ఆరేసుకుంటున్నాను

మా వూరు నుంచి మరో వూరికి
నా మాట నుంచి మరో మాటకి
అంటుగట్టుకుంటున్నప్పుడు
ఒక నది... మరో నదిని కలుపుకున్నంత లాలనగా
పలుకు తేనెల్ని పరిమళాలతో ఇంకించుకున్న
తడి ఇసుకలాంటిదాన్ని !

నా మట్టిమూలాల్లోంచి
నడిపిస్తున్న ప్రాణశక్తిని వదిలేస్తే
ఆత్మదీపాన్ని ఆర్పేసుకున్నట్లేగదా!
అస్తిత్వ కవచాన్ని ఆగంచేసుకున్నట్లే గదా!
ఒక కెరటం వెనుక మరో కెరటం పుట్టేదాకా
సలసలకాగే సంఘర్షణలోకూడా
ప్రజల నాలుకలపై ప్రవహించే జీవనది ఎండిపోదు!

ఎదురొస్తున్న ఎడారుల్ని ఎదురీది
నిప్పుల్ని చల్లార్చి నిజాలను నిగ్గుదేల్చి
చరిత్ర కొమ్మలనిండా అల్లుకున్న
ఆంతర్య రహస్య వసంతం నాభాష!
నువ్వూ నేనూ తయారయిన మట్టి సాక్షిగా
నువ్వూ నేనూ మాట్లాడే యాసల సాక్షిగా
అందరం ఋణపడేది
ఆ నిశ్శబ్ద శబ్ద మాధుర్యానికే!

- డా॥ సి. భవానీదేవి
ఫోన్: 09866847000




■ కె.శ్రీనివాస్

# రెండు రాష్ట్రాలు: ఒక తెలుగు

**తెలంగాణలో కానీ, ఆంధ్రప్రదేశ్‌లో కానీ ఏలికలకు భాష, సంస్కృతి ఇటువంటి అంశాలపై దృష్టిసారించే తీరిక లేదు. ఒకరు నూతన రాజధానిని నిర్మించేపనిలోను, మరొకరు రాజధానిపై మరో అంతస్థు నగరం నిర్మించడంలోనూ బిజీగా ఉన్నారు. ఇద్దరూ చరిత్ర గురించి, సంస్కృతి గురించి గొప్పగా మాట్లాడుతున్నారు. కానీ సాంస్కృతిక విధానం ఒకటి ప్రభుత్వాలకు ఉండాలని, భాషాభివృద్ధి కోసం ప్రత్యేక చర్యలు తీసుకోవాలని వారికింకా స్ఫురించలేదు.**

**త్వ**రలో విడుదల కానున్న 'రుద్రమదేవి' సినిమా ఆడియో ఫంక్షన్ ఈమధ్య వరంగల్లు కోటలో జరిగింది. సినిమాలో గోనగన్నారెడ్డి పాత్ర ధరించిన అల్లు అర్జున్ ప్రేక్షకులను రంజింపజేయడానికి మచ్చుకు ఒక డైలాగ్ వినిపించారు. "నేను తెలుగు భాష లెక్క... ఆడా ఉంటా, ఈడా ఉంటా" అన్నది ఆ డైలాగ్. సినిమాలో ఏ సందర్భంలో ఆ డైలాగ్ వస్తుందో, కథలో గన్నారెడ్డిని ఏ ప్రాంతీయుడిగా పరిగణించారో మనకు తెలియదు కానీ, ఆ డైలాగ్ విన్నప్పుడు సమకాలిక రాజకీయాల స్ఫురణ కలుగుతుంది. ప్రాంతాలు వేరైనా, రెండు రాష్ట్రాల్లోనూ ఉమ్మడిగా ఉనికిలో ఉండేది తెలుగుభాషేనని, అదే మానసిక ఐక్యతకు ప్రాతిపదిక అనుకోవడంలో అనౌచిత్యం ఏమీ లేదు.

ఆ డైలాగ్ తెలుగుభాషాభిమానులందరికీ నిజంగా ఆనందం కలిగిస్తుందని చెప్పలేము. రెండు తెలుగు రాష్ట్రాలు నిజమే కానీ, అక్కడా ఇక్కడా నిజంగా తెలుగు మిగులుతుందా? మిగుల్చుకునే సంకల్పం రెండు సమాజాలకు, రెండు ప్రభుత్వాలకు ఉన్నదా? చరిత్రాంశ ఎంత మేరకు ఉంటుందో తెలియదు కానీ, భారతదేశ చరిత్రలోనే మహిళా పాలకురాలిగా విశిష్టతను కలిగిన రుద్రమదేవి మీద చలనచిత్రం నిర్మించాలన్న ఆలోచన రావడానికి తెలంగాణ ఉద్యమం వంటి సందర్భం అవసరమైంది. బౌద్ధచరిత్రలోనే ఒక అపురూప స్థలం, తెలుగువారికి గర్వకారణం అయిన అమరావతికి గుర్తింపు రావడానికి రాష్ట్ర విభజన అవసరమైంది. మరి తెలుగుభాష భవితవ్యాన్ని పట్టించుకోవాలన్న కర్తవ్యం ఉపన్యాసాల పరిధిని దాటి ముందుకు వెళ్లడానికి ఎటువంటి మహాపరిణామం జరగాలి? తెలుగువారి శాశ్వత మానసిక ఐక్యత గురించి పెద్ద పెద్ద మాటలు మాట్లాడేవారికి, అందుకు కనీస ప్రాతిపదిక తెలుగు అని, దాని ప్రాచీన వైభవాన్ని, ఆధునిక అవసరాలను గుర్తించడంలోనే ఆ అనుబంధం కొనసాగుతుందని ఎప్పటికి తెలుస్తుంది?

తెలుగు పేరుతో తిరణాలలు జరపడంలో మనవాళ్లకు ఉత్సాహం చాలా ఉన్నది. రెండు ప్రత్యేక ఉద్యమాల అనంతరం 1975లో మొదటి ప్రపంచ తెలుగు సభలు జరిగాయి. ఇటీవలి విభజన-సమైక్యవాదాల అలజడులు ఉధృతంగా ఉన్న కాలంలో తిరుపతిలో ప్రపంచ తెలుగుమహాసభలను కిరణ్‌కుమార్ ప్రభుత్వం నిర్వహించింది. విభజన జరిగిన తరువాత కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో ప్రభుత్వ ప్రోత్సాహంతో ప్రపంచ తెలుగు రచయితల సభలు జరిగాయి. ఈ సభలన్నిటిలోనూ తెలుగు భాషా సాహిత్యాల గురించి విస్తృతంగా ఈ చర్చలు జరిగాయి. విస్తృతంగా ప్రచురణలు జరిగాయి. భవిష్యత్తులో చేయవలసిన పనుల గురించి తీర్మానాలు కూడా అనేకం జరిగాయి. మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా కొన్ని నిర్మాణాత్మకమైన చర్యలను ప్రకటించడం. కొన్ని కొత్త సంస్థలను ఏర్పాటుచేయడం కూడా జరిగింది. అటువంటి సందర్భాలలో ప్రసంగాలు, కళాప్రదర్శనలు, సన్మానాలు ధారాళంగా జరుగుతాయి. తీసుకున్న నిర్ణయాలకు కొనసాగింపు ఉండదు. సభలకు, సభలకు మధ్య కార్యక్రమాలు ఉండవు. తెలుగును కాపాడుకోవడానికి, వికసింపజేయడానికి వ్యవస్థాగతమైన చర్యలేవీ ఉండవు. ఉద్యమాల ఊసు అసలే ఉండదు. ఉత్సవాలు, మహాసభలు జరిపేవారి ఉత్సాహాన్ని తక్కువ చేయనక్కరలేదు. కానీ, తెలుగు దుస్థితి గురించి నిరంతరం వలపోయడం, చెప్పుకున్న గత ఘనతలనే వల్లెవేయడం – వీటివల్ల ప్రయోజనం ఉంటుందా?

మొదటి మహాసభలు జరిగిన గడిచిన నలభై ఏళ్లలో తెలుగు పరిస్థితి మరింత తీసికట్టుగా మారింది తప్ప మెరుగుపడింది లేదు. నాడు ఏర్పాటుచేసిన అంతర్జాతీయ తెలుగుసంస్థ నామమాత్రంగా మిగిలి, విశ్వవేదికపై తెలుగును వెలిగించే కర్తవ్యం ముందడుగు వేయలేదు. పరిపాలనాభాషగా, పత్రికాభాషగా, బౌద్ధికభాషగా తెలుగును పరిపుష్టం చేయడానికి కావలసిన వ్యవస్థలను ఏర్పాటుచేసే ప్రయత్నమే జరగలేదు. తెలుగు మాధ్యమంగా విద్యాబోధన ఏ స్థాయి వరకు జరగాలి. అధ్యయన అంశంగా ఏ స్థాయి వరకు ఉండాలి అన్న దానిపై ఏకాభిప్రాయం లేదు. అతి వేగంగా విస్తరిస్తున్న ఇంగ్లీషు భాషను అంతే వేగంగా అనువదించుకోగల సామర్థ్యం తెలుగుకు లోపించింది. అందుకు సంకల్పపూర్వక ప్రయత్నాలు అవసరమన్న స్పృహ లేదు. భౌతిక శాస్త్రాలకు తెలుగుకు మధ్య దూరం పూడ్చలేనంతగా పెరిగిపోయింది. తెలుగుసమాజం ఉపాధి వేటలో కొన్ని రకాల చదువులకే పరిమితమై, మొత్తం విద్యావిధానం అందుకు అనుగుణంగా మారిపోయింది. ఇప్పటికీ నూటికి నూరుశాతం అక్షరాస్యత సాధ్యపడలేదనీ, అక్షరాస్యులలో ఇంగ్లీషు అక్షరాస్యులు, అర్ధ విద్యావంతులు మరీ తక్కువని గుర్తించాలి. తెలుగు మాట్లాడడం, రాయడం ఇప్పటికీ ఎంతో అవసరమైన అంశాలు. తెలుగును జీవన వ్యవహారభాషగా పెంపొందించు కుంటూ, అదే సమయంలో దాని సాహిత్య సాంస్కృతిక పార్శ్వాలను అభివృద్ధి పరుస్తూ, ఆధునిక పురోగామి అవసరాలకు అనుగుణమైన మాధ్యమంగా తీర్చిదిద్దుకోవాలి. ఎన్ని దేశాలకు వెళ్లినా, ఎన్ని డాలర్లు సంపాదించుకున్నా, అంతిమంగా మన ఉనికి భారతీయతపై, తెలుగుదనంపై ఆధారపడి ఉన్నది. లేకపోతే, సింగపూర్‌ను స్వప్నిస్తూ కూడా మనం అమరావతిని ఎందుకు పునరుద్ధరిస్తున్నట్లు?

ఈ నేపథ్యంలో అమెరికాలోని ప్రఖ్యాత ఎమోరీ విశ్వవిద్యాలయంలో తెలుగుపీఠం ఏర్పాటు కావడానికి ఎంతో ప్రాధాన్యం ఉన్నది. అమెరికాలోనూ, యూరప్‌లోనూ ఎక్కడా తెలుగుపీఠం లేదు. ఆ రకంగా ఇది చరిత్రాత్మకమైన సంఘటన. కానీ, అది సాధ్యం కావడానికి ఘనత వహించిన తెలుగు ప్రభుత్వాలు కానీ, ప్రతి రెండేళ్లకోసారి తెలుగుపేరుతో కోట్లాది డాలర్ల ఖర్చుతో అమెరికాలో సంబరాలు జరిపే సంస్థలు కానీ చేసిన దోహదం ఏమీ లేదు. పేదరికంలో పుట్టి పెరిగి, చదువుకుని అమెరికాకు వెళ్లి స్థిరపడిన ఒక తెలుగు శాస్త్రవేత్త కుటుంబం తమ స్వార్జితం నుంచి ఇచ్చిన విరాళాల వల్ల ఈ పరిణామం సాధ్యమైంది. ఐదేళ్ల కిందట ఈ ప్రయత్నం మొదలైనప్పుడు వేలూరి వెంకటేశ్వరరావు మరికొందరు రెండు లక్షల డాలర్ల దాకా సమీకరించారు. అంతకుమించి అడుగు ముందుకు పడలేదు. ఎమోరీ యూనివర్సిటీ వెబ్‌సైట్‌లో ప్రకటన కూడా ఇచ్చారు. ఆ యూనివర్సిటీలోని అంత్రొపాలజీ ప్రొఫెసర్ జాయిస్ ఫ్లుకిగిర్ కూడా ఇందులో చొరవ తీసుకున్నారు. ఇంతలో కొప్పాక విశ్వేశ్వరరావు, సీత దంపతులు 7 లక్షల 50 వేల డాలర్లు విరాళం ఇచ్చారు. ఇంకా అంత సొమ్ము కావాలి. ప్రొఫెసర్ ఇద్దరు ముఖ్యమంత్రులను కలిసి అభ్యర్థించారు. ఫలితం లేకపోయింది. వేల్చేరు నారాయణరావు, వేలూరి తానా, ఆటా సభలకు వెళ్లి విరాళాలు అడిగారు. వారికి ఆసక్తి లేకపోయింది. ఇక ఎక్కడి నుంచీ నిధులు అందవని నిర్ధారించుకున్న తరువాత, కొప్పాక దంపతుల పిల్లలే తమ తల్లిదండ్రుల పేరిట ఉన్న ఫౌండేషన్ నుంచి మిగిలిన సొమ్మును కూడా ఇవ్వాలని నిర్ణయించారు. అమెరికాలో కూడా అన్ని రంగాలలో విజయకేతనం ఎగురవేస్తున్న ప్రవాసాంధ్రుల ఔదార్యానికి ఉన్న సరిహద్దులను ఇది సూచిస్తున్నది. ఎమోరీలో తెలుగు విభాగం ఏర్పాటు కావడం వల్ల వెంటనే కనీసం ఒక తెలుగు ప్రొఫెసర్ నియామకం జరుగుతుంది. ఆ పదవికి అనుబంధంగా అనేక చిన్నస్థాయి బోధనా ఉద్యోగాలు ఏర్పడతాయి. అమెరికాలో వారు, ప్రపంచంలో తెలుగుపై ఆసక్తి ఉన్న వివిధ దేశాలవారు తెలుగు నేర్చుకోవడానికి, అధ్యయనం చేయడానికి ఆస్కారం ఏర్పడుతుంది. భాషల అధ్యయనం ఇతర ప్రపంచ భాషలలో ఎట్లా జరుగుతోందో తెలుగులో కూడా ఆ స్థాయిలో జరగడానికి వీలు ఏర్పడుతుంది. ఫ్రెంచివారు, జర్మన్లు, ఇజ్రాయిలీలు కోటాది డాలర్లు పెట్టుబడి పెట్టి అమెరికన్ విశ్వవిద్యాలయాల్లో తమ తమ భాషల విభాగాలను నెలకొల్పారు. భారతదేశం నుంచి వెళ్ళినవారికి ఆ దృష్టి లేదు. యూరోపియన్ దేశాల నుంచి వచ్చి మానవీయ శాస్త్రాలను చదివే విద్యార్థుల సంఖ్య అధికం. భారతదేశం నుంచి అందులోనూ తెలుగు ప్రాంతాల నుంచి వచ్చే విద్యార్థులు కంప్యూటర్ సైన్స్‌నో, ఇతర ఇంజనీరింగ్ విద్యలనో చదివేవారే అధికం. ఆ రంగాలలో చదవడానికి వచ్చి, ఉద్యోగులుగా స్థిరపడిన వారిలో కూడా తమ ఉనికిని సాంస్కృతికంగా పటిష్టపరచడానికి దోహదపడేవారు తక్కువ.

తామరతంపరగా అమెరికాలో పుట్టుకువచ్చిన తెలుగు సంస్థలు ఏటేటా చేసే ఖర్చుతో – తెలుగువారికి, తెలుగుభాషకు పనికివచ్చే నిర్మాణాత్మకమైన కార్యక్రమాలు అనేకం చేయగలరు. మన ప్రభుత్వాలు భాషకు, సంస్కృతికి ప్రోత్సాహం పేరుతో చేసే ఖర్చును కూడా ఆరోగ్యకరమైన పనులకు మళ్లించవచ్చు. ఎటువంటి ప్రయోజనమూ పద్ధతీ లేని సెమినార్లకు, సన్మానాలకు, అవార్డులకు నాలుగు డబ్బులు విదిల్చి అదే కళాపోషణ అని ప్రభుత్వాలు అనుకుంటున్నాయి. ఆ నిధుల కోసం సాంస్కృతిక దళారీలు, వ్యవహర్తలు పోటీపడతారు.

తెలంగాణలో కానీ, ఆంధ్రప్రదేశ్‌లో కానీ ఏలికలకు భాష, సంస్కృతి ఇటువంటి అంశాలపై దృష్టిసారించే తీరిక లేదు. ఒకరు నూతన రాజధానిని నిర్మించేపనిలోను, మరొకరు రాజధానిపై మరో అంతస్థు నగరం నిర్మించడంలోను బిజీగా ఉన్నారు. ఇద్దరూ చరిత్ర గురించి, సంస్కృతి గురించి గొప్పగా మాట్లాడుతున్నారు. కానీ సాంస్కృతిక విధానం ఒకటి ప్రభుత్వాలకు ఉండాలని, భాషాభివృద్ధి కోసం ప్రత్యేక చర్యలు తీసుకోవాలని వారికింకా స్ఫురించలేదు.

**డా॥ కె.శ్రీనివాస్ ఫోన్ : 9985411077**

***('ఆంధ్రజ్యోతి' 26 మార్చి 2015 నుండి మప్పిదాలతో – సం)***

– శ్రీమతి డి.పి.అనూరాధ

# సాటి తెలుగువారితో ఇలా వ్యవహరిస్తారా?

ప్రతి తెలుగు వాడూ చదవవలసిన నిజాలివి.

కుమారి.. శ్రీలంకలోనే పుట్టి పెరిగిన మన జాతి యువతి.. వీరి మాతృభాష తెలుగే.. వాళ్ల లాంటి మాటలు మాట్లాడేవాళ్లు చాలా దేశాల్లో ఉన్నారన్న సంగతి ఈ మన జాతి వారికి చాలా కాలం వరకూ తెలియదు.. ఇటీవల తెలుగు నేల నుంచి వెళ్లిన పత్రికల వాళ్లు.. ఛానళ్ల వాళ్లు ఈ మన జాతివారిని కలుసుకుని మాట్లాడటం వల్ల తమ గుంపు చాలా పెద్దదని వాళ్లకి తెలిసి వచ్చింది. శ్రీలంకలో అంతర్యుద్ధం ముగిసిన తరవాత భారతదేశం నుంచి వెళ్లే టూరిస్టుల రాక ఎక్కువైంది.. ఓ రోజు పనిమీద మార్కెట్టుకి వెళ్లిన కుమారికి కొంతమంది టూరిస్టులు తెలుగు లో మాట్లాడుకోవడం కనిపించింది.. ఎంతో ఆశ్చర్యంగా అంతే సంబరంగా వాళ్ల దగ్గరకి వెళ్లింది.. నేను కూడా మీ జాతి మహిళనే.. మా తల్లి బాస కూడా తెలుగే అని చెప్పడానికి ప్రయత్నించింది.. కానీ ఆమె మాటలను వాళ్లు అర్థం చేసుకోలేదు..పైగా బిచ్చగత్తెగా భావించి దూరంగా వెళ్లిపోయారట.. కుమారి వెంటనే ఇండియా లో తనకు తెలిసిన తెలుగు భాష కార్యకర్త సావెం రమేష్కు తన సెల్నుంచి ఫోన్చేసింది. అన్నా.. ఇక్కడ నా ముందు మన జాతి వాళ్లు ఉన్నారు. నేనూ వాళ్ల జాతి మహిళనే అంటే అర్థం చేసుకోలేక పోతున్నారు.. నువ్వు ఫోన్లో వాళ్లతో మాట్లాడన్నా అంటూ ఆయన్ను కోరిందట.. ఆయన సరే అనడంతో బయల్దేరడానికి సిద్ధంగా ఉన్న టూరిస్టు బస్సులో ఉన్న తెలుగు వాళ్లని వెతికి వారి చేతికి ఫోన్అందించిందట కుమారి. స.వెం. రమేశ్ ముందుగా అయ్యా నమస్కారం మీరు తెలుగువారా అని అడిగారట.. అవతలి నుంచి కాదు మేం తెలంగాణ వాళ్లం అంటూ విన్పించిందట.. సరే అండీ మీ మాతృభాష తెలుగే కదా అంటే కాదు మాది తెలంగాణ అంటూ అవతలి వ్యక్తి జవాబిచ్చాడట.. అయ్యా దయచేసి ఒక్కమాట వినండి.. మన రాజకీయ పరిధులను మన జాతి మీద చూపించొద్దు.. ఆ అమ్మాయి.. మన తెలుగు అమ్మాయి.. లంకలో మన తెలుగు వాళ్లు 9 లక్షల మంది ఉండారు.. ఆ అమ్మాయిని తెలుగు తోబుట్టువుగా భావించి అర నిమిషం మాట్లాడండి సంతోషపడుతుంది సార్ అంటూ రమేశ్ ప్రాధేయపడ్డారట.. అవతలి వ్యక్తి 'ఎందుకు మాట్లాడాలి.. ఎక్కడికి పోయినా అడుక్కుతినే వారి గోల తప్పడం లేదు.. మాకు వేరే పనిలేదని అనుకుంటున్నారా..



అడ్డమైన వాళ్లతో మేం మాట్లాడం అంటూ కటువుగా ఫోన్పెట్టేశాడట..' ఈ విషయం తెలిసిన వెంటనే నా మనస్సు చివుక్కుమంది.. పాపం కుమారి మనస్సు ఎంత విలవిలలాడి పోయింటుందో అన్పించింది. తోటి తెలుగు వారికి మనం ఇచ్చే గౌరవం ఇదేనా.. ఆప్యాయతతో అక్కున చేర్చుకోవలసింది పోయి ఇంతలా చీదరించుకోవాలా.. శ్రీలంక, మయన్మార్, మలేసియాలకు నేను వెళ్లినప్పుడు అక్కడి తెలుగు వారు కురిపించిన ఆప్యాయత.. అభిమానాన్ని ఈ సందర్భంగా మీతో పంచుకోవాలనిపింది..

## దొడ్డమనసున్న శ్రీలంక తెలుగోళ్లు..

నా వృత్తి జర్నలిజం.. బ్రిటీష్ పాలకుల సమయంలో వివిధ దేశాలకు వెళ్లి అక్కడే స్థిరపడిన తెలుగు వాళ్ల మీద డాక్యుమెంటరీలు చేయడానికి వివిధ దేశాలు వెళ్లాను.. ముందుగా శ్రీలంకతో మొదలుపెడతాను.. శ్రీలంకలో అహికుంటికలు అని అనాదిగా ఓ జాతి వారు ఉన్నారని వారి తల్లి బాస తెలుగని, వాళ్లు ఇప్పటికీ కోతులు.. పాముల్ని ఆడిస్తూ జీవిస్తుంటారని ఎప్పుడో ఈనాడు పత్రికలో చదివాను.. మరింత సమాచారాన్ని సేకరించి శ్రీలంకకు వెళ్లాను. ఓ ఎనిమిది రోజులు అక్కడే ఉండి వివిధ ప్రదేశాలలోని తెలుగు వారిని కలుసుకున్నాను..

కొలంబో నుంచి పుత్తలం వెళ్లేసరికి మధ్యాహ్నం మూడు గంటలైంది.. అందరి ఇళ్లకీ తాళాలు వేసి ఉన్నాయి.. నిరాశగా వెనుతిరుగుతుంటే ఓ పెద్దాయన కన్పించారు.. ఉదయం 6 గంటలకు

వస్తే అందరూ ఇళ్లల్లో ఉంటారు అనగానే ఓదార్పు లభించింది.. మరుసటి ఉదయం వెళితే వీధి వీధంతా కదలి వచ్చారు.. మా ఇంటికి రండక్కా మా ఇంటికి రండి అంటూ ఆహ్వానించారు. ఎన్నో కబుర్లు చెప్పారు.. అక్కడి నుంచి కుడాగమాకి వెళితే అక్కడా అంతే పరిస్థితి.. దంబుల్లా బౌద్ధాలయం దగ్గర ఉండే సోము – అక్కా నువ్వు నిన్న మా ఇంటికి వచ్చావట.. నేను ఇక్కడ ఉన్నాను నిన్ను కలుసుకోలేదే అని బాధపడుతున్నాను.. ఇక్కడ కన్పించావు చాలా సంతోషంగా ఉంది అంటూ నిమ్మకాయ షర్బత్ ఇప్పించాడు.. సోము వృత్తి కోతుల్ని ఆడించడం. మరుసటి రోజు సాయంత్రం దేవరగమకి వెళ్లాం.. అక్కడ మసక్క ఎర్రన్న, సరోజ, లక్ష్మి.. అబ్బో చాలా మంది.. అందరూ అక్కా.. చెల్లీ అంటూ సంబోధించేవాళ్లే.. మా ఆయన నీకు శ్రీలంకలో ఇంతమంది చుట్టాలున్నట్టు ఎప్పుడూ చెప్పలేదే అంటూ ఆశ్చర్యపోయారు. సిగిరియా కొండ కింద పాముల్ని ఆడించే మసన్న చాలా సేపు మాతో పాటే గడిపాడు.. మేమంతా కార్లో భోజనానికని హోటలికి వెళితే తనూ మోటార్‌సైకిల్ మీద ఫాలోఅయ్యాడు.. మాతో పాటే ఉన్నాడు.. బిల్లు తను చెల్లించడానికి వెళితే నేను వద్దని వారించాను.. శ్రీలంక మనకంటే ఆర్థికంగా వెనుకబడిన దేశం.. మన తెలుగు వాళ్ల జీవితాలు కూడా అంతే. ఇంకా చాలా చోట్ల సంచారజాతుల్లాగానే బతుకున్నారు.. చదువులు లేవు.. వారసత్వంగా వచ్చిన వృత్తుల్నే అంటే పురుషులు పాములు, కోతుల్ని ఆడించడం, స్త్రీలేమో అరచేతుల్ని చూసి జోస్యం చెప్పడం లాంటి వాటితోనే జీవనం సాగిస్తున్నారు.. కొద్ది మంది మాత్రమే చిరువ్యాపారాలు చేస్తూ జీవనం సాగిస్తున్నారు.. కానీ పెద్ద మనసున్నవాళ్లు.. నాకూ వాళ్లకూ ఉంది ఓ తెలుగు బంధం మాత్రమే.. ఎంతో ప్రేమను కురిపించారు..వీళ్లందరూ శ్రీలంకలోని మూల జాతుల్లో ఒకరైన తెలుగువారు. బ్రిటీష్ సమయంలో ఇండియా నుంచి వెళ్లిన తెలుగు వాళ్లని నేను కలుసుకోలేదు..


మయన్మార్‌లో తెలుగువారితో
వ్యాస రచయిత్రి శ్రీమతి డి.పి.అనూరాధ

## మయాన్మార్ తోబుట్టువులు

శ్రీలంక కంటే ఎక్కువ రోజులు మయన్మార్లో గడిపాను.. సుమారు 20 రోజుల్లో ఆ దేశంలోని అనేక ప్రాంతాలు తిరిగి తెలుగు వారిని కలుసుకున్నాను.. ఏ ఒక్క రోజు కూడా హోటల్లో బస చేయలేదు.. భోంచేయలేదు.. రెండున్నర లక్షల మంది తెలుగు వాళ్లం ఉన్నాం.. మీరు మా ఇళ్లల్లోనే ఉండాలి అని అన్నారు. యాంగాన్లో తెలుగు ప్రింటింగ్ ప్రెస్ నడుపుతున్న గణేష్ అనే వ్యక్తి వచ్చి చెల్లమ్మా ఈ దేశంలో సిమ్ కార్డులు దొరకడం చాలా కష్టం.. నా దగ్గర రెండు నెంబర్లు ఉన్నాయి. ఇది మీరు ఇక్కడ ఉన్నన్ని రోజులూ వాడండి.. నెల రోజులకు సరిపడా రీఛార్జ్ చేయించా అని సిమ్ కార్డుతో పాటూ ఇన్‌స్ట్రుమెంట్, ఛార్జర్ ఇచ్చారు. మీ పేరుతో పాటు ఈ సెల్ నెంబరును కలిపి కొన్ని విజిటింగ్ కార్డులు ప్రింట్ చేశాను అంటూ అవి కూడా చేతిలో పెట్టారు. ఎందుకు అన్నా ఇవన్నీ అంటే వినలేదు. ఈ దేశంలో మీరు ఇబ్బంది పడకూడదమ్మా.. యాంగాన్ అంటే రాజధాని నగరం కదా, ఇండియా గురించి అవగాహన ఉంటుంది అందుకే ఇంత మర్యాద అని సరిపెట్టుకున్నాను. దక్షిణ బర్మాలో ఉన్న తటోను అనే నగరంలో ఓ రోజంతా సందర్శించాను. నలుగురు యువకులు రెండు మోపెడ్లలో ఆ రోజంతా మాతో పాటే ఉన్నారు.. మేం కార్లో వెళుతుంటే వాళ్లు వెనక అనుసరించేవాళ్లు. ఆ నగరంలో ఓ తెలుగు గుడికి వెళ్లాం. నేను హారతి కళ్లకి అద్దుకుంటుంటే ఆ నలుగురిలో ఓ యువకుడు వెయ్యిరూపాయల నోటు(ఆ దేశ కరెన్సీ క్యాట్లలో) నా చేతిలో పెడుతూ హారతి పళ్లెంలో వేసి మొక్కుకో అక్కా నీకు మంచిగవుతుంది అన్నాడు.. నీ డబ్బులు ఎందుకు బాబూ వద్దు అన్నాను. ఓ తమ్ముడిగా మా అక్కకి ఇవ్వకూడదా అన్నాడు. మా దేశంలో హారతి పళ్లెంలో తప్పనిసరిగా డబ్బులు వేస్తాం అని చెప్పుకొచ్చాడు. పక్కనే బౌద్ధ పగోడాలో తిరుగుతున్నాను. అది చాలా పెద్ద ఆలయం. సూర్యుడు ఆరోజు చాలా తీవ్రంగానే ఉన్నాడు. బౌద్ధారామం కాబట్టి చెప్పులు బయటే విడిచిపెట్టాలి. నా అవస్థని వీళ్లు ఎలా గుర్తించారో ఏమిటో కానీ కాసేపటికి ఓ పెద్ద గొడుగు పట్టుకొచ్చి ఎండ నుంచి రక్షించారు. అంతా చూస్తే పాతికలోపు కుర్రాళ్లే.. వీళ్లకి ఎందుకింత అభిమానం. ఒకరోజంతా వాళ్ల పనులన్నీ మానుకుని నాతోపాటే తిరిగారే. ఒకవేళ వీళ్లు హైదరాబాద్‌కు వస్తే ఇంత సమయం నేను ఇవ్వగలనా అనిపించింది.

మేక్ అనే ఓ ద్వీపానికి వెళ్లాం. అక్కడ ప్రతి పది మందిలో ఏడుగురు తెలుగు వాళ్లు. ఆడవాళ్లు ఇప్పటికీ కుడి పైట వేసుకుని కన్పిస్తారు. ఇక్కడ నాయుడు హోటల్ అని ఉంది. ఇప్పుడు ఆ హోటల్ని నడిపిస్తున్నది నాలుగో తరం వాళ్లు. కానీ ఇప్పటికీ ఉప్మాపెసరట్టు, అల్లం చెట్నీ ఫేమస్. వీధులు వీధులు తెలుగువాళ్లవి ఉన్నాయి. అందరూ వచ్చారు. రోజంతా మాయింట్లోనే ఉండాలి.. మా ఇంటికి తప్పకుండా భోజనానికి రావాలి అని పిలిచేవారే .. మా బర్మా లో తెలుగు వాళ్లందరినీ కలవాలంటే మూడు నెలలు ఇక్కడే ఉండేలా రావాలి.. అంటూ అమ్మలక్కలందరూ నా చుట్టూ చేరారు.. వాళ్లలో చాలా మందికి ఇండియా

ఎక్కడుందో తెలియదు.. తెలిసినా అందులో తెలుగు నేల ఎక్కడుందో తెలియదు.. ఎందుకంటే ఎప్పుడో రెండు వందల ఏళ్ల క్రితం వారి తాతముత్తాతలు అక్కడి రబ్బరు తోటల్లో పనిచేయడానికి వెళ్లారు. తమ తల్లి నేల గురించి కథలు మాత్రమే వాళ్లకి తెలుసు. అటువంటి తల్లినేల నుంచి నేను వచ్చాననేసరికి నన్ను చూడాలని, నాతో మాట్లాడాలని ముచ్చటపడ్డారు. ఒక్కమాటలో చెప్పాలంటే కాలగమనంలో ఎప్పుడో తప్పిపోయిన వాళ్ల బిడ్డనో, అక్కనో, చెల్లినో మళ్లీ కలసినట్టుగా ఆత్రుతపడ్డారు. అక్కా ఓ ఫోటో అంటూ ఎంత మంది ఫోటోలు తీసుకున్నారో...

## మలేసియా తెలుగు ధనం

శ్రీలంక అయితే మనకంటే ఓ పదేళ్ల వెనక.. మయన్మార్ అయితే మనకంటే ఓ ఇరవై ఏళ్ల వెనక ఉన్న దేశాలుగా కన్పిస్తే.. మలేషియా మాత్రం మనకంటే ఓ ఇరవై ఏళ్ల ముందున్న దేశంలా అన్పించింది.. ఆర్థికంగా బాగా అభివృద్ధిచెందిన దేశం.. తెలుగు వాళ్లు కూడా బాగా స్థిరపడ్డారు. ప్రతి తెలుగు కుటుంబంలో ఇద్దరు ప్రొఫెషనల్ కోర్సులు చేసినవారే.. డాక్టర్లు, ఇంజినీర్లు, లాయర్లు, టీచర్లు ఇలా చాలా మంది తెలుగు వాళ్లు కన్పిస్తారు. చాలా చాలా బిజీగా కూడా ఉంటారు.. మలేషియాలోని తెలుగు వారిని కలవడానికి హైదరాబాద్ నుంచి వస్తున్నాం అని చెప్పగానే మలేషియా తెలుగు సంఘం అధ్యక్షుడు డాక్టర్ అచ్చయ్యకుమార్ చాలా సంతోషపడ్డారు. మీతో అన్ని ప్రాంతాలకు తిరగడానికి మాకు వీలు కాదు కాబట్టి మీకు తోడుగా తెలుగు టాక్సీ డ్రైవర్ని అరేంజ్ చేస్తాను. మీరు అడిగిన ప్రాంతాలకు అతడు తీసుకువెళతాడు అని భరోసా ఇచ్చారు.

2012లో తిరుపతిలో ప్రపంచ మహాసభలు జరిగినప్పుడు మలేషియాలో సెటిల్ అయిన తెలుగు సంతతికి చెందిన చప్పగడ్డి సుబ్రమణ్యం పరిచయం అయ్యారు.. కౌలాలంపూర్లో ఆయన్ని కలిశాను.. ఇక్కడ మా కూతురు ఉంటుంది.. మా స్వస్థలం కెడా.. అమ్మా మీతో పాటు నేనూ నా శ్రీమతి కూడా కెడా వరకూ వస్తాం.. దారిలో తెలుగు వాళ్లు ఉండే నగరాలకు.. తెలుగు వాళ్ల ఇళ్లకు మిమ్మల్ని తీసుకువెళతాం అంటూ 5 రోజులూ మాతో పాటే ఆ దంపతులు ఉన్నారు.. మా టాక్సీ డ్రైవర్ పేరు రావు .. చాలా నెమ్మది వ్యక్తి..

వాస్తవానికి అతడు డ్రైవర్ కాదు ఓనర్. అలాంటి టాక్సీలు అతడి దగ్గర మూడు ఉన్నాయట.. సర్వీస్ టాక్సీ వ్యాపారం చేస్తున్నాడు.. తనకి మలై, అరబిక్, ఇంగ్లీష్, తమిళం కూడా వచ్చట.. వాళ్లింట్లో తెలుగులోనే మాట్లాడుకుంటారట.. తెలుగు వాళ్లు ఎక్కువగా ఉండే తెరంగితాన్ అనే నగరానికి వెళ్లాం.. మేడం, మా పిన్ని వాళ్లు ఈ ఊర్లోనే ఉంటారు.. మిమ్మల్ని ఉదయం బ్రేక్ ఫాస్ట్కి తీసుకురమ్మన్నారు అంటూ మరుసటి ఉదయం వాళ్లింటికి తీసుకువెళ్లాడు.. ఇల్లు చాలా పెద్దగానే ఉంది.. పొలం పక్కనే ఇళ్లు కట్టుకున్నారు.. పాతిక ఎకరాల పామొలిన్, కొబ్బరి తోటలు ఉన్న ఆసాములు వాళ్లు.. కొబ్బరి బొబ్బట్లు, ఇడ్లీ సాంబారు, చెట్నీ, సెమీయా ఉప్మా , దోశె ఇలా ఎన్నో వెరైటీలు చేశారు మాకోసం.. మలేషియాలో పనివాళ్లు ఉండరట.. ఆమె ఒక్కతే ఇన్నిరకాలు వండిందంటే ఆశ్చర్యం వేసింది..

మరుసటి రోజు రావు వాళ్ల అమ్మానాన్న ఉండే ఇప్పో నగరానికి వెళ్లాం.. నేరుగా వాళ్లింటికే తీసుకువెళ్లాడు.. వాళ్ల నాన్నకు 70 ఏళ్ల వయసుంటుంది.. రావు వాళ్ల అమ్మ కూడా ఎన్నో రకాల వంటలు చేసింది.. ఎందుకమ్మా ఇంత శ్రమ పడ్డారు – హోటల్లో తినేవాళ్లం కదా అంటే 'మీరు మనోళ్లు. మనింట్లో కాక మరెక్కడ భోంచేసినా మేం బాధపడతాం' అంది పెద్దావిడ. రావు వాళ్ల నాన్న పేరు దేవుడు. అమ్మా ఇక్కడ మలేషియాలో మలై, చైనీస్, ఇండియా, ఇండోనేషియా ఇలా ఎన్నో జాతుల వాళ్లం ఒన్ మలేషియా అంటూ ఐక్యతగా జీవిస్తున్నాం. మరి అక్కడ ఇండియాలో తెలుగువాళ్లందరిలో ఎందుకు సఖ్యత లేదు. మన జాతి చాలా పెద్దది కదా.. కలిసికట్టుగా ఉంటేనే మనుగడ కదా మనవాళ్లు ఎందుకు ఇలా ఆలోచించలేకపోతున్నారు అంటూ ఆవేదన వ్యక్తం చేశారు. నిజమే. ఉమ్మడి తెలుగు రాష్ట్రంలో 9 కోట్లు.. ఇతర రాష్ట్రాలు, దేశాలలో ఉన్న తెలుగు వారి సంఖ్య మరో తొమ్మిది కోట్లు.. మొత్తం కలిపి సుమారు 18 కోట్లు. అంటే ఎంత పెద్దది!

కర్ణాటకలో కన్నడిగుల సంఖ్య 3.4 కోట్లు.. తమిళనాడులో తమిళుల సంఖ్య 3 కోట్లు..

ఈ దేశాలు తిరిగినప్పుడు అక్కడి తెలుగు సంతతి వారితో మాట్లాడినప్పుడు నాకు ఒక్కటే అన్పించింది. వాళ్లతో నాకున్నది రక్తసంబంధం కాదు.. చుట్టరికమూ లేదు. కేవలం తెలుగు బంధుత్వం. నాతో మాట్లాడినా మాట్లాడకపోయినా వారి జీవితాలపై ఎటువంటి ప్రభావం ఉండదు. అంతేకాదు తెలుగు నేలతో వాళ్లకు నేరుగా ఎటువంటి సంబంధాలు లేవు. కానీ నేను వాళ్ల జాతి అమ్మాయిని. వాళ్లను కలవడానికి ఎన్నో వేల కిలోమీటర్లు దాటి వచ్చాను. అందుకే వాళ్ల పనులన్నీ పక్కన పెట్టి నన్ను కలవడానికి ప్రాధాన్యం ఇచ్చారు. తల్లి వేరు మన నేల మీదే ఉంది. ఇక్కడి నుంచి అక్కడికి విస్తరించిన పిల్ల వేర్ల మీద వాళ్లున్నారు. వాళ్లకే తెలుగంటే .. తెలుగు వాళ్లంటే అంత అభిమానం ఉన్నప్పుడు తల్లి వేరు మీదే నివసిస్తున్న మనకు ఎంత ఉండాలి? పక్క దేశాల్లోని తెలుగు వారిని ఎంతలా ఆదరించాలి?! ప్లీజ్... ఒక్క క్షణం ఆలోచించండి..

**వాళ్లతో నాకున్నది రక్తసంబంధం కాదు.. చుట్టరికమూ లేదు. కేవలం తెలుగు బంధుత్వం. నాతో మాట్లాడినా మాట్లాడకపోయినా వారి జీవితాలపై ఎటువంటి ప్రభావం ఉండదు. అంతేకాదు తెలుగు నేలతో వాళ్లకు నేరుగా ఎటువంటి సంబంధాలు లేవు. కానీ నేను వాళ్ల జాతి అమ్మాయిని. వాళ్లను కలవడానికి ఎన్నో వేల కిలోమీటర్లు దాటి వచ్చాను. అందుకే వాళ్ల పనులన్నీ పక్కన పెట్టి నన్ను కలవడానికి ప్రాధాన్యం ఇచ్చారు. వాళ్లకే తెలుగంటే .. తెలుగు వాళ్లంటే అంత అభిమానం ఉన్నప్పుడు తల్లి వేరు మీదే నివసిస్తున్న మనకు ఎంత ఉండాలి? పక్క దేశాల్లోని తెలుగు వారిని ఎంతలా ఆదరించాలి?! దయచేసి ఒక్క క్షణం ఆలోచించండి..**

**రచయిత ఫోన్ : 09441829339**

చరిత్ర

- శ్రీ బొర్రా గోవర్ధన్

# తెలుగమ్మ ఒడిలో బౌద్ధం-2



అమరావతి బౌద్ధక్షేత్రంలో రచయిత

**బౌ**ద్ధగ్రంథం సుత్తపిటకంలోని ఖుద్దక నికాయంలోని సుత్తనిపాతంలోని పారాయణవగ్గలో ఉన్న బావరి, అతని శిష్యుల గురించి గత సంచికలో చూశాం.

దాదాపుగా అదేకాలంలో బుద్ధుని ప్రధాన శిష్యుల్లో ఒకరైన మహాకాత్యాయనుడు స్వయంగా తెలుగు ప్రాంతాలైన అస్సక, ములక రాజ్యాలకు వచ్చి బౌద్ధాన్ని ప్రచారం చేసినట్టు కూడా బౌద్ధసాహిత్యంలో ఉంది.

**'విమానవస్తు'లో :**

ఈ విషయం బౌద్ధగ్రంథం 'విమానవస్తు'లో ఉంది. ఈ గ్రంథం కూడా సుత్తపిటకంలోని ఖుద్దక నికాయంలోని గ్రంథమే. 'విమానవస్తు' అనేది బౌద్ధుల దేవలోకాలైన తుషిత, అభస్సర లోకాలలోని భవనాలు, ప్రదేశాల గురించి వర్ణించి చెప్పిన గ్రంథం. ఈ గ్రంథానికి ధర్మపాలుడు 'పరమార్థ దీపనీ' అనే వ్యాఖ్యానం రాశాడు. ఆ వ్యాఖ్యాన గ్రంథంలో అస్సక రాజ్య ప్రభువుకి మహాకాత్యాయనుడు బౌద్ధధర్మం ఉపదేశించాడని ఉంది. ఈ అస్సకరాజు తన కుమారునితో కలిసి బౌద్ధాన్ని స్వీకరించారనీ ఉంది.

**దీర్ఘ నికాయంలో:**

అలాగే... మరో సమాచారం....... అది,

సుత్తపిటకంలోని 'దీర్ఘనికాయం'లో కన్పిస్తుంది. ఆ గ్రంథంలో కళింగప్రాంతంలోని దంతపురం గురించిన వివరాలు ఉన్నాయి. ఈ దంతపురమే శ్రీకాకుళం జిల్లాలోని 'దంతవక్త్రుని కోట'గా గుర్తించారు. బుద్ధుని చనిపోయాక, బుద్ధుని దేహానికి అగ్నిసంస్కారం చేశారు. మిగిలిన బూడిదను, ఎముకల భాగాల్ని 8 భాగాలు చేసి 7గురు రాజులు, ద్రోణుడనే బ్రాహ్మణుడు కలసి పంచుకున్నారు. ఈ ధాతువుల మీద బుద్ధునికి పెద్ద పెద్ద సమాధులు నిర్మించారు. ఈ సమాధుల్నే చైత్యాలు, స్థూపాలు అంటారు.

'బుద్ధుని ధాతువుల్లో ఎడమ దంతాల్లోని ఒక దంతభాగాన్ని తీసుకున్న 'ఖేమథేరుడు' (క్షేమ స్థవిరుడు) అనే భిక్షువు, ఆ ధాతువుని కళింగరాజైన బ్రహ్మదత్తునికి ఇచ్చాడని, ఆ ధాతువుని ఒక బరిణెతో పెట్టి దానిమీద ఒక మహాస్థూపాన్ని నిర్మించాడని, దాని చుట్టూ ఒక పట్టణాన్ని నిర్మించాడని, అదే దంతపురం అని'దీఘనికాయంలో ఉంది.

అంటే.... బుద్ధుని కాలానికే బౌద్ధం ఇక్కడ బాగా వ్యాప్తిలో ఉందనేది దీనివల్ల తెలుస్తుంది. ఇంకా, ఈ దంతపురం నుండి ధాతువుల్ని తీసుకుని, నాగజాతి ఆధీనంలో ఉన్న ధాన్యకటకంలో ఒక ధాతుపేటికను ఉంచి, దానిమీద స్థూపం నిర్మించి, అక్కడనుండి మరో ధాతువుని తీసుకుని కృష్ణానది మార్గం గుండా ప్రయాణం చేసి, సముద్రం మీదుగా సింహళానికి (శ్రీలంక, సిరిలంక) చేర్చినట్లు కూడా బౌద్ధ గ్రంథాలు తెలియజేస్తున్నాయి. బౌద్ధగ్రంథాలు పేర్కొన్న కృష్ణానదీతీరంలోని 'వజ్రసైకతం' ఈనాటి కృష్ణాజిల్లాలోని 'పరిటాల'గా, 'మాజేరికా' అనే ప్రాంతం, మాజేరుగా చరిత్రకారులు గుర్తించారు.

బౌద్ధసాహిత్యంలో మన తెలుగు ప్రాంతాల్ని 'అంధక' ప్రాంతంగా పిలిచారు.

**జాతక కథల్లో:**

బుద్ధుని జాతకకథల్లో మూడో జాతక కథ "సేరివ వాణిజ జాతకం"తో కృష్ణానది విషయం ఉంది. కృష్ణానదిని తేలివాహకనది అంటారు. తేలివాహకం అంటే 'తైలంరంగుతో ఉన్న నీరు ప్రవహించేది' అని అర్థం.

గోదావరినీరు బురద రంగులో ఉంటాయి. గంగానది నీరు కూడా అంతే. కానీ కృష్ణానది నీరు తైలం రంగులో ఉండి 'నల్లగా' కన్పిస్తాయి. అందుకే దీన్ని నల్లనది అని, కృష్ణనది, నల్లవాగు, నల్లయేరు అనీ అంటారు. ఎందుకంటే....

భౌగోళికంగా ఇది దక్కను పీఠభూమిలో పుట్టి, ప్రవహించేనది. ఈ భూమ్మీద 400 కోట్ల సంవత్సరాల నాడు ఏర్పడ్డ 'గోండ్వానా' భాగంలో ఈ పీఠభూమి కూడా ఒకటి. అంత పురాతనమైన నేల ఇది. అగ్నిపర్వత చర్యలు జరిగి, లావా ప్రవహించి, ఘనీభవించిన పీఠభూమి ఇది. ప్రపంచంలోనే అతి పురాతన పీఠభూమి కావడం వల్ల, ఎన్నో కోట్ల సంవత్సరాలుగా వృక్ష జీవ సంబంధ పదార్థాలు కలసిపోవడం వల్ల నల్లరేగడినేలగా మారిపోయింది. ఈ నేలలో ప్రవహించడం వల్ల ఈ నది నీరు స్వచ్ఛంగా ఉంటాయి. నేల తీరు వల్ల నల్లగా కన్పిస్తాయి.

అందుకనే దీన్ని పూర్వకాలం నుండి 'తేలివాహకం' అనేవారు. పైగా ఈ నేల వ్యాపారపంటలకు అనువైంది. ఆ రోజుల్లో అత్యావశ్యకమైన ఇటుకల, కుండల పరిశ్రమకు పుట్టిల్లు అయ్యింది. వ్యాపారవర్గాల్లో బౌద్ధం చాలా బలీయంగా ఉండడం వల్ల కృష్ణా పరిసర ప్రాంత లోగిళ్ళన్నీ బౌద్ధానికి వాకిళ్ళు తెరిచాయి. అందుకే బౌద్ధసాహిత్యంలో తేలివాహన నదికి ఒక ప్రత్యేకత ఉంది.

**'అంధ'కు లంటే :**

జాతక కథలే కాదు, ఇతర బౌద్ధ తాత్త్విక గ్రంథాల్లో కూడా తెలుగువారి ప్రస్థావన ప్రముఖంగానే ఉంది. 'అంధ'శబ్దం పాళీపదం. ఇది సంస్కృతంలో 'ఆంధ్ర' అయ్యింది. బౌద్ధసాహిత్యం పాళీభాషలో ఉంటుంది కాబట్టి మన ప్రాంతాన్ని 'అంధక', అనీ, 'అందకులు' అనీ పిలిచారు. త్రిపిటకాల్లో ఒకటైన వినయపిటకంలో 'అంధకవనం', 'అందకవింద' అనే పదాలు ఉన్నాయి. అంటే అందకులు ఉండేవనాలు, అందకుల ఆరామాలు, అందకుల నివాస ప్రదేశాలు అని.

బావరి శిష్యులు బుద్ధున్ని కలసి వచ్చాక, ఇక్కడి నుండి కొంత మంది రాజగృహకు వెళ్ళారు. వారిలో కొందరు కళాకారులున్నారు. వీరు బుద్ధుని జీవిత చరిత్రని, బౌద్ధ ధమ్మాన్నీ పాడుతూ, కళా రూపాలుగా ప్రదర్శించే వారు. వీరంతా బుద్ధుడు ఉండే సప్తపర్ణి ఆరామం దగ్గరలోనే ఉండేవారు. వీరికి అక్కడ నివాసాలుండేవి. ఆరామాలుండేవి. మన తెలుగువారికి ప్రత్యేకమైన ఆరామా లుండేవి. అవే అంధక వనాలు. దీన్ని బట్టే ఎందరో తెలుగువారు ఆనాడే బౌద్ధ భిక్షులయ్యారని అర్థం చేసుకోవాలి.

బౌద్ధం పుట్టినప్పటినుండీ బౌద్ధ సంప్రదాయాన్ని గౌరవించడం, ఆచరించడం వల్ల ఎన్నో తెలుగు పదాలు బౌద్ధసాహిత్యం ద్వారా పాళీపదాలుగా మారిపోయాయి. పదాలే కాదు, పదబంధాలు, వాక్య నిర్మాణాలు కూడా కొన్ని తెలుగు భాషారీతిని పోలి ఉంటాయి.

కొన్ని పాళీపదాలు చూద్దాం

| | పాళీపదం | తెలుగు పదం | అర్థం |
|---|---|---|---|
| 1. | అచ్చ | అచ్చ | అందమైన |
| 2. | అక్ఖవాట | అక్కవాడ | వినోదక్రీడాకేంద్రం |
| 3. | అంగణ | అంకణం | రెండు దూలాల మధ్య ప్రదేశం |
| 4. | ఆంగుట్ఠ | అంగుట | ఉంగరపు వ్రేలు |
| 5. | అటవీ | అడవి | అరణ్యం |
| 6. | అడ్డ | అడ్డ | కుంచంలో సగం (కొలపాత్ర) |
| 7. | అప్పణ | అప్పనం | అప్పగించడం, పన్ను, కప్పం |
| 8. | గారవం | గారవం | గౌరవం |
| 9. | అడ్డరత్తి | అడ్డమరాతిరి | అర్థరాత్రి, నడిరేయి |
| 10. | అద్దా | అద్దా | నిజం |
| 11. | అధి | అధి | అధికం |
| 12. | అగలు | అగలు | అగరు, పరిమళద్రవ్యం |
| 13. | అబద్ధో | అబద్ధం | నిజం కానిది |
| 14. | అగ్గో | అగ్గడి | ముందరి భాగం |
| 15. | అగ్ఘ | అగ్గువు | వెల, ధర |
| 16. | అగ్గి | అగ్గి | అగ్ని |
| 17. | అగ్ఘియ | అగ్గించు | కీర్తించు, పొగడ్త |
| 18. | అయ్యా | అయ్య | ఆర్య |
| 19. | అమ్మా | అమ్మ | తల్లి |
| 20. | సప్పి | సప్పిడి | నెయ్యి |
| 21. | అమావాస | అమావస, అమాస | అమావాస్య |
| 22. | అంగ్ | అలగం | శరీరభాగం |
| 23. | ఆణి | ఆణి | బండిఇరుసుసీల |
| 24. | అన్నాం | అన్నం | భోజనం |
| 25. | ఆసా | ఆస | ఆశ |
| 26. | అర్! | ఆర్! | |
| 27. | అతి | అతి | ఎక్కువ |
| 27. | అయో | అయ్యకాడు | కరణం |

ఇలా – దాదాపుగా భాషాపరిశోధకులు కొన్నివందల తెలుగుపదాల్ని, పాళీపదాల్లో ఏరారు. డా॥కుర్రా జితేంద్ర బాబుగారు ఈ విషయంలో ఎంతో కృషి చేశారు.

ఇలా, ఎన్నో తెలుగు పదాలు పాళీపదాల్లో కలిసిపోయి ఉండటానికి కారణాలు–

ఒకటి : బౌద్ధ సాహిత్య భాష పాళీభాష కావడం!.

రెండు : ఎందరో తెలుగువారు తొలి నుండీ బౌద్ధంలో ప్రధాన పాత్ర పోషించడం.

అంటే... బౌద్ధానికీ – తెలుగువారికి అంతటి అనుబంధం ఉందన్నమాట. ఈ అనుబంధాన్ని ఈ పదబంధాలు తేటతెల్లం చేస్తున్నాయన్న మాట.

**బౌద్ధ వ్యాప్తికి:**

జాతకకథల్లో వారణాసి తర్వాత, ఆంధ్రప్రాంతానికి ప్రాముఖ్యత నీయడాన్ని బట్టి కూడా బౌద్ధంలో ఆంధ్రుల పాత్ర అర్థమవుతుంది. బౌద్ధాన్ని శ్రీలంక, బర్మా, థాయిలాండ్ (సువర్ణభూమి), గాంధార (ఆఫ్ఘనిస్థాన్) ప్రాంతాలకు మొదటగా తీసుకుపోయినవారు కూడా తెలుగు భిక్షువులే.

ఆనాడు కంచి కూడా బౌద్ధానికి కేంద్రంగానే ఉండేది. ఈ ప్రాంతానికి చెందిన 'బోధిధర్ముడు' తెలుగువాడేనని కొందరి అభిప్రాయం. చైనా దేశానికి బౌద్ధాన్ని తీసుకుపోయింది ప్రపంచానికి 'మార్షల్ ఆర్ట్స్'ను అందించింది ఈ బోధిధర్ముడే. (సెవెన్త్‌సెన్స్ సినిమా ఇటీవల వచ్చింది)

అశోకుని కుమార్తె సంఘమిత్ర, ఈనాటి తూర్పుగోదావరి జిల్లాలోని ఆదుర్రులో ఉండి, అక్కడ స్థూపనిర్మాణం సాగించి, అక్కడినుండి సింహళదేశం వెళ్ళిందనే, ప్రచారం ఉంది. చారిత్రక ఆధారాల్ని బట్టి అశోకుని కాలంలో భట్టిప్రోలు (గుంటూరుజిల్లా), అదుర్రు స్థూపాల్ని అశోకుడే నిర్మించాడని తేలింది. అశోకుడు మొత్తం 84 వేల బౌద్ధస్థూపాలు నిర్మించాడు. బౌద్ధసాహిత్య సర్వస్వం అయిన త్రిపిటకాల్లో 84 వేల గాథలు (శ్లోకాలు) ఉన్నాయి. వాటికి సంకేతంగా ఈ 84 వేల స్థూపాల్ని నిర్మించాడు. వాటిలో చాలా స్థూపాలు మన తెలుగునేల మీద ఉన్నాయి. వాటి వివరాలు తర్వాత చూద్దాం.

అశోకుడు వేసిన 14 పెద్ద శాసనాలు, మరో రెండు చిన్న శాసనాలు మన కర్నూలు జిల్లాలోని ఎర్రగుడిలో దొరికాయి. అందులో 'తాను ఉపాసకుణ్ణి అయినట్టు తెలిపాడు. బౌద్ధంలోని పంచశీలల్ని ఆచరించే గృహస్తుల్ని ఉపాసకులు అంటారు. తాను ఉపాసకుణ్ణి అయినప్పటికీ, ఒక సంవత్సరం తర్వాత సంఘాన్ని (బౌద్ధసంఘాన్ని) దర్శించుకున్నాననీ, అప్పటినుండే ఉత్సాహవంతుణ్ణయ్యాననీ ఆ శాసనంలోచెప్పుకున్నాడు. తానుచేసిన 256 ధర్మయాత్రలతో ఉత్సాహం మరింత పెరిగిందని' ఈ శాసనంలో ప్రకటించాడు.

ఇలా బౌద్ధధర్మాన్ని, బౌద్ధధర్మంలోని నైతిక నియమాల్ని శాసనాల ద్వారా ప్రకటించాడు. కాబట్టి వీటిని శాసనాలు అనకుండా "ధర్మలిపులు" అని అన్నాడు.

**తెలుగువారి స్థూపనిర్మాణం :**

బౌద్ధంలో స్థూప, చైత్య సంప్రదాయం ఉంది. అంటే చైత్యాలకీ, స్థూపాలకి పూజలు జరపడం. చనిపోయిన వ్యక్తి శరీరధాతువుల్ని ఒక బరిణిలో ఉంచి, దానిమీద నిర్మించే నిర్మాణమే చైత్యం. పాళీలో దీన్ని చేతియ అంటారు. ఇదో జ్ఞాపకచిహ్నం. స్మృతిమందిరం, అస్థికలు లేకుండా నిర్మించిన చైత్యాన్ని స్థూపం అంటారు.

ఈజిప్ట్‌లో పిరమిడ్లు కూడా చనిపోయినవారి స్మృతిచిహ్నాలే. కానీ, వారి శరీరాల్ని, ఎండబెట్టి మమ్మీలుగా మార్చి వాటిని ఒక గదిలో ఉంచి, వాటి మీద గొప్ప గొప్ప నిర్మాణాలు కట్టారు. ఫారోల మమ్మీలపై లేచిన స్మృతిచిహ్నాలే పిరమిడ్లు. అది ఒక మతాచారం. ఒక నమ్మకం. ఆత్మలు తిరిగివచ్చి ఆ ఎండిన శరీరాల్లోకి చేరతాయని, అప్పుడు ఆ రాజులు తిరిగి బ్రతుకుతారనేది వారి నమ్మకం. రాజు అలా బ్రతికినప్పుడు సేవచేయడం కోసం, కొందరు సేవకుల్ని, కొందరు సైనికుల్ని కూడా చంపి మమ్మీలుగా మార్చి ఆ గదిలోనే ఉంచేవారు. ఇదంతా ఒక మార్మిక సంప్రదాయం.

ఇలాంటి సంప్రదాయం బుద్ధునికి పూర్వమే తెలుగునేల మీద ఉంది. చనిపోయినవారిని, ఒక కొండను తొలిచి, ఆ గదిలో ఉంచేవారు. అలా వీలు కాకపోతే, రాతితో ఆ శవాలపై 'గుళ్ళు' కట్టేవారు. ఈ రాతిగుళ్ళు స్మశాన ప్రాంతంలో ఒకచోట ఉండేవి. ఇలాంటి 'గుళ్ళు' తెలుగునేలమీద ఎన్నోచోట్ల కన్పిస్తాయి. వీటికి 'రాక్షసగుళ్ళు' అని కాలాంతరంలో పిలిచారు.

**చైత్యం, స్థూపం-రాక్షసిగుళ్ళు:**

బుద్ధుని ధాతువులమీద కూడా ఇలాంటి గుళ్ళ నిర్మాణం తొలుత జరిగింది. ఆంధ్రదేశాలలో దొరికి కొన్ని చైత్యాల్లో ఇలాంటి ఆనవాళ్ళు దొరికాయి.

మహాజ్ఞాని, మానవీయవాది, దయామయుడు అయిన బుద్ధుని అవశేషాల మీద, ఈ 'రాక్షసిగుళ్ళను' పోలిన పెద్ద పెద్ద గుళ్ళు నిర్మించారు. అవే కాలక్రమంలో చైత్యాలుగా మారాయి. అంటే తెలుగునేలమీద ఒకనాటి మార్మిక 'గుళ్ళ' సంప్రదాయమే బౌద్ధచైత్యాలుగా రూపు దిద్దుకుందన్నమాట. అంటే... బౌద్ధంలోని చైత్యం, స్థూపంలాంటి సంప్రదాయాలు తెలుగువారి సంప్రదాయాలే.

చైత్యాల్ని, స్థూపాల్ని పూజించడం, గౌరవించడం నేర్పింది మనవారే. ఈ పూజావిధానమే, ఆ తర్వాత తర్వాత బౌద్ధంతో మహాయాన సంప్రదాయానికీ, వజ్రయాన సంప్రదాయానికీ (బౌద్ధమార్మిక వాదానికి) దారితీసింది.

తెలుగుబౌద్ధులు ఏర్పాటుచేసుకున్న బౌద్ధంలో ఒక శాఖని చైత్యక శాఖగా పిలుస్తారు. ఆ రోజుల్లో ఈ చైత్యాలు ఎంతపెద్దగా ఉండేవో. భట్టిప్రోలు, ఆదర్రు, అమరావతి, ఘంటసాల, నాగార్జునకొండ, వడ్డమాను, గోలి, గుడివాడ, పెదగంజాం, జగ్గయ్యపేటల్లో... చిన్న చిన్న కొండలంత చైత్యాలు ఉండేవి. అవన్నీ కాలగర్భంతో కలిసిపోయాయి.

**నాగార్జునసాగర్‌లో బుద్ధవనం:**

ప్రస్తుతం నాగార్జునసాగర్‌లో బుద్ధవనం ఉంది. ఇది మాన్యులు మాజీ ఐ.పి.యస్. అధికారి శ్రీ చెన్నూరు ఆంజనేయరెడ్డిగారి కృషివల్ల రూపొందిన వనం. దీనిలో ఆనాటి అమరావతి స్థూపాన్ని 'నిజమైన కొలతలతో' నిర్మించారు. దాన్ని చూస్తుంటే చైత్యాలు, స్థూపాలు ఇంత పెద్దవా! అని ఆశ్చర్యపోతాం. ఇలా వాస్తవమైన కొలతలతో భారతదేశంలో మూలానికి ప్రతిగా నిర్మించిన మొట్టమొదటి కట్టడం ఇదే కావడం కూడా మన తెలుగువారికి గౌరవమే!

ఈ స్థూపనిర్మాణాలు మొదట్లో కేవలం రాళ్ళగుట్టల్లా ఉన్నప్పటికీ, రానురాను దానిమీద శిల్పులు అద్భుతమైన కళాకౌశలం ప్రదర్శించారు. అందమైన, అపురూపమైన ఎన్నెన్నో శిల్పాలకి జీవం పోశారు. బౌద్ధస్థూపాలు శిల్పకళకి కొత్త జీవితాన్ని అందించాయి.

భారతదేశ బౌద్ధ శిల్పకళలో ప్రధానంగా మూడు శిల్పరీతులున్నాయి.

ఒకటి : గాంధారశిల్పకళ,

రెండు : మధురశిల్పకళ,

మూడు: అమరావతి శిల్పకళ.

వీటిలో అమరావతి శిల్పకళ అత్యద్భుతమైన శిల్పకళ.

బుద్ధుని జీవితచరిత్ర, జాతకకథలకు చెందిన అందమైన శిల్పసంపదను ఈ అమరావతి శిల్పకళాసంప్రదాయం ప్రపంచానికి అందించింది.

ఈ విధంగా... బౌద్ధ సాహిత్య సంప్రదాయానికీ, శిల్పకళా సంప్రదాయానికీ, చైత్య నిర్మాణ సంప్రదాయానికీ మన తెలుగునేల తొలినుండీ ముందే వుంది.

*(తర్వాత.... వచ్చేసంచికలో...)*

గోదావరి లోయలో
కొండరెడ్ల
బతుకు కతలు - 2

# ఎండిపోతున్న నీటివనరులు

- శ్రీ పల్లాల బ్రొంరెడ్డి

**మా**రేడుమిల్లి మండలం వైదపూడినుండి బందపల్లిమీదుగ, మద్దివీడిగ్రామము తాడేపల్లిమీదుగ, వేటుకూరి పంచాయితీపరిధి పులిగొంది పూజారి పాకలమీదుగ, నూరుపూడినుండి చిలకమామిడి మీదుగ, రంపకొండనుండి రంపమీదుగ, రంపచోడవరం మండలపరిధి వేములకొండనుండి వేర్లమామిడిమీదుగ, గిన్నెపల్లి మీదుగ, ఈ జలవనరులు సీతపల్లివాగులో కలసి పూడిపల్లి దగ్గర గోదావరినదిలో కలసినవి. ఈ జీవనదులు కాకుండ ఇంక ఎన్నో ఊటలు మన్నెంలో ఉండినవి. ఇవి అన్ని నిత్యం 40 సంవత్సరాల క్రితం పారుతుండెవి.

ఇవి 40 సంవత్సరాల క్రితం చెక్కుచెదరక ఉండివి. జనవరి, ఫిబ్రవరినెలలో కాలువనీటి పరిమాణం ఎంతఉండునో ఇప్పుడు వర్షాకాలం అంత పరిమాణంలో ఉంటున్నది.

40 సంవత్సరాల క్రితం 50 సంవత్సరాల వయస్సుయున్న ఈ జీవజలాలు, ప్రస్తుతం 10 సంవత్సరాల వయస్సుకు వచ్చినవి. వీటి శక్తి 40 సంవత్సరాలు తగ్గిపోయినది. ఇంక 10 సంవత్సరాలకాలంనాటికి ఇవి పూర్తిగ ఇనికిపోయే ప్రమాదం ఉంది. వీటి ఇనుకుడువలన గోదావరినది దెబ్బతిని పంటలు పండించలేని స్థితి ఏర్పడును. కరువుకూడ రావచ్చును. గిరిజనులు అనగా కొండపోడు వ్యవసాయం చేయు రైతులు వలస ప్రారంభించుతారు. ప్రస్తుతం పోడుభూమిలో దిగుబడి మునుపటివలె రావడం లేదు. పంటలు సకాలంలో వేయటంలేదు. వర్షాలు సకాలంలో కుర్సుట లేదు. అడవి అరణ్యంలో నూటికి 25 వంతు ఉన్నది. 75 వంతు ఖర్చు అయిపోయినది. అధికపంటను ఆశించి ఊటలు, సెలయేరులు, నూతులు ఉన్నచోట ఉన్న చెట్లు నేలమట్టం రైతులు చేయుచున్నారు. పూర్వం పర్వతం అనగ, కొండ మొదటిభాగంలో చెట్లుకొట్టి, అనగా పోడునరికి వ్యవసాయం చేసేవారు.

అధికపంటను ఆశించి పర్వతశిఖరంలో ఉన్న చెట్లు నరికి సేద్యం చేయుచున్నారు. భూమి, ఆకాశం, సూర్యుడు దగ్గరై వేడివలన జీవజలములు, ఊటలు, నూతులు, సెలయేరులు రోజురోజుకు క్షీణించిపోతున్నాయి.

గాలిని, నీటిని కొని ఎవరు బ్రతకలేరు. వాటికి శాపాలు, కష్టాలు వస్తే మానవాళి మనుగడలేదు. చెక్‌డాములపేరుమీద ఊటలు, సెలయేరులు అధికంగా దెబ్బతింటున్నవి. ప్రతిరైతు వరిని పండించుదామని, బాగుపడదామని, కొండచేను పండుటలేదని ఊటలు, నూతులచుట్టూ ఉన్న చెట్లు నరికి పొలం చేయుచున్నడు. ఒకప్పుడు ఎవరో



ఒకకన్ను పోయిదని అది కావాలని తపస్సు చేయుచున్నడని, మరొకడు వీడిని, నీవు ఏమి చేయుచున్నావో నీ వాటాలో నాకుకూడా అన్నడట. అలాగే అన్నడట అవతలి తపశ్శాలి. మొదటివాడికి ఉన్న ఒకకన్నుకూడ పోయిదట. వాటా కోరినవాడికి హాయిగ ఉన్న రెండుకండ్లు పోయివట. అలాగ ఈ పథకాలవలన ఉన్న ఊటలు పోగొట్టుకొనుచున్నరు. మొదటి సంవత్సరం చెట్లు నరుకుతున్నరు, రెండవ సంవత్సరంకు ఊటలు ఎండిపోతున్నవి.

**పూర్వం కాలువలు దాటివచ్చి కొలతలు చెప్పేవారు**

1. చీలగిర్తలకి - అరికాలుమీది అతుకు.
2. ఒరదుమ్ములకి - చీలగిర్తకి కాలిముడుసుకు మధ్య.
3. బొట్టుముడుకులకి - ముడుకుసమానం.
4. ఎదురుతొడలకి - ముడుకుమీది మధ్యనుండి ముడ్డితుంటుకింది మెత్తనిభాగం.
5. మక్కకీలకి - నడుముకింది ముడ్డి అతుకు.
6. మొలకట్లుకి - కట్టుపంచె మొలతాడుకట్టుచోటు.
7. బొడ్డు సేరుకు - బొడ్డుఉన్న భాగం పరిమాణంలో కాలువ ప్రవహించుట.
8. చంకలకి - చంకల ఎత్తున ప్రవహించుట.
9. కుత్తికెలకి - పీకలఎత్తు పరిమాణంలో ప్రవహించుట.

అయితే కాలువలు ఎదురుతొడల ఎత్తుమించి ప్రవహించితే, ఆ కాలువలు దాటి ప్రయాణం చేయరు. మొలత్రాడుకట్టిన హద్దునుండి మెడ పీకవరకు ప్రవహించు కాలువ ప్రమాదం అని అందులో ఈత, దాటు ప్రయత్నం చేయరు.

## అడవిలో రకాలు

మన్నెం అంటె అడివి. అడవిలో రకాలు: 1. కారడవి = ఎవరు చేను చేయనిది.

2. తారటడవి = చేను చేయుటకు అనుకూలమైనది. 3. లేతచిడిగ = చేను చేసి వదలినది.

అడవిలో 1) కొండలు, 2) మెట్టలు, 3) గొమ్ములు, 4) గొందులు, 5) చిడిగలు, 6) లొవ్వలు, 7) చెలకలు, 8) బందలు, 9) కోరెములు, 10) మొనొర్లు, 11) ఒడిదద్కులు, 12) జవుకలు, 13) రొంపొర్లు, 14) కట్టవలు, 15) తరుగులు, 16) జర్రులు, 17) గొప్పులు, 18) వగ్గలు, 19) వేణం, 20) మందం, 21) బురద, 22) కరిగినబొక్కలు.

**జంతువులు స్థలాలు**

1. మెట్ట, 2. ఒడిదదక, 3. లొద్ది, 4. గొంది, 5. తారటి అడవి, 6. లంక, 7. కొండ, 8. కట్టువలో తేనెపట్లు ఉంటవి.

9. రాతిగుహ – లాగబొక్కలో: నేదులు, ఎలుగుబంట్లు, పాములు, పులులు, నక్కలు, రెంచుకుక్కలు, అడవిపందులు వర్షాకాలంలో ఉంటవి.

**రాతిగుహలో సంతానం ఎత్తు జంతువులు:** 1. రెంచు, 2. పులి, 3. ఎలుగు, 4. నేది, 5. పాములు

**కొండలు – పర్వతాలు:**

1. కొండ అంటె ఒకటి మాత్రమే.
2. పర్వతం అంటె కొండలన్నీ కలిసి.
3. మెట్ట అంటె చిన్నది.
4. గొమ్ముఅంటె కొండలో ఉండు మొన.
5. కొండలో ఏటవాలు భాగాన్ని కోరెం. ఎక్కలేనిచోటును తరుము. ఇటువంటిచోట తేనెపట్లు కడతవి.
6. కొండపైన రెండుకొండలకిమధ్య కుంగిఉండే భూభాగం జవుక.
7. రెండు కొండలమధ్య ఉండే భాగాన్ని గొంది.
8. తలకిందులుగ ఉన్న భూమిని, దిగురుజర్రి. జర్రి కిందకి దిగితె, జారి పడిపోతరు. గుర్రపు జర్రిఘాటి.
9. ఎకురుగొండ మనుష్యులు కొండపైభాగంకు వెళ్ళుట కొండతేలడం.
10. కొండపైనుండి కిందకి దిగడం దిగురుగొండ.
    **చేటవేణం:** వేణం అనగా కొండ పైభాగం. పెద్దపెద్ద కొండలకి పైభాగాన మైదానం ఉంటది. 'పదునైన భాగం'లో మెత్తటి కోపిరిగడ్డి – నులకగడ్డి – గలగడ్డి – చిట్టి ఈతతుప్పలు బలిసి ఉంటవి. అవి మనం దూరంనుండి చూచినట్లు అయితె బాగ ఎన్నువిరిచి పండిన పొలంలాగ కనిపించుతది. దానిని వేణం అంటరు. ఆపై కొండభాగం మనం వాడుకొనే చేట ఆకారం 'చేటవేణం'.
11. కొండపైభాగంగల వేణం అంచునఉన్న నల్లటి రాళ్ళు కట్టువరాళ్ళు.
12. లాగబొక్క: కొండవేణం అంచులోను, కొండలో పెద్దపెద్ద బండరాళ్ళు ఉంటవి. ఆ రాళ్ళకి లోపట బొక్క లాగబొక్క
13. కొండ పైభాగం భూమి 'మందం'. మందంలో నున్నటిగడ్డి ఉంటది.
14. ఈ వేనపుగడ్డిపుంతలలో జూలైనెలకి వేనపుపిల్లెండ్లు అను కొక్కులు దొరుకుతవి. ఆ వేణంలోఉన్న చిట్టి ఈతతుప్పలలో ఈతమొవ్వులు తీసుకొని తింటరు.
15. కొండభూమిలో జంతువులు తిరిగె దారిని 'సాలు' అంటరు. దిగురుకొండ కిందికి దిగి పారిపోవు దారిని 'ఉర్కు' అంటరు. ఈ దారులు జంతువులకితప్ప మనుష్యులవి కాదు.
17. కొండలో మంచినీళ్ళు అంతగ దొరకవు. కొండపైన జంతువులు ఎక్కువ ఉండవు. కొండలో కొన్ని జంతువులు. చెట్లు ఉంటవి. తినే ఆకుకూరలు ఉంటవి.
18. కొండ భూభాగంలో:

1. రోకలిబండలు, 2. తేనెలు, 3. పులులు, 4. దుప్పులు, 5. చెవులపిల్లులు, 6. బెంతులు (ముంగిసలు), 7. పూతపిల్లులు, 8. పందుబిల్లులు (పిల్లులు), 9. కణుసులు, 10. పందులు, 11. నేదులు, 12. గుఱ్ఱగేదెలు, 13. రెంచ్‌కుక్కలు, 14. అడివికోళ్ళు (పెద్దవి), 15. తొగరుకోళ్ళు (చిన్నవి), 16. పురోడిపిట్టలు, 17. గుడ్డుపూరోడిపిట్టలు, 18. పిట్టలు, 19. నెమలిపిట్టలు, 20. జాలరిగిద్దులు, 21. వాలుగలు, 22. ఉడుములు, 23. వెదురెలుకలు (చిన్నగొర్రెలు), 24. ఈతగొర్రెలు, 25. అడవిగొర్రెలు, 26. ఎలుగుబంట్లు, 27. పెద్దపులులు, 28. సవరలమెకములు, 29. చిరుతపులులు, 30. కోతులు, 31. బండలు, 32. పాములు, 33. జెర్రలు, 34. తెల్లు (పొట్టెలు), 35. ఎలుగుతింద్రలు – చిన్నపురుగులు, 36. గద్దలు మొదలగునవి.

**ఇంక తినేవి**

1. అడ్డకాయలు, 2. తంగుడు అడ్డకాయలు, 3. పిడిదుంపలు, 4. నూనెదుంపలు, 5. వైయుడుముంపలు, 6. నారదుంపలు, 7. గింటుగుదుంపలు, 8. చవిదెదుంపలు, 9. చేదదుంపలు, 10. వెర్రి చేదదుంపలు, 11. మామిడిపండ్లు, 12. పనసపండ్లు, 13. అనాసిపనసపండ్లు, 14. బొడ్డపండ్లు (వేరుబొడ్డ), 15. పోలపండ్లు, 16. జారికెపండ్లు, 17. మొల్లికపండ్లు, 18. ఈతపండ్లు, 19. పర్మిపండ్లు, 20. మారోడిపండ్లు, 21. బూసిపండ్లు, 22. కొర్కుబూసిపండ్లు, 23. పుల్లపర్మిపండ్లు, 24. తుమ్మికెపండు మొదలగునవి.

## వేటలో వేయిగండాలు

మన్నెంలో ప్రతిసంవత్సరం వేసవికాలంలో ప్రతిగ్రామంలో రైతులు వింటిబద్ద(విల్లు, బాణాలు), కోలలు; వీపుభాగాన చేపటికత్తి కూడపెట్టుకొని అడవికి వెళతరు.

ఒకరోజున గొందికోట గ్రామరైతులు వేటకని అడవికి వెళ్ళిరి. కొండలోఉన్న అడవిని రెండు సరిహద్దులుపెట్టుకొని (ఒడ్డు కట్టు) సొంపడం మొదలుపెట్టిరి. సొంపర్లు కాపర్లు విడిపోయిరి. సొంపర్లు అంటె సరిహద్దుపెట్టుకున్న కొండలోని అడవిలో దూరి 'పుచ్చు, అదిగో' అంటూ అరుస్తూ అడవిలో గడ్డిడొంకలో తుట్లలో, చెట్లచాటున, గొందుల(లోయ)లో దాగిన అడవిజంతువులను తోలుకొని, తరుముకొని వెళతరు. కాపర్లు వెనకముందు కొంత దూరం అడవిలో నక్కి బాణాలు ఎక్కుపెట్టుకొని నిశబ్దంగా నిలబడి ఉంటడు. సొంపర్ల భయంకు జంతువులు బయటికివచ్చి అవి ఇదివరలో తిరుగు సాళ్ళలో (దాదిజీ) పరుగుపెడతవి. అదే దారిలో కాపరి ఉంటరు. ఆ దారిలో వచ్చిన ప్రతి జంతువును కాపరి వేస్తడు. చంపుతడు.

అడవిలోనికి వేటకెళ్ళినవారిలో ఒకభాగంవారు కాపు అనగా జంతువులు తప్పించుకొని పారిపోయే 1) ఉర్కు, 2) సాలులలో విల్లు



బాణాలతో ఉంటరు. వారి దారిలో జంతువు వెళ్ళితే కోలలతో(బాణాలు) వేసి చంపుతరు. 3) భాగలు అరణ్యంచుట్టు రాళ్ళురువ్వుతూ 'పుచ్చు' అంటూ వేపులను(కుక్కలు) ఎగలించుతు ఆ అరణ్యంలోదూరి, డొంక(తీగ) అనక, ముళ్ళున్న గొయ్యి అనక, పులులనక, ఎలుగులనక, పాములనక భయంలేకుండా తూరి(దూరి) సోపుతరు. వారి చప్పుడుకు అడవిలోఉన్న జంతువులు బయటికి పారిపోయే ప్రయత్నం చేస్తవి.

సాలు, ఉర్కు అనగా జంతువులు తిరుగుటకు ఎంచుకున్న బాట. పులులు, రెంచుకుక్కలు జంతువులని వేటాడి చంపబోవు సమయంలో ఈ దొంగదారులలో పారిపోతవి. ఆ దారులను వేటగాళ్ళు, వాటి అడుగుల ఆనవాళ్ళు గుర్తుంచుకుంటరు. ఆ గుర్తు ప్రకారం, ప్రతికాపరి ఆ దారికి కాపుకు పోయిఉంటడు. చప్పుడుకు బెదిరిపోయిన జంతువులు ఆ దారిలో పారిపోయి వస్తుండగ, ఇనుముతో తయారుచేసిన కోలతో(బాణం) వేస్తడు. ఇంకా బతికిఉంటే మిగిలిన బాణాలతో వేసి చంపుతడు.

అదేవిధంగ కాపరి సాలులో కాపల కాచుకొని ఎకురుకొండలో ఉన్నడు. కాపరి ముందు పక్క చూస్తున్నడు. ఎలుగుబంటి కాపరి వెనుకపక్కన వచ్చి, మక్కలను పట్టి కరవటం మొదలుపెట్టిదట. కాపరి వెరుచుకొని(భయపడి) దిట్టరెగి (తమాయించి) ధైర్యంచేసి, ఇంక చేసేది ఏమీలేక, తనచేతిలో ఉన్న కోలల(బాణాల) కట్టతో చిల్లలతో ఇదో అదో అంటూ అరుస్తూ ఆ బాణాలకట్టతో కొట్టిడట. అందులో ఒకబాణములోని చిల్లలకోల చిల్ల, ఎలుగు ముక్కులో గుచ్చిదట. కాపరి మరల ఎత్తి, కరుస్తున్న ఎలుగు మూతిలో కొడుతుంటె.... గుచ్చిన చిల్ల రావటంలేదు.

కోలతో ఎలుగును గుచ్చి దానిని నిలబెట్టి అరుస్తుఉన్నడట. కొంతదూరంలో పైభాగంలో కాపలకాస్తున్న కాపరి, ఇతని అరుపులు, కేకలు విని, కిందికి అతనివద్దకు వచ్చి చూచి, బాణం చిల్లగుచ్చిన ఎలుగును మరొక కాపరి అతని బాణంతో వేసి చంపిడట. రెండవకాపరి లేకపోతే, ముక్కులో ఉన్న చిల్ల ఊడిపోతే, కాపరికి మరణం తప్పదు.

# మన్నెంలో రోగాలు

1. **జ్వరం** – వేడి అధికం. **చలిజ్వరం** – వనుకు వస్తది.
   **వరుసజ్వరం** – రోజు తప్పించి వచ్చే జ్వరం. **వేళజ్వరం** – ప్రతిదినం ఏవేళకి వస్తాదొ అదేవేళకి మళ్ళీ వస్తది.
   **వేడిజ్వరం** – పొంగుతున్న ఎసరు ఆవిరి వచ్చునట్లు శరీరంలో వేడి బలపడును.
2. **గంగదేవి** – 1) మసూచికం, 2) పొంగు, 3) పరద (పొక్కులు), 4) జ్వరం
3. **ఆటలమ్మ** – 1) కలరా, 2) వాంతులు, 3) నీళ్ళవిరోచనాలు, 4) పొక్కులు, 5) ఒల్లంత పుండ్లు, 6) కన్నులు గుడ్డి, 7) కాలు చేయి వంపులు (అవిటివారు), మొఖమంత పుండ్లు.
4. **ఎర్లు** – పోలియో
   1) జలవాతం, 2) మూతివంకర, 3) గొంతులో పొక్కులు, 4) ముక్కునుండి సీమలాంటి రొంప, 5) కాలు చేతులు పడిపోవును, 6) కాలుచేతులు అవిటి 7) నడుము, వీపు భాగంలో పుచ్చకాయ లాంటి కాయలు వచ్చును.
5. **పక్షవాతం** – కోళ్ళవాతం.
   శరీరంలోని మనిషి దుమ్ములమధ్య(జాయింటులో) నరాలకి రక్తం సరఫరాలేక బరువు మోయలేక నిశ్చయస్థితిలో ఆగి ఉండిపోతవి. మోటరుకు గ్రీజ్ ఆయిల్ లేక ఆగినట్లు, శరీరంలో ఒకభాగంలో మట్టిబెడ్డగోడనుండి విరిగిపడినట్లు పడుతది. అసలుపేరు కీళ్ళవాతం.
   **నక్కవాతం** – ముడుసులు ఉబ్బుతవి (వాపు).
   **అగ్గివాతం** – ముడుసులు ఉబ్బుతవి. కాలుముడుసులు, చేతివేళ్ళు ఉబ్బి వాపువచ్చి మంటలు వస్తవి.
   **మలుగువాతం** – వీపు వెనుక భాగమున చెంప, భుజంనుండి నడుముభాగంవరకు వ్యాపించి బాధించుతది.
   **మడమవాతం** – కుడికాలులో నింఘారికాలుకు చీలమడుమ మధ్యలో వస్తది.
6. **మడమశూల** – అరికాలుకు వెనుకభాగం మడమలో వస్తది.
   **కుట్టుశూల** – బొడ్డుపక్క కుడిభాగంలో వస్తది.
   **ముట్టుశూల** – ఆడవారికి బహిష్టు సమయంలో వస్తది. గర్భశూల అనికూడ అంటరు.
   **శూలజబ్బులు** – 1) బంకవిరోచనం, 2) రక్తంకారుట, 3) వట్టిజిగురు, 4) మిటుకుశూల, 5) గుర్రపుశూల.
7. **డొక్కులు** – నిద్రలో కాలు చాచినప్పుడు, చేతులు బిగించి చాపినప్పుడు, కండలు ఒకపక్క భాగంకు తిరుతవి.
8. **గుండెనొప్పి** – చన్నుకింద బోరభాగంలో వస్తది.
9. **పమ్మెము** – ఆడవారికి బహిష్టుకు వస్తది. అయిదునుండి పదిరోజులవరకు ఉంటది. అధికరక్తం బయటికి పోతది.
10. **సంధి** – కాలుచేతులు చల్లబడి చనిపోవడం.
11. **జనమొర్చ** – అగ్గిలో పడి కాలుతున్న కణుసువలె చిద్పుచిద్పుమని రెప్పలు ఆడిస్తరు.
    **మొర్చ** – నేలలోపడి నోటిలో చొంగలు కక్కుతరు.

12. **వనలజబ్బు** – చంటిపిల్లలకి విరోచనం నీళ్ళలాగ పల్చగ, ఆకుపచ్చరంగు ఉంటది.
13. **జబ్బువాపు** – ముఖం, బుగ్గలు, కాళ్ళు, కడుపు ఉబ్బుతవి.
14. **కామెర్లు** – 1) పచ్చకామెర్లు, 2) తెల్లకామెర్లు, 3) ఉబ్బుకామెర్లు
15. **మొకిడి గండు** – ముక్కునుండి రక్తం.
16. **సీసాచెవ్వు** – చిన్న పెద్ద లేకుండ, చెవినుండి చీములాంటి తెల్లటి ద్రవం వస్తది. మురికివాసన.
17. **గగిదెలు** – చేయిదండెలో బొడ్డుకింద బీర్జలపక్కన తొడభాగంలో వస్తది.
18. **మొటుకురోగం** – కాలు చేతులు పుండు రూపంలో కొరుకొని తింటవి. చేతులు కాళ్ళు మొండిఅవుతవి (కుష్ఠు) రోగం.
19. **తర్రి** – మెడచుట్టు వస్తది.
20. **బొల్లి** – పూతరోగం. ఒంటిలో తెల్లటి మచ్చలు ఉండి శరీరం అంత విచ్చుతది.
21. **ఆరెలు** – మనిషికి చెవిలో వస్తది. మేకకి మెడకింద వ్రేలాడు పూసలవలె ఉంటది.
22. **నెత్తినొప్పి** – కండ్లమీది భాగంలో ఉంటది.
23. **ఒరిబొమ్మ** – కన్నుమీదిభాగంలో ఒకపక్క ఉదయం, సాయంత్రం బాధపెట్టుతది.
24. **కొండనాలికె** – గొంతులోని మీదిభాగంనుండి నాలికమీద పడుతది. జబ్బువల్ల వస్తది. దీనివల్ల దగ్గు అధిక ప్రభావం చూపుతది.
25. **నూగు** – ఒంటిలో దురద పుట్టుతది.
26. **బుగ్గికాయలు** – అరికాలుపై, మోకాలులో వస్తది.
27. **అండకచ్చె** – బొడ్డుచుట్టుగాని పక్కనగాని వస్తది.
28. **పేగుదిగడం** – 1) విసర్జించె పేగునుండి రక్తం వస్తది. పేగు బయటికి వస్తది; 2) పేగు పక్కన పీలికలు పుట్టుతవి.
29. **ఊందువేంస** – గోరుచుట్టు. **ఊందుపంజెలి** – అరికాలు వేళ్ళమధ్య వస్తది.
30. **దూళకాలు** – వర్షకాలం అరికాళ్ళ దురదలు పుట్టుతది.
31. **పుప్పి** – గొగ్గులలోపట వస్తది.
32. **కాసె** – దగ్గు. ఉమ్మి తెలుపు కాండలు వస్తది.
33. **కవ్వి** – పైకి కిందికి ఊపిరి ఆధారం.
34. **రొంప** – కుల్లు. అధిక శీతలంవలన వస్తది.
35. **పండురోగం** – శరీరం తెలుపు.
36. **బద్దె సంకటం** – ఒల్లంత, మెడఅంత కాయలు (మరణం). **సెక సంకటం** – మానంలో చురుక్కుమంట.
37. **పెద్దరోగం** – మొట్కురోగం (కుష్ఠు)
38. **తెల్లబట్ట** – ఇంద్రియం పడిపోవుట.
39. **విసురూపు** – కాలులో పొక్కులు, దురదలు, పుండు, జిగురు.
40. **జల్దివాతం** – వనుకుతో వస్తది.
41. **గుండెమాద** – చన్ను భాగంలో వస్తది.
42. **పిరెం** – మానం కొరుకు.
43. **బుగ్గశంకులు** – బుగ్గల వాపు.
44. **పందికొమ్ము** – మనిషి పెదవులు పందిమూతికి లాగున మూసుకుపోయి వాపు.
45. **ఉచ్చటం** – మాటిమాటికి ఉచ్చలు పోయడం.
46. **తామెర** – 1) నల్లతామెరి, 2) తెల్లతామెరి, 3) బుడుగతామెరి.
47. **గొంతులో పొక్కులు** – గొంతులోపల వస్తది.
48. **చిడుము** – దురదలు
49. **గంటెపొక్కులు** – ముఖం బుగ్గలలో వయసులో గంటిగింజకి పోలిఉండునవి – మొటిమలు.
50. **సిచ్చమెరలు** – శీతాకాలం మంటదగ్గర నిద్రించినప్పుడు వేడికి తొడలు మంటకి కందుతవి. నల్లగ ఉంటవి. పొరలుకూడ పోవును మాంసం మాడుతది.
51. **పవ్వలు** – చేతులమీద, కాలు మడునులకింద, పిక్క కండలముందు భాగాలలో తెలుపు మచ్చలు.
52. **బొడ్డుతెంపరి** – చివరగ పుట్టిన పిల్ల
53. **మొటుకుడెక్కలు** – వ్రేలుమొండి
54. **డెక్కలు** – కాళ్ళు

(తరువాయి వచ్చే సంచికలో...)

- శ్రీ మార్టూరి వసంత్‌నాయుడు

# తెన్నాడులో తెలుగు ఎసపు (ఉద్యమం)

**తె**న్నాడు (ఇప్పటి తమిళనాడు)లో తెలుగు ఎసపు (ఉద్యమం) ఊపు అందుకొంటున్నది. అందుకు కొన్ని ఆనవాళ్లు కనపడుతున్నాయి. అందులో ఒకటి: ఉగాది వేడుకలు జరుపుకోవడం. కులసంఘాలుగానో కావచ్చు - బలిజ, కమ్మ, రాజకంబళం, రెడ్డి, సాగుసెట్టి, కోమటిసెట్టి, ముత్తరాస, తెలుగుగొల్ల, మాదిగ వంటి కులాలవారు సంఘాలుగా ఏర్పడి ఉగాది వేడుకలను జరుపుకొంటున్నారు. పది పదిహేనేండ్ల క్రిందట ఒకటీ అరగా మొదలైన ఈ వేడుకలు ఇప్పుడు పెద్ద ఎత్తున జరుగుతున్నాయి. ఈ ఏడాది ఉగాది వేడుకలు మొత్తం తెన్నాడులో నూరుకుపైగా జరిగినాయి. వాటిలో 80 శాతం మహిళలు పాల్గొన్నారు. ఎంతో సంబరంగా ఇంటిల్లిపాదీ ప్రతిచోటా కదలివచ్చారు. మొత్తం రాష్ట్రంలో జరిగిన ఉగాది వేడుకల్లో కనీసం లక్షమందిలోపు తెలుగువారు పాల్గొన్నారని అంచనా. ఒకప్పుడు తమిళంలో జరుగుతుండిన ఈ వేడుకలు మెల్లమెల్లగా తెలుగులోకి మారుతున్నాయి. మాటలేకాకుండా, అక్కడక్కడ తెలుగురాతలు కనబడుతున్నాయి. వేడుకలు జరిగిన ఒక్కొక్క తావులోనూ తెలుగును నేర్చుకోవాలనే కోరికను అందరూ వెలిబుచ్చినారు. వారి వారి తావులకు వచ్చి తెలుగురాతలను నేర్పించమని 'తెలుగువాణి'ని అడుగుతున్నారు. ఆ పనిలోనే ఇప్పుడు 'తెలుగువాణి' తలమునకలై వుంది. ఈ సందర్భంగా తీసిన ఫొటోలను ఇక్కడ చూడండి.

రచయిత ఫోన్ : 09442627001












# తెన్నాట తెలుగుతల్లి ప్రార్థనాగీతం

**తె**న్నాడు (నేటి తమిళనాడు) లోని తెలుగువారంతా సమిష్ఠిగా వారి తెలుగును తమదైన తీరులో చదవడం, రాయడం నేర్చుకోవడానికి భాషను రక్షించుకుంటూ సామాజికంగా, రాజకీయంగా అన్ని విధాలుగా తమ రాష్ట్రంలో తాము ఎదగడం కోసం తమ మధ్య ఒక సమైక్య కార్యక్రమాన్ని ముందుకు తెస్తున్నారు. తెన్నాడు తెలుగువారు 'తెన్‌తెలుగుతల్లి..." అనే ప్రార్థనాగీతాన్ని రూపొందించుకున్నారు. ఆ పాటని తొలిగా పాడిన అవకాశాన్ని తె.భా.సమాఖ్య కార్యకర్త ఓటుకూరి భూదేవి దక్కించుకుంది. మదురాంతకం సభలో భూదేవి పాడిన ఈ ప్రార్థనాగీతం అందరి మెప్పునూ పొందింది. సభలో ఆమెచేత తెలుగు ప్రచారానికి సంబంధించిన కొన్ని పాటలను, పద్యాలను పాడించు కున్నారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య పదేళ్ల నుండి ప్రచారంలోకి తెచ్చిన పతాకాన్ని వారు తమ పతాకంగా స్వీకరించారు.









తమిళనాడు

– శ్రీ స.వెం.రమేశ్

# తెన్నాట తెలుగు తరగతులు, విడిపట్టులు

**తె**న్నాడు (ఇప్పటి తమిళనాడు)లో 42 నూర్వాలు (శాతం) తెలుగువారు ఉన్నారని **అమ్మనుడి** చదువరులు ఎరిగినదే. 2001 నుండి **'నడుస్తున్న చరిత్ర'** పనికట్టుకొని, తెన్నాటి తెలుగువారి గురించి చాటింపు వేసింది. తెన్నాట తెలుగు ఎసపు (ఉద్యమం)కు వెన్నుదన్ను అయి నిలిచింది. 2010 నుండి మొదలయి సాగుతున్న హోసూరు కతల వెల్లువకు, రాయవేలూరు కతల బుడిబుడి అడుగులకు, తొలి నెలవు అయింది కూడా **నడుస్తున్న చరిత్రే.** 2002లో తొలి హోసూరు కతనూ, 2011లో తొలి రాయవేలూరు కతనూ అచ్చువేసి, ఇప్పటి ఆంధ్ర, తెలంగాణ తావులలోని తెలుగువారి చూపును అటు తిప్పింది. ఇప్పుడు **'అమ్మనుడి'** పేరుతో వచ్చి, మార్చి నెల సంచికలో తొలి బళ్ళారి కతను అచ్చులోకి తెచ్చింది. ఇది ఇప్పటి కర్నాటకలో జరగబోయే ఇంకొక తెలుగు ఎసపుకు ముందడుగు కాబోతున్నదేమో!

'నడుస్తున్న చరిత్ర' పిలుపుతో మొదలయిన 'కృష్ణగిరి జిల్లా రచయితల సంఘం' హోసూరు నుండి పదులమంది రాయసరులను అందిస్తూ సాగుతున్నది. మరొకవైపు 'తెలుగువాణి' పేరుతో తెన్నాటి పల్లెలలో తెలుగును నేర్పే పని 2004 నుండి మొదలు అయింది. క్రిష్ణగిరి, రాయవేలూరు, కాంచీపురం, తిరుచినాపల్లి, పెరంబలూరు, తిరుపూరు పెవ్వంటెము (జిల్లా)లలో నూరుకుపైగా పల్లెలలో తెలుగు తరగతులను నడిపి, దాదాపు అయిదు వేలమందికి తెలుగు రాతలను నేరిపింది తెలుగువాణి. నేరుచుకొనిన వాళ్లలో కొందరు కతలనూ కవితలనూ రాస్తున్నారు. ఇదంతా నడుస్తున్నచరిత్ర చదువరులకు తెలిసిందే.

ఇప్పుడు 'తెలుగువాణి' మరలా రెండు పనులను తలకు ఎత్తుకొనింది. 1. తెలుగు విడిపట్టులను నడపడం 2. తిరుపూరు పెవ్వంటెంలో తెలుగు తరగతులను నడపడం. ఈ రెండు పనుల గురించి కొన్ని ముచ్చట్లు.....

1. తెలుగు విడిపట్టు : విడిపట్టు అంటే శిబిరం. తెన్నాటి నాలుగు మూలల నుండీ నెలనెలా కొందరు కోడెగాళ్లను ఒకచోట చేర్చి, రెండునాళ్లు వాళ్లకు తెలుగు గొప్పతనం గురించీ మెలన గురించీ నూరిపోసి, వాళ్లను తెలుగులెంకలుగా తీర్చిదిద్దడమే విడిపట్టు పని. తొలి విడిపట్టు మార్చి 7, 8న తిరుపతిలో జరిగింది. దీనిని స.వెం. రమేశ్ నడుపగా, ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు, డా॥ మనోహర్, మదురాంతకం నరేంద్ర, పేట శ్రీనివాసులు రెడ్డి, గంగినేని రమేశ్ గార్లు తోడుపడినారు. విడిపట్టులో పాలుగొన్న తెన్నాటి తెలుగు లెంకలు వీరు.




| | పేరు | ఊరు | పెనువంటెం |
|---|---|---|---|
| 1. | మార్టూరి వసంత్ నాయుడు | ఉడుమలపేట | తిరుపూరు |
| 2. | అగస్త్యరెడ్డి దామోదర రెడ్డి | బుక్కదొర | కాంచీపురం |
| 3. | ఓట్ర పురుసోత్తం | కాటుపాకం | రాయవేలూరు |
| 4. | కెంచప్పగారి మునిరాజు | దేవిసెట్టిపల్లి | క్రిష్ణగిరి |
| 5. | అమరనారా బసవరాజు | కొత్తపల్లి | క్రిష్ణగిరి |
| 6. | గుజ్జుబొమ్ము దాదయ నాయకరు | గేదలపల్లి | దిండుగల్లు |
| 7. | పాలమ రాజేంద్రపాండ్య నాయకరు | నెలకోట | దిండుగల్లు |
| 8. | పాలమ శివరామ నాయకరు | అలకాపురి | బిరుదునగరు |
| 9. | చిల్లా ముత్తుసామి | ఒడ్డనసత్రం | దిండుగల్లు |
| 10. | రాచకొండ సెందిల్ నాయుడు | ఉప్పరపల్లి | కోయలముత్తూరు |
| 11. | ఎండపల్లి విద్యాశేకర్ | జోతంపల్లి | తిరుపూరు |
| 12. | బీమిని కేశవ | రాజపాళెం | బిరుదునగరు |
| 13. | గోళ్ల వినోద్ | కస్తూరి రంగపురం | దూతగుడి |
| 14. | పుట్టా మురళీక్రిష్ణ | కళ్లమనాయకరు పల్లి | బిరుదునగరు |
| 15. | రాణా సురేశ్మదనగోపాల్ | గంగువారిపల్లి | తేని |
| 16. | దువ్వూరి సురేశ్‌రెడ్డి | అచ్చెరపాకం | కాంచీపురం |
| 17. | నాగళ్ల జయకుమార్ | పొంగలూరు | తిరుపూరు |

విడిపట్టులో పాలుగొన్నవారు అందరూ వారివారి తావులలో తెలుగు పెంపుకు పాటుపడుతామనీ, తెలుగు నుడీ నెసాగుల పైకి తమిళుల చొరబాటునూ అణిచివేతనూ ఎదురుకొంటామనీ ఒట్టుపెట్టుకొనినారు. నెలనెలా ఒక్కొక్క తావున ఇటువంటి విడిపట్టులను నడుపుకోవాలనీ, ఒక ఏడాది లోపల తెన్నాటిలో తక్కువలో తక్కువ 500 మంది తెలుగు లెంకలను అవను చేయాలనీ తీరుమానించు కొనినారు. తరువాతి విడిపట్టు కొంగాపి నెల మొదటిలో (ఏప్రిల్ చివర) తిరుపూరులో ఏర్పాటుచేసే దానికి గుజ్జుబొమ్మ దాదయనాయకరు ముందుకు వచ్చినారు. తిరుపూరు విడిపట్టుకు ఏభైమందికి తగ్గకుండా తెలుగులెంకలు వస్తారని దాదయనాయకరు మాట ఇచ్చినారు.

2. తెలుగు తరగతులు : తిరుపూరు పెవ్వంటెంలో దారాపురం, కాంగేయం, పల్లడం, అవినాశి, తిరుపూరు, ఉడుమలపేట, మటంగుంట అనే ఆరు వంటెలు (తాలూకాలు) ఉన్నాయి. వీటిలో ఉడుమలపేట, మటంగుంటలు కేరళ ఎల్లకు ఆనుకొని ఉంటాయి. ఈ రెండు





వంటెంలలో ఇల్లిల్లూ తిరిగి నుడివారిగ లెక్కలను తీసినారు తెలుగులెంకలు. మొత్తంమీద ఈ తావున 49% తెలుగు, 5% కన్నడం, 2% ఉరుదు, 44% తమిళ నుడులవారు ఉన్నారు. రెండు వంటెంల మొత్తం మందిలో ఎక్కువమంది మాదిగవారే ఉన్నారు. వీరి నూర్పాలు 21. వీరి తరువాత 'కొంగువేళాల గౌండర్' అనే తమిళ కులంవారు 18%తో రెండవ మట్టులో, 12%తో కమ్మవారు మూడవమట్టులో ఉన్నారు.

ఈ నెల ఏప్రిల్ 15 నుండి ఈ రెండు వంటెంలలోని పల్లెలలో తెలుగు తరగతులను నడుపబోతున్నాము. దాదాపు 150 పల్లెలలో నేరిపించాలనీ, నేరిపించిన ఒక్కొక్క ఊరిలోనూ తెలుగు పేరుపలకలు (సైన్‌బోర్డులు) కనబడేటట్లు చేయాలని మా గురి. ఇప్పటికి 90 పల్లెలవారు నేరుచుకొనే దానికి ముందుకు వచ్చినారు. ఆ పల్లెల పేర్లను కింద ఇచ్చినాము. తెలుగు రాతలను నేరిపే దానికి పదిమంది కోడెవాళ్లు క్రిష్ణగిరి, రాయవేలూరు పెవ్వంటెంలనుండి ముందుకు వచ్చినారు. ఈ పదిమందికీ అలవరపు (శిక్షణ)ను ఇచ్చి ఆ పల్లెలకు పంపుతాము. వీళ్లు 'తెలుగువాణి' చెప్పిన పల్లెలకు పోయి ఆ పల్లెమందితో కలిసిపోయి, వాళ్లకు తెలుగు రాతలను నేరుపుతారు. తెలుగు పాటలనూ ఆటలనూ కూడా నేరుపుతారు. ఆ పల్లెలలోని తెలుగు మాటలను ఎడివి(సేకరించి) 'తెలుగువాణి' వారికి అందచేస్తారు. అలవరపు తరగతులు మార్చి 28 నుండి ఏప్రిల్ 8 వరకూ తిరుపతిలో జరిగినాయి.

తరగతులను నడపడానికి ఒక్కొక్క పల్లెకు పదివేల రూపాయలు చెల్లు అవుతుంది. తెన్నాట తెలుగు పెంపుకు చేయి అందించాల అనుకొనేవారు, ఒక్కొక్క పల్లెను దత్తు తీసుకొనవచ్చు. అంటే పదివేల రూపాయలను తెలుగువాణికి ఇచ్చి తోడుపడవచ్చు. తరగతి జరుగుతున్నపుడు కట్టే తెరకాడి(బేనరు)లో ఈవరు(దాత)ల పేరును ఉంచుతాము. ఇవీ ఇప్పటికి తెన్నాటి ముచ్చట్లు :

## తెలుగు రాతలు కావాల అని ముందుకు వచ్చిన ఊర్లపేర్లు

పల్లనూతి
పూలనూతి
చిన్నపూలనూతి
పెద్దపాపనూతి
చిన్నపాపనూతి
మెట్టరాతి
అందూరు
వేలూరు
గట్టూరు
కడతూరు
కణియూరు
కానగముత్తూరు
ఎలయముత్తూరు
లింగమావూరు
రాగలబావి
కొర్లగుంట
పాపనిగుంట
మటంగుంట

చిన్నకొత్తూరు
దేవకొత్తూరు
దారాపురంకొత్తూరు
ఎరగండి కొత్తూరు
కర్రిసామి కొత్తూరు
సంగ్రామ నెల్లూరు
నాయకనూరు
జలప్ప నాయకనూరు
వేలప్ప నాయకనూరు
గురప్ప నాయకనూరు
కన్నమ నాయకనూరు
పోత నాయకనూరు
అమరావతి
కొమరలింగం
కుమార మంగళం
తుంగావి
తాదోని
మైవాడ

గణపతి పాళెం
ఉడుకు పాళెం
చెల్లప్ప పాళెం
రెడ్డి పాళెం
కుమార పాళెం
మర్రి పాళెం
పల్లి పాళెం
కనకం పాళెం
చెన్నిమల పాళెం
జోతి పాళెం
పెద్ద బాళపాడు
హనుమంత పట్నం
కొండజంగాల పట్నం
అమణ సముద్రం
కురిచి కోట
కుర్రల గుట్ట
పల్లి వలస
ముల్లంగి వలస

క్రిష్ణాపురం
రావణాపురం
వల్లగుండాపురం
వెంకటాపురం
గోవిందాపురం
కల్లాపురం
నరసింగాపురం
రామలింగాపురం
వంజిపురం
గణేశపురం
వెలగమానుపల్లి
తిన్నెపల్లి
జంగాలపల్లి
గుంటుపల్లి
చింతలపల్లి
దిరిసినపల్లి
దీపాలపల్లి
మడుగుపల్లి

జల్లిపల్లి
జింకలపల్లి
తుమ్మలపల్లి
అమ్మపల్లి
దాసరిపల్లి
బోడిపల్లి
మరులపల్లి
బాలప్పపల్లి
ఉర్లపల్లి
పెరికినపల్లి
పోలారంపల్లి
కొండవనాయనిపల్లి
ఇచ్చిపల్లి
తాళ్లపల్లి
సీలనాయనిపల్లి
జోతంపల్లి
బోయపల్లి
బూదిమిట్ట

పిట్టచూపు

– చలసాని నరేంద్ర

# బడ్జెట్‌పై చర్చ కాదు... చట్టసభల్లో రభస!

**పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో బడ్జెట్ సమావేశాలు విశేష ప్రాధాన్యత సంతరించుకుంటాయి. అధికార పక్షాలకు తమ ప్రభుత్వ విధానాలు, ప్రాధాన్యతలు, దృష్టి కోణం గురించి ప్రజలకు తెలియచెప్పే అవకాశం కలిగిస్తే, ప్రతిపక్షాలకు మొత్తం ప్రభుత్వ పాలనను వడబోసి ప్రజల ముందు ఉంచే వీలు ఏర్పడుతుంది. రెండు తెలుగు రాష్ట్రాల తొలి పూర్తి స్థాయి బడ్జెట్ సమావేశాలు ఒకేసారి, ఒకే ఆవరణలో జరుగుతుంటే సహజంగానే ప్రజల్లో ఆసక్తి ఏర్పడింది.**

రెండు తెలుగు రాష్ట్రాలు, మూడు రోజుల వ్యవధిలో మూడు బడ్జెట్లు ప్రవేశ పెట్టాయి. పది జిల్లాల తెలంగాణా రాష్ట్రానికి లక్షా పదిహేను వేల కోట్ల రూపాయల బడ్జెట్. పదమూడు జిల్లాల ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి లక్షా పదమూడు వేల కోట్ల రూపాయల బడ్జెట్. మరునాడే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం "వ్యవసాయం" పేరుతో ఇంకో ప్రత్యేక బడ్జెట్ సభకు సమర్పించి మరో పద్నాలుగు వేల కోట్ల రూపాయలు ప్రతిపాదించారు. ఉమ్మడి రాష్ట్రంలో లక్షలతో మొదలయిన బడ్జెట్ అంచనాలు కాలక్రమంలో పెరిగి పెరిగి లక్షల కోట్లల్లోకి చేరుకున్నాయి. ప్రతిష్టకు పోయి ప్రతి ఏటా బడ్జెట్ అంచనాలను పెంచుతూ చూపుతున్నారు గాని ఆ అంకెలు ప్రభుత్వాల ఆర్ధిక పరిపుష్టిని సూచించడం లేదు. కేవలం అంకెలతో గారడీలు చేస్తున్నట్లు అనిపిస్తున్నది.

అసలు బడ్జెట్‌పై సవివర చర్చల పైన కన్నా పరస్పరం ఆరోపణలతో, దూషణలతో చివరకు అసభ్య పదజాలంతో రచ్చకెక్కి తెలుగు వారి పరువును మంట గలిపే ప్రయత్నం జరగడం దురదృష్టకరం. ప్రతిపక్షాల ఉనికి పట్ల అధికార పక్షాల్లో అసహనం రెండు శాసన సభల్లో వ్యక్తమయింది. స్పీకర్‌లు కేవలం అధికార పక్షం చెప్పుచేతల్లో వ్యవహరిస్తున్న వారుగా ఆరోపణలు ఎదుర్కోవడం విచారకరం.

తెలంగాణ సభలో తొలి రోజునే తెలుగుదేశం సభ్యులు అందరినీ మొత్తం బడ్జెట్ సమావేశాలలో సభ నుండి బహిష్కరించారు. సభ జరగడానికి ఆటంకం కలిగిస్తే ఒకటి, రెండు రోజులు వాయిదా వేసి, ఆ తరువాత ఒకటి, రెండు రోజులు సభ నుండి బహిష్కరించడానికి ప్రయత్నం చేయడం ఆనవాయితీ. ఈ లోపుగా స్పీకర్ అన్ని పక్షాలతో సమావేశాలు జరిపి ప్రతిష్ఠంభన తొలగించే ప్రయత్నం చేస్తారు. అటువంటి ప్రయత్నాలు ఏవీ జరుగకుండా సభ్యులను బహిష్కరించడం మంచి ఆనవాయితీ కాదని చెప్పాలి.

తాము తక్కువా అన్నట్లు ఆంధ్రప్రదేశ్ శాసనసభలో సహితం చివరి రోజుల్లో ప్రతిపక్ష సభ్యులు కొందరిని సభ నుండి బహిష్కరించడం, అందుకు ప్రతిగా తామే సభను బహిష్కరిస్తున్నామని ప్రకటించడం చేసారు. సభలో బడ్జెట్ పై ప్రసంగించే అవకాశం లేకుండా తన మైక్‌ను తొలగించారని అంటూ ప్రతిపక్ష నాయకుడు పత్రికల వారి ముందే బడ్జెట్ ప్రసంగం చేసారు. ఇవ్వన్నీ చూస్తుంటే అందరూ మీడియాలో ప్రచారాల కోసం తాపత్రయమే గాని ప్రజాసంబంధ అంశాలపై నిజాయితీగా చర్చలు జరిపే ప్రయత్నం చేయడం లేదు.

ఇక కొందరు సభ్యులు మర్యాదని మరచి ఉపయోగించిన అసభ్య, పరుష పదజాలం దిగజారుతున్న మన రాజకీయ వ్యవస్థకు ప్రతీకగా మిగిలినట్లు చెప్పవచ్చు. మహిళా శాసన సభ్యులపై సైతం అభ్యంతరకర పదజాలం వాడటం, వారు కూడా తామేమి తక్కువ కాదన్న రీతిలో పరుషంగా స్పందించడం ప్రసార సాధనాలకు వినోదంగా మారింది. తమ ముందే సభ్యులు దిగజారి ఈ విధంగా ప్రవర్తిస్తుంటే సభాపతులు ప్రేక్షక పాత్ర వహించడం విస్మయం కలిగిస్తున్నది.

రెండు రాష్ట్రాల బడ్జెట్‌లలో ఘనమైన కేటాయింపులు చేశారు గాని ప్రణాళిక వ్యయం 40 శాతానికి మించి లేదు. ప్రణాళికేతర వ్యయం అంటే అంకెల ప్రపంచం చూపించడమే గాని అందుకు అవసరమైన నిధుల సమీకరణ గురించిన స్పష్టతను ఆర్థికమంత్రులు ప్రదర్శించ లేకపోయారు. గత ఎన్నికల్లో ఇచ్చిన హామీల అమలు కన్నా ప్రజలను మంత్రముగ్దులను చేసే ఆకర్షణీయ ప్రసంగాలకే పరిమితం అయ్యారు. అరచేతిలో స్వర్గం చూపించే ప్రయత్నం చేసారు గాని అందుకు అవసరమైన వనరుల సమీకరణ, ఆర్థిక క్రమశిక్షణ పాటించడం గురించి ఏమాత్రం ప్రయత్నాలు కనిపించనే లేదు.

దేశంలోనే గుజరాత్ తరువాత సంపన్న రాష్ట్రం అని తెలంగాణ ముఖ్యమంత్రి కె.చంద్రశేఖర్‌రావు ఘనంగా చెప్పుకున్నా ఆ మేరకు అభివృద్ధి పథకాలకు కేటాయింపులు జరపలేదు. గత సంవత్సరం చేసిన బడ్జెట్ ప్రతిపాదనల్లో 40 శాతం నిధులు కుడా ఖర్చుపెట్టలేని ఈ రెండు ప్రభుత్వాలు ప్రస్తుత బడ్జెట్‌లో చేసిన ప్రతిపాదనలను ఏమాత్రం అమలు చేయగలరో చూడవలసివుంది. కొత్తగా పన్నులు ప్రతిపాదించడం లేదని

**రైతుల ఆత్మహత్యలను అరికట్టదానికి, వ్యవసాయ రంగాన్ని పునరుజ్జీవింప చేయడం ద్వారా గ్రామీణ ఆర్థిక వ్యవస్థను మెరుగు పరచడానికి, తద్వారా మొత్తం ఆర్థిక పరిస్థితులను వికసింప చేయడానికి రెండు ప్రభుత్వాలు ఆలోచించడం లేదని ఈ బడ్జెట్‌లో వెల్లడి చేస్తున్నాయి. రెండు రాష్ట్రాల్లో విద్యారంగం తీవ్ర సంక్షోభంలో చిక్కుకుంది. ఈ పరిస్థితులను అధిగమించి విద్య, వైద్య రంగాలను బలోపేతం చేయడానికి, ఈ రంగాల్లో కార్పొరేట్ రంగసంస్థలు సృష్టిస్తున్న అరాజక పరిస్థితులను అదుపు చేయడానికి ప్రభుత్వాలు ముందుకు రావడం లేదని బడ్జెట్ ప్రతిపాదనలు స్పష్టం చేస్తున్నాయి.**

ఇద్దరు ఆర్థికమంత్రులు ఘనంగా చెప్పుకొంటున్నా ఆర్థికవనరుల సమీకరణలో స్పష్టత లేకపోవడంతో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పన్నులు వేయక తప్పని పరిస్థితులు నెలకొన్నాయి. అప్పుడే పలు పన్నుల ప్రతిపాదనలు రెండు ప్రభుత్వాల పరిశీలనలో ఉన్నట్లు వార్తలు వస్తున్నాయి.

సంపన్నరాష్ట్రం అని చెప్పుకుంటున్న తెలంగాణ ప్రభుత్వం తమ రుణ పరిమితిని పెంచి అదనంగా రుణాలు సేకరించడానికి అవకాశం కల్పించమని కేంద్రాన్ని కోరడం గమనార్హం. ఈ రెండు బడ్జెట్ ప్రతిపాదనలు వాస్తవానికి సమీపంగా లేవని, అంకెల గారడీలను గుర్తుకు తెస్తున్నాయని విమర్శలు చెలరేగాయి. రెండు బడ్జెట్‌లలో వ్యవసాయానికి తగు ప్రాధాన్యత ఇవ్వలేదని చెప్పవచ్చు. ముఖ్యంగా గత ఎన్నికల్లో ఘనంగా వాగ్దానం చేసిన రైతు రుణాల మాఫీకి నామమాత్రంగానే రెండు ప్రభుత్వాలు నిధులు కేటాయించాయి. అసలు రుణాల రద్దు ఎప్పటికి, ఏ విధంగా పూర్తిచేస్తారో అధికారంలోకి వచ్చి తొమ్మిది నెలలు అయినా, రెండు బడ్జెట్‌లను సమర్పించినా స్పష్టత లేనే లేదు.

వ్యవసాయ రంగం తీవ్ర సంక్షోభంలో ఉన్నదని రెండు ప్రభుత్వాలు అంగీకరిస్తున్నాయి. కొనసాగుతున్న రైతుల ఆత్మహత్యలు, ప్రకృతి వైపరీత్యాలు, సకాలంలో విత్తనాలు అందుబాటులో లేకపోవడం వంటి సమస్యలు రెండు రాష్ట్రాల్లో కొనసాగుతున్నాయి. అయితే ఈ సంక్షోభాన్ని ఎదుర్కొని రైతులను ఆదుకోవడానికి ఈ బడ్జెట్‌లు నిర్దుష్టమైన ప్రతిపాదనలను, కార్యాచరణ ప్రణాళికలను ప్రతిపాదించ లేకపోయాయి.

తెలంగాణలో వ్యవసాయరంగ ప్రగతి తిరోగమనంలో 10.30 శాతం మేరకు ఉన్నది. ఆహార ఉత్పత్తులు 19 శాతం, విత్తనాలు 11 ఉత్పత్తి శాతం మేరకు పడిపోయాయి. వ్యవసాయ ఉత్పత్తులను పెంచేందుకు అవసరమైన ప్రోత్సాహకాల గురించి ప్రభుత్వం ఆలోచించి నట్లే లేదు. అన్ని రంగాలకు గత సంవత్సరం కన్నా నామమాత్రంగా కేటాయింపులు పెంచి చూపడమే గాని గత సంవత్సరం కేటాయించిన నిదుల్లో ఖర్చు పెట్టలేని నిధులని ఈ సంవత్సరం ఖర్చు పెట్టగలమని రెండు ప్రభుత్వాలు హామీ ఇవ్వలేక పోయాయి.

ఎన్నికల సమయంలో "బాబు వస్తే జాబు" అంటూ తెలుగుదేశం ప్రభుత్వం పెద్ద ఎత్తున ప్రచారం చేసింది. ఉద్యోగం ఇవ్వలేకపోతే నిరుద్యోగభృతి ఇస్తామని హామీ ఇచ్చారు. అలాగే టి ఆర్ యస్ తెలంగాణలో లక్ష మంది యువకులకు ఉద్యోగ అవకాశాలు కల్పిస్తామని హామీ ఇచ్చింది. అధికారంలోకి వచ్చి తొమ్మిది నెలలు అవుతున్నా ఇంతవరకు ఒక్కరికీ ప్రభుత్వ ఉద్యోగం ఇవ్వలేకపోయాయి. తెలంగాణలో లక్ష 30 వేల ప్రభుత్వ ఉద్యోగాలు పూరించవలసి ఉన్నది. ఆంధ్రప్రదేశ్‌లో సహితం లక్షకు పైగా ఉద్యోగ ఖాళీలు ఉన్నాయి. వీటిని భర్తీ చేయడానికి నిర్దుష్టమైన కార్యాచరణ ప్రణాళిక ప్రభుత్వాల ముందు లేదు. నిరుద్యోగ భృతి గురించి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్. చంద్రబాబు నాయుడు ఇప్పుడు మాట్లాడటం లేదు.

చంద్రబాబు నాయుడు అయితే కేంద్రం నుండి భారీ ఆర్థిక సహకారం లభించనిదే రాష్ట్ర ఆర్థిక పరిస్థితి అంధకారం అనే సంకేతాన్ని స్పష్టంగా ఇచ్చారు. ఒక వైపు ఇక్కడ బడ్జెట్ అసెంబ్లీలో ప్రవేశపెట్టడానికి సన్నాహాలు చేస్తూ మరో వంక ఢిల్లీలో కేంద్ర ఆర్థికమంత్రి చుట్టూ ప్రదక్షిణలు చేయడం గమనిస్తే "గాలిలో పెట్టిన దీపం" వలే ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ ఉన్నదని చెప్పక తప్పదు. ఆర్థిక క్రమశిక్షణ పాటించి, ఉన్న కొద్దిపాటి వనరులను సమర్థవంతంగా వినియోగించుకొనే విధంగా ప్రాధాన్యతలను నిర్ణయించుకోవడం పట్ల ఆసక్తి చూపడం లేదు.

రైతుల ఆత్మహత్యలను అరికట్టదానికి, వ్యవసాయ రంగాన్ని పునరుజ్జీవింప చేయడం ద్వారా గ్రామీణ ఆర్థిక వ్యవస్థను మెరుగు పరచడానికి, తద్వారా మొత్తం ఆర్థిక పరిస్థితులను వికసింప చేయడానికి రెండు ప్రభుత్వాలు ఆలోచించడం లేదని ఈ బడ్జెట్లో వెల్లడి చేస్తున్నాయి. రెండు రాష్ట్రాల్లో విద్యారంగం తీవ్ర సంక్షోభంలో చిక్కుకుంది. విశ్వవిద్యాలయాల్లో సగం మందికి మించి అధ్యాపక సిబ్బంది లేరు. ప్రాథమిక విద్యలో ఉపాధ్యాయుల ఖాళీలు భారీగా ఉన్నాయి. ఈ పరిస్థితులను అధిగమించి విద్య, వైద్య రంగాలను బలోపేతం చేయడానికి, ఈ రంగాల్లో కార్పొరేట్ రంగసంస్థలు సృష్టిస్తున్న అరాజక పరిస్థితులను అదుపు చేయడానికి ప్రభుత్వాలు ముందుకు రావడం లేదని బడ్జెట్ ప్రతిపాదనలు స్పష్టం చేస్తున్నాయి.

పూర్తి కాని ప్రాజెక్టులు, కార్యక్రమాలను పూర్తి చేయడం పట్ల కన్నా కొత్త కొత్త కార్యక్రమాల అమలు ప్రతిపాదించడం సహితం పలు విమర్శలకు దారి తీస్తున్నది. కీలకమైన నీటి పారుదల రంగానికి చేసిన కేటాయింపులు మొక్కుబడిగానే ఉన్నాయి. మూడేళ్ళలో విద్యుత్ సరఫరాలో మిగులు రాష్ట్రంగా తెలంగాణను మారుస్తాను అంటున్న ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావు విద్యుత్ ఉత్పాదనను ఆ మేరకు మెరుగు పరచడానికి అవసరమైన నిధులను కేటాయించకపోవడం గమనార్హం.

దుబారా వ్యయంలో రెండు ప్రభుత్వాలు పోటీ పడుతున్నట్లు కనిపిస్తున్నది. ప్రభుత్వ వ్యవహారంలో పొదుపుకు ఏమాత్రం విలువ ఇవ్వడం లేదు. బాధ్యతారహితంగా ఉద్యోగులు, ప్రజా ప్రతినిధుల జీత భత్యాలు పెంచుకుంటూ పోతూ ప్రాధాన్యరంగాలకు కేటాయింపుల విషయంలో మాత్రం అలక్ష్యం చేయడం జరుగుతున్నది. పలు రంగాలకు కేటాయింపులు భారీగా చూపినా ఆ మేరకు వ్యయం చేయడం లేదు.

**రచయిత స్వతంత్ర పాత్రికేయుడు**
**ఫోన్ : 09441797650**

**చిత్తూరు కథ**

# మా మంచి రాజా

– శ్రీమతి వాడపల్లి అమ్మాజీ

**అత్త**, మామ, అక్క, బావ, ముగ్గురు పిల్లోళ్లు ఉండే వాడపల్లి కుటుంబానికి రెండో కోడలుగా అడుగు పెడితిని. వీళ్లందరితోపాటు తొలి అడుగులోనే పరిచయమైనాడు రాజా.



మా అత్తోళ్లకు ఎనిమిదెకరాల చేనూ ఒక ఎకరా మడీ ఉండాయి. బండి, ఎద్దులు, ఒక ఆవు, రెండు దూడలు, నూరు గొర్రెలు కూడా ఉండాయి. గొర్రెలకీ ఆవులకీ కాపలాగా ఉంటాడు రాజా. వాడంటే ఇంట్లో అందరికీ ప్రాణం. కొత్త కోడలిగా ఇంట అడుగుపెట్టిన దినమే, రాజా కుసిలిస్తా మాకు ఎదురొచ్చి, మా ఆయన అమీర్ చేతుల్లో చేతులు వేపినాడు. నేను రాజా తలమీద నిమిరితిని.

మొదటి రెయ్యినాడే రాజా గురించీ, అమ్మానాయనా అన్నా వదినల గురించీ పూసగుచ్చినట్లు అన్నీ నాతో చెప్పినాడు మా ఆయన. ఆయన మాటల్ని వింటా నిదరలోకి జారుకుంటిని.

తెల్లవారి ఐదు గంటలకే బయట తలుపు దగ్గరనింటి 'ఉయ్ ఉయ్' అనే రాజా కుసిలింపు వినిపించింది. అమీర్‌కు మెలకువ వచ్చి లేసి తలుపుతీసి బయిటికి పొయినాడు. నేను కూడా లేసి పడకను మడిసి పెట్టేసి బయిటికిపోతిని. మా ఆయన గొర్రెలదొడ్డి వాకిలిని తీసి గొర్రెల్ని బయిటి కంచెలోకి వదలతా ఉండాడు. గొర్రెలు అట్లా ఇట్లా పోకుండా అన్నీ సోలుపుగా కంచెలోకి పోయేటట్లు చూస్తా ఉండాడు రాజా. అన్నీ కంచెలోకి పొయినాక, కంచెకు వెదురు తడకను మూసిపెట్టినాడు మా ఆయన.

మళ్లా ఇంట్లోకి వచ్చి చెంబు ఎత్తుకునిపోయి గొర్రెలకు పాలుపిండి తెచ్చి నా చేతికి ఇచ్చినాడు. నేను పాలచెంబును అందుకుని పొయ్యింట్లోకి పోతిని. నేను కాఫీ పెట్టేతలికి అమీర్ ఆవులకు కూడా పాలుపిండేసినాడు. నేనిచ్చిన గొర్రెపాల కాఫీని తాగేసి, కొట్టంలోని ఆవుల్నీ ఎద్దుల్నీ బయట కట్టేసి, కొట్టంలో కసువులు ఊడ్చేసినాడు.

"ఆవులకు కసువు కోసుకురావాల, కసువు కొడవలి ఇట్లీ అని అడిగినాడు నన్ను. అప్పటికి ఇంట్లో అందురూ లేసేసి తలా ఒకపని అందుకుంటా ఉండారు. కొడవలి ఎత్తుకునొచ్చి ఇస్తా "ఏంబా నేనూ వస్తాను, బా కసువుకి" అని అమీర్‌ను అడిగితిని. అమీర్ తో పాటు నేనూ మా వెనకనే రాజా, ముగ్గురుమూ కలిసి దిన్నిమీది చేన్లోకి పోతిమి. అమీరూ నేనూ చేన్లో కసువు కోస్తా ఉంటే, రాజా మటుకు చెనిగ పంటమింద ఒక గువ్వను కూడా వాలనీకుండా తరుముతా ఉండాడు. కోసిన కసువును మోపులు కట్టుకుని మేము ముగ్గురుమూ పదిగంటలప్పుడు ఇంటికి చేరుకుంటిమి.

ఇంటితావ సద్ది తింటా ఉండాము "అమీరా, బాయికాడ చింతమాన్లో కోతులు చేరి తమాట పంటను ఏడుగాడు చేస్తా ఉండాయి'' అని బయిటినింటి కొండన్న గొంతు వినపడింది. ఆ మాటతో గబగబ చేతులు కడుక్కుని వడిసిలి ఎత్తుకుని చింతమాను కాడికి పరిగెత్తినాడు అమీరు. వెనకనే రాజా కూడా పరిగెత్తినాడు.

ఇంటి దగ్గరికి మజ్జిగ కోసరం ఎవురైనా ఇరుగుపొరుగోళ్ళు వస్తే, రాజా వాళ్లను రోడ్డుమిందనీ నిలబెట్టేస్తాడు. వాకిలి వరకూ కూడా రానీడు. వాళ్లు రోడ్డుమిందనింటే "అమ్మో" అని నన్ను పిలిచి "మీ అత్తకు చెప్పి మజ్జిగుంటే రవన్ని పొయిమనుమా" అని అడగతారు. బయట వాళ్ల పిలుపు వింటానే ఇంట్లో మా అత్త మజ్జిగలో ఇంక వన్ని నీళ్లు కలపతాది. మంది ఎక్కువైతే మజ్జిగ పలసన కదా!



నడిరెయ్యి దాటినంక నిజంగానే గొర్రెలదొడ్డిమింద దొంగలు పడిరి. ఎందురు వచ్చిరో తెలీదు కానీ రాజా మటుకు పెద్దగా అరస్తా ఉండాడు. ఉరుములకీ మెరుపులకీ కదిలే చెట్లనీడల్ని చూసి అరస్తుండాడు లే అనుకుని ఒకరుగానీ బయటికి పోకుండా నిదరపోతిమి. కొంచెంసేపటికి రాజా అరుపులు నిలిచిపోయినాయి.

నేనుపోయి రాజాను "పక్కకు పో, వాళ్లకు దారితీ" అని అదిలిస్తే అప్పుడు పక్కకిపోయి పణుకుంటాడు.

చేన్లో పనికి కూలోళ్లు వచ్చింటే, మా అక్క (తోడి కోడాలు) ఇరవై ముద్దల సంగటి చేసి, ముద్దల్ని పెద్ద వెదురుగంపకు వేసి, చింతకాయ ఊరిబిండీ పప్పుకూరా చిక్కని మజ్జిగల్ని గంపలో అమిర్చేది. ఇంటిపని ముగించుకుని నేను ముద్దల గంపని నెత్తికెత్తుకుని చేను తావుకు బయదేలితే, నీకు తోడు నేనుండాన్లే పద అన్నట్లుగా నాకు ముందు రాజా దారి తీస్తాడు.

అట్లే ఒగతూరి మద్దేనము తొగటాలకు వచ్చిన కూలోళ్లు వేపమాను నీడలో కుచ్చుని ముద్దతింటా ఉండారు. తినేటప్పుడు ఒకరిద్దురు రాజాకు ఒక కడిని తుంచి వేసినారు. మా రాజా ఆ తట్టుకు తలకూడా తిప్పలేదు.

"ఏమట్ల మేము యేసే సంగటి కడిని తినదా?" అనడిగింది ఒకామె.

"మీరు యేస్తేనే తింటాదా?" ఇంకొకమె అనింది.

అపుడు నేను "ఈపొద్దు శనారం కదా, మా రాజా ఒక్కపొద్దు ఉంటాడు, ఎవురు వేసినా తినదు" అని చెపితిని. నామాటను ఎవురూ నమ్మలేదు. మా పక్కింటామె నోరిప్పి "అవును సాలెమ్మత్తా నిజిమే. శనారం శనారం వాళ్ల రాజా పచ్చి మంచినీళ్లు కూడా ముట్టేలేదు" అని చెప్పేతలికి అందురూ అచ్చెరపోయిరి.

ఒకనాడు ఎద్దు ఒకటి ఊడిపించుకుని, పక్క చేన్లో మేస్తా ఉంది. పట్టుకుని గొత్తుకు కట్టేసేదానికి ఎవుర్ని పిలిచినా "అమ్మా, ఆ ఎద్దు పొడుస్తుంది" అని వెనకేటు వేస్తుండారు. అప్పుడు మా రాజా ఒక్కడే తెంపుగా పొయ్యి, మేస్తుండే ఎద్దు పగ్గాన్ని పట్టుకుని వచ్చి నా చేతికిచ్చినాడు. నేను దూరంగా ఉండి పగ్గాన్ని గొత్తుకు ముడేస్తిని.

మా మామ, గొర్రెల్ని అడివికి తోలుకుని పోయేనపుడు రాజాను కూడా పిలుచుకుని పోతాడు. అడివిలో గుళ్లనక్కలనూ తోడేళ్లనూ మా గొర్రెల పక్కలకే రానియ్యడంట రాజా. సాయంకాలమప్పుడు ఇంటికి మలేసుకుని వస్తుంటే ఆతట్టూ ఈతట్టూ చేన్లల్లోకి పోకుండా గొర్రెల్ని సాలుగా పొయ్యేనట్లు నడిపిస్తాడంట. ఇంటికి వస్తానే, మేము గిన్నెలో కలిపిపెట్టిన మజ్జిగ సంగటిని ఒక ముద్ద మట్టంగా తిని, పరిచి పెట్టిండే గోనెమింద పణుకుంటాడు. రెయ్యంతా సడీసప్పుడీ లేకుండా గొర్రెలదొడ్డికి కాపలా కాస్తుంటాడు.

మా ఇల్లు రోడ్డును ఆనుకునే ఉంటాది. రోడ్డుమింద ఉండుండీ బస్సులూ బండ్లూ పోతా ఉంటాయి. మా అక్క పిల్లోళ్లని రోడ్డుమిందకి పోనీకుండా అడ్డంగా కుచ్చుంటాడు రాజా. ఇంటికి పాతచుట్టాలు ఎవురన్నా వస్తే, వాళ్లని 'బాగుండారా' అన్నట్లు కుసిలిస్తా ముందరి కాళ్లు వాళ్లమింద వేసి పలకరిస్తాడు. కొత్తమనుషుల్ని వాకిలి దగ్గరికే రానీడు. మా ఇంట్లో అందరికీ రాజాగాడంటే ప్రాణం.

ఆ ఏడాది మా చేన్లో నూరుమూటల చెనిక్కాయిలు అయినాయి. చెనిగపంటకు కాపలాగా ఉండి, వామిలో ఎవుర్నీ చెయ్యి పెట్టనిచ్చేవాడు కాదు. ఆడవాళ్లము సాయంకాలం పూట చెంబుతో నీళ్లు ఎత్తుకుని బయటికి పోతే, మా వెనక తోడుగా వచ్చి కాపలాగా ఉంటాడు. ఇట్ల అన్ని పనుల్లోనూ చేదోడుగా ఉండేవాడు మా రాజా. పాడిపంటలతో మా ఇల్లు కళకళలాడతా ఉండేది.

ఒకతూరి వారందినాలు జడివాన పట్టుకునింది. ఒకనాటి రెయ్యి మెరుపులతో ఉరుములతో కుండపోత వాన మొదలైంది. గొర్రెల కొట్టమంతా నానిపోయింది. ఈ వానలో ఏ దొంగ వస్తాడులే అనుకుని, పగలంతా గొర్రెల్ని మేపిమేపి అలిసిపోయిన మా మామ ఇంట్లోకి వచ్చి నిదరపోయినాడు. మేము చానా పొద్దు వరకూ ఆ మాటా ఈ మాటా మాట్లాడుకుని అనెంక పణకుంటిమి.

నడిరెయ్యి దాటినంక నిజంగానే గొర్రెలదొడ్డిమింద దొంగలు పడిరి. ఎందురు వచ్చిరో తెలీదు కానీ రాజా మటుకు పెద్దగా అరస్తా ఉండాడు. ఉరుములకీ మెరుపులకీ కదిలే చెట్లనీడల్ని చూసి అరస్తుండాడు లే అనుకుని ఒకరుగానీ బయటికి పోకుండా నిదరపోతిమి. కొంచెంసేపటికి రాజా అరుపులు నిలిచిపోయినాయి.

అందరమూ తెల్లవారి రవంత పొద్దెక్కినాక లేస్తిమి. బయిటికి పొయ్యి చూస్తే వెదురు తడకకు కట్టిన తాళ్లు విప్పేసుండారు. రాజా ఇంటి చూరుకింద ఉలుకూపలుకూ లేకుండా పణుకోనుండాడు. గొర్రెలకల్లా తెరపార చూసేతలికి, మేటైన ఈనమోపిన పదిగొర్రెల్ని తోలుకుని పొయ్యేనుండారు. రాజాకు ఏదో మత్తుమందు ఇచ్చినట్లుండారు. మతిలేకుండా ముద్దతినకుండా పంచలోనే పణుకుని ఉండిపోయినాడు ఆపొద్దంతా రాజా. అమీర్, గొర్రెల్ని ఎత్తుకుపోయిన దొంగలకోసం ఒక నెల్లాళ్లు వెతికి చాలించుకున్నాడు. తిరిగి తిరిగి అలిసిపోయినాడు కానీ దొంగల జాడే తెలీలేదు. రాజాకు మేలుకాలేదు. వాడిని చూస్తుంటే మాకందరికీ కడుపులు తరుక్కు పొయ్యేవి. కాళ్లను ముందుకు సాపి కాళ్లమింద తలపెట్టుకుని కన్నీళ్లు కార్చేవాడు. ఎప్పుడో ఒకతూరి అంత ముద్ద తినేవాడు, లేకుంటే అదీ లేదు. అట్లనే పణుకోని ఉండేవాడు. ముందర ఉన్నట్లు చురుకేలేదు.

ఆపొద్దు తెల్లారుజామున ఐదు గంటలయింది. ఆ పొద్దులో బీరంగికొత్తకోట నింటి పత్తికోటకు పొయ్యే బస్సు మా ఇంటి ముందునింటే, గొర్రెలదొడ్డికి ఆనుకోని పోతాది. మతిపోయిండే మా రాజా తెలియక రోడ్లో పణుకోనుండాడు. వేగంగా వచ్చిన బస్సు రాజామిందకు ఎక్కేసింది. బయంకర మైన పెద్దశబ్దం. ఏందా అనుకుంటా అందరమూ రోడ్డుమిందకి పరిగెత్తిమి.

ఆ శబ్దానికి దొడ్లోని గొర్రెలు లేచి 'బే బే' అంటా ఉండాయి. ఆవులు లేచి పగ్గాలను విడిపించుకునేకి తన్లాడతా ఉండాయి. చెట్లమింద ముడుక్కునుండే కోళ్లు రెపరెపమని కిందకి దూకినాయి. చుట్టుపక్కల ఇండ్లల్లో వాళ్లంతా లేచి వచ్చేసిరి. పొయి చూస్తే ఏముండాది, మా రాజా బజ్జి బజ్జి అయిపొయి ఉండాడు. ఆ గోరాన్ని చూసేకే కాదు.

"ఓరి దేవుడా, మా గొర్రెలికి కావిలి కాస్తివే దేవుడా,

మా ఇంటికి పెద్దదిక్కుగా ఉంటివే దేవుడా,

పిల్లోళ్లను యాదికి పోనీకుండా కాపు కాస్తుంటివే దేవుడా,

నువ్వు తోడులేకుండా ఏమందు పెట్టిరో కదా దేవుడా, మతిలేకుండా అయిపోతివే దేవుడా,

ఇంగ రొన్నాళ్లకు బాగయితావులే అనుకుంటినే దేవుడా,

నిన్నిట్ల చూస్తాననుకోలేదు దేవుడా..." అని గుండెలు బాదుకుని ఏడస్తా ఉండాది మా అత్త. అందరి కళ్లల్లోనింటీ నీళ్లు కారిపోతా ఉండాయి. **అ**

ఈ రచయిత్రిది చిత్తూరు జిల్లా పడమటి ప్రాంతంలోని మొలకల చెరువు అనే వూరు. చిత్తూరు జిల్లాలో మహిళా సంఘాలవాళ్ళు పదేండ్లకు పైగా నడుపుతున్న 'నవోదయం' అనే మాసపత్రిక సంపాదకవర్గంలో పనిచేస్తున్నారు. వీరి తొలి కత 'కప్పు దేవర' నవోదయం పత్రికలో వచ్చింది. ఇది రెండవ కత.

ఫోన్ : **9652802471**

**కవిత**

# జీవన గీతం



**జీవితం**

పుష్పించటం
పొడి రాలిపోవటం కాదు
సౌరభాలు వెదజల్లటం !
జీవితం
వెలిగి ఆరిపోవటం కాదు !
చీకటిని పటాపంచలు చేసి
వెలుతురుని నలుగురికీ అందించటం !
జీవితం చిగురించటం !
మొక్క మానైపోవటం కాదు
పదుగురికీ ఫలాలు పంచటం!
ప్రవాహమై పొంగులెట్టి
పొలం మడుగుల్లో పరుగులెట్టి
నారుకి ప్రాణం పోసినప్పుడే
నది జీవితం సార్థకం !
పరిమళాల్ని పొదవుకొని
జీవధాతువు నింపుకొని
సృష్టిగీతాన్ని రచించినప్పుడే
వాయువు జీవితానికి అర్థం !
జీవితమంటేనే
సుఖదుఃఖాలని
కలిమిలేముల్ని
పాడిపంటల్ని
సామూహికంగా పంచుకుంటూ
కలసికట్టుగా కాలంతో పోరాడటం
జీవనోత్సవంలో పాల్గొంటూ
ఆరు రుతువులై వర్థిల్లటం !

**- గుర్రాల రమణయ్య**
నెల్లూరు. ఫోన్: 09963921943

# నిరంతర 'ప్రగతి'కి నిర్వచనం



జనవరి 17న 'చెరగనిస్ఫూర్తి తాపీ ధర్మారావు' పుస్తక విడుదల సభలో 'ప్రగతి' హనుమంతరావు

సామాన్య వ్యవసాయ కుటుంబంలో పుట్టి స్వయంకృషితో అంచెలంచెలుగా ఎదిగి, సమాజం గర్వించదగిన స్థాయిలో తన 90వ ఏట కన్నుమూశారు. పరుచూరి హనుమంతరావుగారి జీవితం నుంచి యువతరం నేర్చుకోవలసింది ఎంతో వుంది. ఆయన జీవితంలోకి పరికించిచూస్తే - తాను ఎదుగుతూనే మిత్రులను, తోటిసమాజాన్ని తనతోపాటు ఉన్నత శిఖరాలకు చేర్చగల దక్షత ఆయనలో మనకు కనబడుతుంది. హైస్కూలు, కళాశాల విద్యార్థి దశలోనే కమ్యూనిస్టుపార్టీలో చేరి, కళారంగంపై ఆసక్తి పెంచుకుని, ప్రజానాట్యమండలిలో బలరాజ్ సాహ్ని, కైఫీ అజ్మీ, కె.ఏ.అబ్బాస్, శైలేందర్ వంటి దిగ్గజాలతో కలిసి పనిచేశారు. 1947-48లో తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో భాగమై రాజమండ్రి, కడలూరు జైళ్ళల్లో మూడేళ్ళ శిక్ష అనుభవించారు. ఆ సమయంలోనే ఏ.కె.గోపాలన్, కడియాల గోపాలరావు, మోటూరి హనుమంతరావు, కొరటాల సత్యనారాయణ, ఎం.ఆర్.వెంకట్రామన్ వంటి వారితో సాన్నిహిత్యం పెంచుకున్నారు. మద్రాసు పచ్చయప్ప కళాశాలలో బి.ఏ. చదివి, తనతోపాటు కలిసి చదువుకున్న సీతాలక్ష్మిగారిని 1952లో పెండ్లి చేసుకున్నారు. జీవితం గడపడం కోసం మిత్రులు వాసిరెడ్డి నారాయణరావుగారితో కలిసి డిటెక్టివ్ నవలలను ప్రచురించి, అమ్మేవారు. ఈ విధంగా ముద్రణారంగంతో మొదలైన ఆయన పరిచయం ప్రగతి ప్రింటర్స్‌ను 1962లో ప్రారంభించి, క్రమక్రమంగా దానిని భారతదేశంలోనే చెప్పుకోదగిన ఒక గొప్ప అధునాతన ముద్రణాలయంగా తీర్చిదిద్దేందుకు మూలమైంది. 1992-93కు గాను భారత రాష్ట్రపతి నుండి జాతీయఅవార్డును అందుకున్నారు. 2001 నుండి అంతర్జాతీయ స్థాయిలో ముద్రణారంగంలో ప్రతిష్ఠాత్మకమైన SAPPI (సప్పి) అవార్డును ఎన్నోసార్లు పొందారు. అఖిలభారత మాస్టర్‌ప్రింటర్స్ సమాఖ్యకు అధ్యక్షులుగా జాతీయస్థాయి ప్రతిభ అవార్డులను ప్రవేశపెట్టారు. అవి నేటికీ కొనసాగుతున్నాయి. ప్రజాసేవారంగంలో హనుమంతరావుగారి కృషిని వివరించటానికి ఒక పుస్తకాన్ని వ్రాయవలసి వుంటుంది. ఆయన 1996లో స్థాపించిన 'ప్రగతి ప్రజాధార్మిక ట్రస్టు' ఎన్నో సేవాకార్యక్రమాలు చేస్తూ వుంది. ఎందరో పేద విద్యార్థులను ఆయన చదివించారు. ఆ సంస్థ ద్వారా స్థాపించిన ఆసుపత్రిలో ఇప్పటికి 20వేల మందికి పైగా రోగులకు ఉన్నతస్థాయి చికిత్సలను, ముఖ్యంగా స్త్రీలకు, పిల్లలకు ఉచితంగా అందించారు. అన్ని వసతులతో కూడి ప్రఖ్యాతిగాంచిన చంద్రరాజేశ్వరరావు వృద్ధాలయం హనుమంతరావు గారు స్థాపించిందే. ఎందరికో ఆదర్శంగా నిలిచిన ఆ వృద్ధాశ్రమంలో 70 యేళ్ళు దాటినవారు ఇప్పుడు 112 మందిదాకా తృప్తిగా జీవిస్తున్నారు. ఆయన పోషకులుగా వున్న 'విజ్ఞానజ్యోతి ఎడ్యుకేషన్ సొసైటీ' ఇప్పుడు రాష్ట్రంలో మొదటివరుసలో వున్న ఉత్తమసంస్థ. కమ్మసంఘం అధ్యక్షులుగా హైదరాబాదులో పెద్ద భవంతిని నిర్మాణం చేసి, దాంట్లో నిర్మించిన సభామందిరంపై వచ్చే ఆదాయంతో అన్ని కులాల నుంచి వచ్చే అర్హులైన విద్యార్థుల చదువుకు సాయపడ్డారు.

సినిమారంగంలో, సాంస్కృతికరంగంలో నిరంతరం ఆయన సేవలనందించారు. హైదరాబాదుకు సినీరంగం తరలడంలో ఆయన పాత్ర కూడా వుంది. సారథి స్టూడియోస్‌ను హైదరాబాదులో నిర్మించడంలో ఆయన కృషి వుంది. సినీరంగ హేమాహేమీలతో కలిసి ఆయన పనిచేశారు. హైదరాబాదులో తన జీవితం చివరివరకు ఆయన అనేక సాంస్కృతిక, విద్యారంగ కార్యక్రమాల్లో పాల్గొంటూండేవారు. తెలుగు భాషోద్యమంలో ఆయనకు భాగం వుంది. తాపీ ధర్మారావుగారితో ఆయనకున్న సాన్నిహిత్యం సాటిలేనిది. జీవితం చివరి వరకు తాపీ వారి స్మృతులను ఆయన చెప్తూ వుండేవారు. తాపీ ధర్మారావు వేదిక పేరుతో కొందరు మేధావులతో ఏర్పడిన సంఘానికి ఆయన ప్రథమ సభ్యులు. ఇటీవల ఈ వేదిక తరఫున ప్రచురించిన వ్యాసాల సంకలనాన్ని 2015 జనవరి 17న హైదరాబాదులో ఆవిష్కరించిన సభలో ఆయన ప్రముఖంగా పాల్గొన్నారు. అదే ఆయన పాల్గొన్న చివరిసభ. ఆ సభలో ఆయన తాపీ ధర్మారావుగారి జ్ఞాపకాలను సభలో వివరిస్తూ కళ్ళనీళ్ల పెట్టుకోవటం, ఆ నిండుసభను ఉద్విగ్నం చేసింది. విలువైన ఆ పుస్తకాన్ని పూర్తిగా తానే ఖర్చుభరించి, ప్రగతిప్రింటర్స్‌లో ముద్రించి ఇచ్చారు. ఆ వివరాలను 'అమ్మనుడి' తొలి సంచిక (మార్చి 2015) లో ఇచ్చాం. ముద్రణారంగంలో నిబద్ధతకు, ప్రామాణికతకు, క్రమబద్ధమైన ఎదుగుదలకు, అత్యాధునికతకు పట్టంకట్టి అందరికీ ఆదర్శంగా నిలిచి, సమాజానికి అంకితమై జీవించిన హనుమంతరావుగారు తెలుగుజాతి సమకాలీన చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతారు. ఆయన అర్ధాంగి సీతాలక్ష్మి గారు, కుమారులు నరేంద్ర, మహేంద్ర గార్లు వారి ఆశయాలను మరింత ముందుకు తీసుకుపోతారనడంలో సందేహం లేదు.

'ప్రగతి' హనుమంతరావుగారితో నా పరిచయం 'నడుస్తున్నచరిత్ర' పత్రికతోనే జరిగింది. ఆయన పత్రికను ఎంతో అభిమానించేవారు. పత్రిక 2013 అక్టోబరు నుంచి ఆగిపోయినందుకు ఆయనెంతో బాధపడ్డారు. " 'నడుస్తున్నచరిత్ర' మళ్ళీ నడవాలి. నేనేం చేయాలో చెప్పండి" అని డిశంబరులో 'చెరగని స్ఫూర్తి తాపీ ధర్మారావు' పుస్తకం ప్రచురణ విషయంగా పెద్దలు, వారి మిత్రులు నర్రా కోటయ్యగారితో పాటు ఆయనను కలిసినపుడు అన్నారు. మళ్ళీ 'అమ్మనుడి' పేరుతో వస్తున్నదని పుస్తక విడుదల సందర్భంలో చెప్పినపుడు ఆయన ఎంతగానో సంతోషించారు. 'అమ్మనుడి' పత్రిక తొలిసంచికను అందుకుని ఆనందపడ్డారు. రెండవ సంచికలోనే ఆయన మృతికి సంతాపాన్ని తెలుపుకోవాల్సి వస్తుందని ఊహించలేదు. అనారోగ్యం నుంచి కోలుకున్నారనే భావించాను. కానీ ఇంతలో ఇలా ముంచుకొస్తుందనుకోలేదు. వారి కుటుంబసభ్యులతో, బంధుమిత్రులతో సంతాపాన్ని పంచుకుంటున్నాము.

**- సంపాదకుడు**

న్యాయరంగం

- శ్రీ చిమ్మె జాన్ బర్నబాస్

# 'పౌరస్వేచ్ఛ'కు సుప్రీంకోర్టు భాష్యం

సమాచార, సాంకేతిక పరిజ్ఞానచట్టం (ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ఆక్ట్ 2000) లోని సెక్షన్ 66ఎ ను భారత అత్యున్నత న్యాయస్థానం, సుప్రీంకోర్టు 24-3-2015న కొట్టివేస్తూ చారిత్రాత్మకమైన తీర్పునిచ్చింది. ఇది భారత రాజ్యాంగంలోని వార్ సభా స్వాతంత్ర్యానికి భరోసానిచ్చే అధికరణం 19(1) ఎ కు విరుద్ధమని వ్యాఖ్యానించింది.

ఐ.టి.చట్టంలోని సెక్షన్ 66(ఎ) ప్రకారం ట్విట్టర్, ఫేస్‌బుక్ వంటి సోషల్ మీడియా సైట్‌లలో వచ్చే అభ్యంతరకరమైన వ్యాఖ్యలు చేసిన వారిపై చర్యలు తీసుకోవచ్చు, శిక్ష విధించవచ్చు. ఈ తీర్పును సుప్రీంకోర్టు నాయయమూర్తులైన జస్తి చలమేశ్వర్ మరియూ రోహింటన్ ఫాలీ నారీమన్‌తో కూడిన ధర్మాసనం తీర్పు చెప్పింది. సుప్రీంకోర్టు న్యాయమూర్తులు ఈ తీర్పును ప్రకటిస్తూ, రాజ్యాంగం కల్పించిన వాక్ స్వాతంత్ర్యం, భావ ప్రకటనాస్వేచ్ఛ వంటి ప్రాథమిక హక్కులపై తీవ్ర ప్రభావం చూపుతుందని వ్యాఖ్యానించారు. ఈ సెక్షన్ పూర్తిగా రాజ్యాంగ విరుద్ధమని వ్యాఖ్యానించారు.

ఇదేసమయంలో ఇంగ్లండ్‌లో బ్రిటిష్ కోర్టు ఇచ్చిన తీర్పులను కూడా ప్రస్తావించారు. చట్టం దుర్వినియోగం కాకుండా చూస్తామని కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన సమాధానాన్ని కోర్టు త్రోసిపుచ్చింది. ప్రభుత్వాలు వస్తూ ఉంటాయి - పోతూ ఉంటాయి. కానీ సెక్షన్ 66ఎ మాత్రం ఎప్పుడూ ఉంటుంది" అంటూ, ఇప్పుడు ఈ ప్రభుత్వం హామీ ఇస్తుంది - తర్వాత ప్రభుత్వం కూడా ఇలాగే వ్యవహరిస్తుందని ఎవరైనా భరోసా ఇవ్వగలరా? అంటూ ధర్మాసనం ప్రశ్నించింది.

ఐ.టి.చట్టంలోని సెక్షన్ 69ఎ, 79 ని రద్దు చేయడానికి ధర్మాసనం నిరాకరించింది. కొన్ని నియంత్రణలతో ఈ రెండు సెక్షన్లు కొనసాగుతాయని స్పష్టం చేసింది. కొన్ని నియమ నిబంధనలను ఈ సెక్షన్లకు వర్తింపజేసింది.

**కేసు పూర్వాపరాలు :**

వాణిజ్య రాజధాని ముంబయిలో శివసేన అధినేత బాల్ థాకరే మరణించిన సమయంలో ముంబయిలో బంద్ పాటించడాన్ని షహీద్ అనే యువతి ఫేస్‌బుక్‌లో ప్రశ్నించింది. రేణు శ్రీనివాస్ అనే మరో యువతి ఆ కామెంట్‌కు 'లైక్' అని కొట్టింది. దీనిని నేరంగా పరిగణించి, ఆ ఇద్దరు యువతులను పోలీసులు 2012లో అరెస్ట్ చేశారు. సాధారణ జన జీవనానికి ఇబ్బంది కలిగించిన బంద్‌ను ప్రశ్నించడం నిస్సందేహంగా 'భావ ప్రకటనాస్వేచ్ఛ' కిందకే వస్తుందని, అయితే విస్తృత అర్థాన్నిచ్చేలా ఐ.టి.చట్టం సెక్షన్ 66ఎ ను అన్వయించి, వారిని అరెస్ట్ చేయడం పౌరుల ప్రాథమిక హక్కులకు భంగం కలిగించినట్లేనని, ఐటి చట్టంలోని ఆ సెక్షన్‌ను తొలగించాల్సిందిగా ప్రభుత్వాన్ని ఆదేశించాలని కోరుతూ 'శ్రేయా సింఘాల్' అనే మహిళ ప్రజాప్రయోజన వ్యాజ్యాన్ని దాఖలు చేసింది. దీనిపై సుప్రీంకోర్టు పైవిధంగా తీర్పునిచ్చింది.



అరెస్టు అయిన షహీన్ బహుదా, రేణూ శ్రీనివాస్ లకు ఊరట లభించింది. తప్పుడు పనులు చేసే ఏ రాజకీయపార్టీ అయినా లేదా వ్యవస్థ (సంస్థ)పై అయినా తమ వాణి (అభిప్రాయం) వినిపించే ప్రజల విజయంగా ఈ తీర్పును భావించవచ్చు.

ఇటీవలికాలంలో అంతర్జాలంలో ఫేస్‌బుక్, ట్విట్టర్ వంటి సామాజిక అనుసంధాన వేదికలపై యువజనం తమ భావోద్వేగాలను, ఆయా అంశాలూ, పరిణామాలపై అభిప్రాయాలను స్వేచ్ఛగా కలబోసుకుంటోంది. అంతర్జాలంలో ప్రమాదకర పోకడలను ఉపేక్షించజాలమన్న కేంద్ర ప్రభుత్వ వాదనలలోని హేతుబద్ధతను మన్నిస్తూ, దేశ ప్రయోజనాలకు విఘాతం కలిగించే వెబ్‌సైట్లను నిషేధించే అధికారం కేంద్రానికి ఉందని స్పష్టం చేసింది.

ఎక్కడైనా, ఎప్పుడైనా, స్వేచ్ఛకు అర్థం విచ్చలవిడితనమో, విశృంఖలత్వమో కానీ కాదు 19(1) (ఎ) అధికరణ ద్వారా, భావ ప్రకటనాస్వేచ్ఛకు భరోసా యిచ్చిన భారత రాజ్యాంగం - 19(2) ద్వారా ఏ యే సందర్భాలలో ఆ స్వేచ్ఛకు సహేతుక ఆంక్షలు విధించగల వీలుందో విస్పష్టంగా ప్రకటించింది. దేశ సమగ్రత, సార్వభౌమత్వం, దేశభద్రత, విదేశాలతో మైత్రీబంధాలు, శాంతిభద్రతలు, నైతిక ప్రవర్తన, కోర్టు ధిక్కారం, నేరానికి పురిగొల్పడం, పరువునష్టం వంటి కీలకాంశాలలో వ్యక్తి స్వేచ్ఛను హేతుబద్ధంగా నియంత్రించే అధికారాన్ని ప్రభుత్వానికి కట్టబెట్టింది. ఐ.టి.చట్టంలోని 66ఏ-రాజ్యాంగంలోని ఈ 19(2) అధికరణ క్రింద చెల్లుబాటు అయ్యేది కాదు. సుప్రీంకోర్టు గట్టిగా తీర్మానించడానికి, ఈమధ్యకాలంలోనే చోటుచేసుకున్న ఎన్నెన్నో అరాచకాలు దోహదపడ్డాయి.

పూర్తిగా నేరపూరితమైన లేదా భయాందోళనలు పెంచే ఏ సమాచార ప్రసరణమైనా, ఎవరినైనా సతాయించడానికో, అసౌకర్యం కలిగించడానికో, అవమానించడానికో, తప్పుడు సమాచారం పంపినా, తప్పుడు ఈ-మెయిల్ చిరునామాలతో ఇబ్బందిపెడుతూ మోసగించాలని చూసినా - 66(ఎ) ప్రకారం మూడేళ్ళ జైలుశిక్ష, జరిమానా విధించగల వీలుంది. గతంలో పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీపై వ్యంగ్య

కవిత

# కథన కార్యక్రమం



ఎంతగా చెపుతూ పోతున్నా
ఈ కథనానికి
అంతు కనిపించడం లేదు
విసుగు తలకెక్కని పదాలివి.
ఒక దాని వెంట ఒకటి
అవ్యవధానంగా ఉబికొస్తున్నాయి.
వైవిధ్యాన్ని ఒంటపట్టించుకున్న
సన్నివేశాలు
మనసుకు మిరుమిట్లు కొలుపుతున్నాయి.
అభివ్యక్తీకరణ చణత
ఎప్పటికప్పుడే సరికొత్త పదునుతో
అభిప్రాయాలకు రూపకల్పన చేస్తున్నది.
ఎండ రాకతో కాలం
చలికి సెలవులు ప్రకటిస్తుంటుంది.
ఈ కథన కార్యక్రమం
సెలవులను కోరుకునేది కాదు.
ఇది కాలాతీతంగా
ధారాళంగా సాగిపోతుంటుంది.
కథన వేగాన్ని చూస్తూ
కన్నుకుట్టిన సంఘటనలు కొన్ని
దాన్ని ప్రతిఘటించాలని
ఎత్తులు వేస్తుంటాయి.
తమ ప్రవాహాలకు అడ్డుతగిలే
కటిక రాళ్లను
గవ్వల్లా ఎగరేసుకుపోయే
ఝురులశీలం ఈ కథనానిది.
జీవ ఝురులు
సమగ్ర విశ్రాంతి తీసుకునేది
సాగరం ఒడిలోనికి చేరుకున్నప్పుడే.
ఈ కథన వ్యాసంగం
చరమఘట్టం అందుకునేది
ఉద్దిష్టలక్ష్యం ప్రాప్తించినప్పుడే.

- డా॥ సి. నారాయణరెడ్డి
ఫోన్: 040-24753724

---

**సుప్రీంకోర్టు తీర్పుతో 66(ఎ) సెక్షన్‌కు ముగింపు పడినట్లే. ప్రాథమిక (పౌర) హక్కులు భారత రాజ్యాంగానికి గుండెకాయ లాంటిది అని డా॥ బి.ఆర్.అంబేద్కర్ ఆనాడు చేసిన వ్యాఖ్యానాన్ని ఈ తీర్పు సార్థకం చేసినట్లయింది. పౌర, ప్రజాస్వామిక హక్కులను, నిరంతర అధ్యయనం - నిరంతర పోరాటం ద్వారానే పరిరక్షించుకోవాలి.**

చిత్రాలను మిత్రులతో పంచుకున్నందుకు ప్రొఫెసర్ అంబికేశ్ మహాపాత్రోపైనా, మహారాష్ట్రలో కార్టూనిస్ట్ అసీమ్ త్రివేదీపైనా, నాటి కేంద్రమంత్రి పి.చిదంబరం తనయుడి మీద ఆరోపణలు చేసిన ఓ వ్యాపారవేత్తపైనా, అడ్డగోలుగా 66(ఎ) ఐ.టి.చట్టం ప్రకారం కేసులుపెట్టి, వేధింపులకు గురి చెయ్యడం సంచలనం కలిగించింది. ఇప్పుడు సుప్రీంకోర్టు ఇచ్చిన చారిత్రాత్మక తీర్పు ద్వారా ఈ పాశవికచట్టం అమలు కాకుండా నిలుపుదల చేయబడింది.

"దేశవ్యాప్తంగా న్యాయస్థానాలన్నీ 'భావ ప్రకటనాస్వేచ్ఛ'కు గొడుగుపట్టాలి. దాన్ని దెబ్బతీసేందుకు ప్రభుత్వాలు చేసే చట్టాలను, చర్యలను త్రోసిపుచ్చడం, వాటి ప్రాథమిక విధి" - అంటూ దాదాపు మూడు దశాబ్దాల క్రితమే న్యాయపాలిక (లా కమీషన్) స్పష్టీకరించింది.

'ప్రభుత్వ యంత్రాంగాన్ని తీవ్ర పదజాలంతో విమర్శించే హక్కు ప్రతి పౌరుడికీ ఉంది - హింసను ప్రేరేపించినట్లయితేనే ప్రభుత్వం ఎవ్వరిమీదనైనా రాజద్రోహం కేసు పెట్టగలుగుతుంది." అంటూ ముంబయి హైకోర్టు ఇటీవల స్పష్టం చేసింది. 2011లో అన్నా హజారే అవినీతి వ్యతిరేక ఆందోళన జరిపినప్పుడు రాజ్యాంగంపై వ్యంగ్య చిత్రాలు గీసి పంచిపెట్టారంటూ అసీమ్ త్రివేదిపై అప్పటి మహారాష్ట్ర ప్రభుత్వం - 66(ఎ) తో పాటు రాజద్రోహం కేసును బనాయించింది. "పౌరుల స్వేచ్ఛను అణగద్రొక్కేందుకు భారతీయ శిక్షాస్మృతిలో కొలువైన దుష్టనిబంధనలలో అత్యంత కీలకమైనది"గా మహాత్మాగాంధీ పేర్కొన్న 124(ఏ) (రాజద్రోహం) అధికరణను బ్రిటన్ తన రాజ్యాంగం నుంచి ఆరేళ్ళక్రితం తొలగించింది. నాటి వలస పాలకుల చట్టాలకు చేదోడుగా రూపొందించబడిన 66(ఏ) వంటివి రేపటి పౌరుల భవిష్యత్తును నాశనం చేసేవిధంగా ఉన్నట్లు సుప్రీంకోర్టు భావించింది.

ఉత్తరప్రదేశ్‌లో సమాజ్‌వాదీపార్టీ నాయకుడు అజాంఖాన్‌పై ఒక యువకుడు ఫేస్‌బుక్‌లో 'అభ్యంతర వ్యాఖ్య' పెట్టాడంటూ భిన్న మతవర్గాల మధ్య శతృత్వం పెంచడం సహా పలు సెక్షన్ల క్రింద 18-3-2015న కేసు నమోదు చేశారు. ఐ.టి.చట్టం 66(ఏ) క్రింద నమోదవుతున్న కేసులలో కేంద్రం ఇస్తున్న మార్గదర్శకాలను పట్టించుకున్నవారే లేదు.

సైబర్ నేరాలు, యుద్ధాల నియంత్రణపై శక్తియుక్తులు కేంద్రీకరించాల్సిన ప్రభుత్వాలు 'పిచ్చుకపై బ్రహ్మాస్త్రం' లాగా సెక్షన్ 66(ఎ)ను వాడుకుంటున్నాయి. సుప్రీంకోర్టు తీర్పుతో ఈ సెక్షన్‌కు ముగింపు పడినట్లే. ప్రాథమిక (పౌర) హక్కులు భారత రాజ్యాంగానికి గుండెకాయ లాంటిది అని డా॥ బి.ఆర్.అంబేద్కర్ ఆనాడు చేసిన వ్యాఖ్యానాన్ని ఈ తీర్పు సార్థకం చేసినట్లయింది. పౌర, ప్రజాస్వామిక హక్కులను, నిరంతర అధ్యయనం - నిరంతర పోరాటం ద్వారానే పరిరక్షించుకోవాలి.

రచయిత ఫోన్ : 9440575765

- శ్రీ సన్నిధానం నరసింహశర్మ

# గ్రాంథిక గ్రంథాలూ వాడుక భాషాభిమానుల కర్తవ్యాలూ

**ప**త్రికలు, దృశ్య మాధ్యమాలే ఈనాడు ప్రధాన మాధ్యమాలు. వాటన్నిటా వాడుక భాష వుంది. అయితే ముద్రిత గ్రంథాల పాత్ర కూడా వుంది. అందులో అడపాతడపావచ్చే గ్రాంథిక గ్రంథాల్ని పట్టించుకోవాలి. ఉద్యమ భావశీలురు చెప్పేది చెబుతూనే వుండాలి. గ్రాంథిక వాదము లేకపోవచ్చు. లేకపోవచ్చు ఏమిటి... లేదు. గ్రాంథిక వాదులూ కనిపించడం లేదు. కానీ గ్రాంథిక గ్రంథాలు కొద్ది సంఖ్యలో రాస్తున్న వాటిని గురించి ప్రజాప్రయోజనకర రచనలూ చర్చలూ సాగుతూనే వుండాలి. ఇది స్వాగతించదగిన ప్రజాస్వామిక లక్షణం.

విశాఖపట్టణంలో నేను ఇద్దరు స్ఫూర్తిమూర్తుల దర్శనానికి వెళ్ళేవాడిని. ఒకరు పురిపండా అప్పలస్వామిగారు, రెండోవారు ఆంధ్రశేషగిరిరావు గారూ.

ఆంధ్రజ్యోతిలో ఒక వ్యాసంలో విశ్వనాధసత్యనారాయణగారు ఇప్పుడీ పురిపండా అప్పాలస్వామిగారు ఒకరు మాకు అడ్డుపడకుండా వుంటే విశ్వవిద్యాలయాల్లో గ్రాంథిక విషయంలో ఎంతో ముందుకు వెళ్ళివుండే వాళ్ళం అనే అర్థం వచ్చేలా రాశారు. అలా అనడంలో పురిపండావారి భాషా పోరాట పటిమ కూడా చెప్పక చెప్పారు.

ఒకతూరి విశాఖలో మహనీయుడు పురిపండావారిని ఉదయపు పొద్దు నడకలో కలిశాను. నన్ను చూడగానే గంగాధరం గారు (నేదునూరి) బావున్నారా? మధునాపంతులవారు బాగున్నారా అని అడిగారు. బాగున్నారండీ అన్నాను. కలుపుగోరుపలుకుల్లో నేను - మీరు వ్రాసిన మహాభారతం - వ్యావహారికభాషలో రాసినది నాకు చాలా నచ్చిన గ్రంథనుండీ అన్నాను. 'నేను వ్యావహారిక భాషలో రాయలేదన్నారు. రాశారు కదండీ అన్నాను. 'నేను వాడుకభాషలో' రాశాను అన్నారు. శబ్దం లేకుండా నాకు చెంపచెళ్ళుమన్నట్టనిపించింది. మనం వ్యావహారిక భాషను వాడుకభాష అనడమే సబబు అన్నారు. అది ఉద్యమశీల వాక్కు పురాణపండ రామమూర్తి గారి వంటి పెద్దలెందరో భారతాన్ని వచనంలో రాశారు. అవన్నీ వాటివాటి పాత్రలు వహించినవే. సమాజం ఆదరించినవే. అయితే పురిపండా అప్పలస్వామిగారి ఆంధ్రమహాభారతం మనకు ఒక చలన చిత్రంగా కనబడుతుంది. కారణం అందులో సజీవ నదీప్రవాహంగాఉన్న వాడుక బాస. అందులోని అందచందాలూనూ.

గ్రాంథిక భాషను వేడుక భాష అని, వ్యావహారికభాషను వాడుకభాష అనీ అనడం బాగుంది. వాడుకబాస అంటే మరీ బాగుంటుంది. అయితే కాలానుగుణమైన సడలింపులు ఎప్పుడూ తప్పవు.

ఒక గిడుగు - ఒక గురజాడ - ఒక సామినేని - ఒక శ్రీపాద - ఒక పురిపండా - ఒక తాపీ - ఒక వార్ల ఇంకా ఎంతమందో మహనీయుల నాటి నాటి భాషాసమరాల కారణంగా, ప్రధానంగా పత్రికల కారణంగానే ప్రజలు వాడుక భాషకు పట్టం గట్టారు. వజ్రాయుధాలు! గ్రామ్యారణ్యకుఠాలు. పక్ష ప్రతిపక్ష గ్రంథాయుధ శాంతిసమరాలు తెలుగుభాషా చరిత్రలో ప్రయోజనకర అధ్యాయాలు ఎన్నో.

తొలినాళ్ళలో ఒకనాడు సమ ఉజ్జీగా పోరాడిన పండిత గ్రాంథిక యోధులు వాడుకభాషావాదుల వద్ద తరువాత తరువాత వెనుక అడుగు వేయక తప్పలేదు. ఆధునిక కాలంలో కనపడని ఎన్నికల్లో వాడుక భాషావాదులు నెగ్గారు. గ్రాంథికవాదులకు డిపాజట్లు దక్కని పరిస్థితులు వచ్చాయి, డిపాజిట్లు రాకపోయినా వారికి ఇంకా కొన్ని ఓట్లు వచ్చాయన్నదే కొంతలో కొంత సత్యం. ఇక్కడ గ్రహించవలసిందేమిటంటే - ఇప్పుడు గ్రాంథికవాదులు లేనట్లే. దానితోపాటు గ్రాంథికవాదమూ లేనట్లే. అయితే గ్రాంథిక రచనలు ఏ శాతంలోనో అడపాతడపా గ్రాంథికభాషలో వస్తున్నాయి. ఇవి వస్తున్నంతకాలమూ వాడుక భాషాభిమానుల కర్తవ్యాలు కొన్ని మిగిలేవున్నాయనిపిస్తున్నాయి. వేయికంప్యూటర్ల పెట్టు ఒక్క గిడుగు రామమూర్తి గారు నన్నయ, తిక్కన వంటి కవుల పదప్రయోగకోశ గ్రంథాలు లేని కాలంలో మహాకవుల పదప్రయోగాల్ని చూపడంలో ఆయన శిఖర సదృశ పండితులకే విభ్రాంతి కలిగించేవారు. జీవితమంతా ఆయనది సమరమే.

గిడుగు పిడుగు 1940లో కీర్తిశేషులయ్యారు. తరువాత గ్రాంథిక భాషలో గ్రంథాలు వచ్చాయి. 1970, 1980 సంవత్సరాల్లోనే కాదు - 2000 సంవత్సరం తర్వాత కూడ అల్పసంఖ్యలోనైనా గ్రాంథిక గ్రంథాలు వచ్చాయనేది ముద్రణ సత్యం. ఇందులో అనుపమాన పరిశోధన గ్రంథాలు, బహువిషయ పాండిత్య విజ్ఞానాంశాలు, శ్రామికఫలాలుగా ఉన్న అంశాన్ని తక్కువ చేసి చూపడం ఈ వ్యాస ఉద్దేశంకాదు. కానీ వీటిపట్ల వాడుక భాషాభిమానుల ఉద్యమ శీల స్పందనలు తగివంతగా ఉన్నాయా అనేది ప్రశ్నేమరి. తాపీధర్మారావు, నార్ల వంటివారి కాలాల తరువాత కృషి సామాజిక అవసరం కాదని అనగలమా? పాత్ర వహించాలి కదా అనేది ఓ ఆలోచనా తరంగం.

ఒకసారి ఆంధ్రజ్యోతి విజయవాడ కార్యాలయంలో సంపాదకులు నండూరి రామమోహనరావుగారిని కలిసిన సందర్భం. "స్థలనామ

పరిశోధక సంఘాల ఆవశ్యకత అనే అంశం పై మా పత్రికలో ఆరుద్ర ఓ వ్యాసం రాశారు. దానిపై మీ రాజమండ్రి నుండి గురజాల హనుమంతరావు అనే ఆయన విమర్శిస్తూ ఓ వ్యాసం. పంపారు, అదీ బాగుంది. మంచి విషయాలు రాశారు. కానీ వేయడం లేదు. ఎందుకంటే గ్రాంథికంలో రాయడం వల్ల. గ్రాంథికంలో రాయడం అంటే తమ చెట్టుకొమ్మను తామే నరుక్కున్నట్లు కదా" అని అనడం మరచిపోలేనిది.

1970 దశకంలో రాజమహేంద్రవరమ్నుండి గ్రాంథిక వాసనలతో బులుసుసీతారామశాస్త్రి సమాలోచన అనే ఓ మంచి సాహిత్య పత్రిక నడిపారు.

1979లో వ్యాసభారతము -నన్నయ పరిష్కారము అనే సుమారు 800పుటల సాధికార పరిశోధన గ్రంథాన్ని సంపూర్ణ గ్రాంథికభాషలోనే రాశారు, ఆంధ్రవిశ్వవిద్యాలయం డాక్టరేటు పట్టా ఇచ్చింది.

1982లో 'తిక్కన చేసిన మార్పులు-ఔచిత్యపుతీర్పులు' అనే పరిశోధనా గ్రంథాన్ని సికిందరాబాదుకు చెందిన డా॥ పి. సుమతీ నరేంద్ర గ్రాంథికంలోనే రాశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం పట్టాపొందారు.

1983లో సుందరకాండకు వ్యాఖ్యానం అమలాపురానికి చెందిన మల్లాదిగోపాలకృష్ణశర్మ అరసున్నాలు లేకుండా గ్రాంథికంలో రాయగా – చిత్రమేమిటంటే... దీనికి మాగురువుగారు మధునాపంతులవారు అరసున్నాలతో కూడిన గ్రాంథిక పీఠిక సమకూర్చడం. 1987లో ఆంధ్ర సాహిత్యములో హరిశ్చంద్రోపాఖ్యానము అని డా॥ వాసా ప్రభావతి గ్రాంథికంలో రాశారు. 1978లో ఉస్మానియా పిహెచ్.డి ఇచ్చారు. 1976లో రామచంద్రుని వేంకట శేషయ్య ఆంధ్ర భాషాబోధన సర్వస్వము అనే పుస్తకాన్ని అరసున్నలతో కూడుకున్న గ్రాంథిక భాషలో రాశారు. 1973లో 'తిక్కన కావ్యశిల్పము' గ్రంథాన్ని ఓరుగల్లు నుండి కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి రాశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం పిహెచ్.డి. పట్టా పొందిన ఈ గ్రంథం గ్రాంథిక భాషలో రాయబడింది. జానపదకవి వంటి కవికొండల వేంకటరావు రచనలపై – ఆయన కృతులు సమీక్షా గ్రంథాన్ని జడప్రోలు విజయలక్ష్మి కొంచెం సరళంగా ఉండే గ్రాంథికంలో రాశారు.

తిరుపతి నుండి దావులూరి కృష్ణకుమారి 'కవిజనాంజన పరిశీలనము' అనే పరిశోధన శ్రమైక సాధ్యమైన గ్రంథాన్ని గ్రాంథిక భాషలో రాశారు. ఈ గ్రాంథిక భాషా గ్రంథానికి బే.రా, చే.రాలు వాడుక భాషలో పీఠికలు రాశారు. బేతవోలు వారు తమ పీఠికలో "వీరిది వ్యావహారిక రూపంలో ఉన్న గ్రాంథికభాష. వ్యాకరణం కనక శైలి ముమ్మూర్తులా వ్యావహారికంగా ఉండడం చాలా కష్టం. వాక్యనిర్మాణంలో గ్రాంథిక శైలి అనివార్యం. అందుచేత ఉపరితలంలో వ్యావహారికత, అంతరంగంలో గ్రాంథికత కలగలిపిన శైలి అని గమనార్హమైన అంశాన్ని తెలిపారు.

సమగ్రాంధ్రసాహిత్యంలో ఎక్కువభాగం ప్రాచీన సాహిత్యానికి చెందిందే. ఆ పద్యకావ్యాలు, ప్రబంధాలు గురించి రాసింది. అంతా సజీవమైన వాడుకభాషలో ఉండడంవల్ల అధికప్రయోజనం ఒనగూడింది. నాలుగేళ్ళక్రితం 2011లో సంస్కృత మాఘకావ్యము -ఆంధ్రీకృతులు అమశీలనము అనే గ్రంథాన్ని డా॥ చెరువు సత్యనారాయణశాస్త్రి గ్రాంథికంలో రాశారు.

1990లో ముద్రించిన డా॥ చిటిప్రోలు సుబ్బారావు గ్రంథం పల్నాటిపోదరకవుల జీవితము – సాహిత్యము అనే గ్రాంథిక భాషలోని గ్రంథానికి డా॥ ఎస్.గంగప్ప వాడుక భాషలో పీఠిక రాశారు.

గిడుగు వారు మరణించి డెబ్బదిఏళ్ళు పైబడి దాటింది. ఈ డెబ్బది ఏళ్లల్లో గ్రాంథిక భాషలో గ్రంథరచనలు కొందరు అన్ని ప్రాంతాల్లోనూ చేశారు. ఏ భాషలో రాసుకోవాలనే దాన్ని ఎంచుకునే హక్కు రచయితల కుంది, కాదనలేం. కాని, వాడుక భాషాప్రేమికులు, కొంత ఉద్యమ శీలత్వం కలిగిన వారు – అయ్యా మీరు కష్టపడి జ్ఞానార్జన చేసి పరిశోధించి రాసే గ్రంథాల్ని గ్రాంథికంలో కాక, వాడుక భాషలో రాస్తే అధికప్రయోజనం అని సమీక్షా సందర్భాల్లో, ఉపన్యాస సందర్భాలలో, విమర్శల సందర్భాలలో చెప్పవలసిన అవసరం సామాజికంగా భావించాలి.

**రచయిత ఫోన్ : 9292055531**

లోటుపాటులు

- శ్రీ మాదిరాజు రాంబాబు

# 'ఆప్' తీరూ–తెన్నూ



**సుదీర్ఘకాలం అవినీతితో అంటకాగుతున్న సంప్రదాయ పాలకపార్టీల మీద ప్రజలకు ఏవగింపు కలిగిన దశలో నాలుగేళ్ళ క్రితం ప్రముఖ సంఘసేవకుడు అన్నాహజారే నాయకత్వంలో అవినీతి వ్యతిరేక ఉద్యమం మొదలైంది. జన్‌లోక్‌పాల్ ఏర్పాటు డిమాండ్‌తో కూడిన ఈ అవినీతి వ్యతిరేక ఉద్యమం యూపీఏ ప్రభుత్వాన్ని, భా.జ.పా. రాష్ట్ర ప్రభుత్వాలను గడగడలాడించాయి. రాంలీలా మైదాన్, జంతర్‌మంతర్ ఉద్యమాలు దేశవ్యాప్తంగా మధ్యతరగతి, ఉన్నత మధ్యతరగతి వర్గ ప్రజలను బాగా ప్రభావితం చేశాయి. ముఖ్యంగా అంటర్నెట్‌లోని సోషల్ మీడియాతో అనుబంధమైన యువతరంను ఈ ఉద్యమాలు బాగా ఆకర్షించాయి. దేశవ్యాప్తంగా పట్టణాల్లో పుట్టుకొచ్చిన అవినీతి వ్యతిరేక ఉద్యమ నేపథ్యంలో 2012లో గాంధీ జయంతినాడు ఐఐటీ పట్టభద్రుడూ, రెవెన్యూ సర్వీసెస్ ఉన్నతాధికారి, మెగసెసే అవార్డు గ్రహీత కేజ్రీవాల్ నాయకత్వంలోని ఆమ్ ఆద్మీ పార్టీ (ఆప్) అత్యధిక మెజారిటీతో ఢిల్లీ అధికార పీఠంపై రెండవసారి కూర్చోవడం అందర్నీ ఆశ్చర్యపరచింది. అధికారం కోసం, ఆధిపత్యం కోసం రాజకీయపక్షాల మధ్య యుద్ధాలు, అంతర్యుద్ధాలు సహజమే. అయితే సంప్రదాయ రాజకీయ పార్టీలకు ప్రత్యామ్నాయంగా ముందుకొచ్చిన ఆప్‌లో ఇలాంటి పెడధోరణులు బయటపడడం అభిమానులను నిరాశపరచి ఉండొచ్చుగాని అది కొత్త పరిణామమేమీ కాదు.**

ఢిల్లీ అసెంబ్లీ ఎన్నికలలో అపూర్వ విజయాన్ని నమోదు చేసుకొని చరిత్ర సృష్టించిన ఆప్ సంఘటితమై, జాతీయస్థాయిలో విస్తరించాల్సిన తరుణంలో విభేదాలతో కొట్టుమిట్టాడటం, చీలిక దశకు చేరుకోవడం అభిమానులకు మింగుడుపడకపోయి ఉండొచ్చు. ఇటీవల ఢిల్లీలో జరిగిన ఆప్ జాతీయమండలి సమావేశం తీరు చూస్తే, పార్టీ వ్యవస్థాపక సభ్యులైన ప్రశాంత్ భూషణ్, యోగేంద్రయాదవ్, ప్రొఫెసర్ ఆనంద్‌కుమార్, ప్రొఫెసర్ అజిత్ ఝూలను పార్టీ జాతీయ కార్యవర్గం నుంచి బర్తరఫ్ చేసిన విధానం గమనించినవారికి ఆశ్చర్యం కలిగి ఉండదు. ఆ సందర్భంలో కొంతమంది అసమ్మతి సభ్యులపై కేజ్రీవాల్ అనుయాయులు దాడిచేసి కొట్టారు. యాదవ్, భూషణ్‌లు పార్టీ వ్యతిరేక చర్యలకు పాల్పడ్డారనీ, పార్టీని ఓడించే ప్రయత్నం చేశారనీ అధికారవర్గం ఆరోపణలు చేసింది. పార్టీ కన్వీనర్ పదవి నుంచి కేజ్రీవాల్ తప్పుకోవాలని వారిద్దరూ పట్టుపట్టారంటూ వచ్చిన ఆరోపణలు నిరాధారమని తేలింది. వారిద్దరినీ జాతీయమండలిలో మాట్లాడేందుకు అవకాశం ఇవ్వలేదు సరికదా, వారు పార్టీలో కొనసాగితే తాను తప్పుకుంటానని, తన ఎమ్మెల్యేలతో కలిసి వేరే పార్టీ పెడతానని వ్యాఖ్యానిస్తూ కేజ్రీవాల్ సభ్యులను బెదిరించారు. భూషణ్, యాదవ్‌లను బహిష్కరించినందు వల్ల కేజ్రీవాల్‌కు, ఆప్‌కు వచ్చే నష్టమేమీ లేదు. అయితే వివిధ సమస్యల పరిష్కారంలో ఆప్ ధోరణి, విధానం ఇలాగే అప్రజాస్వామికంగా ఉంటుందని ఈ సంఘటనలు హెచ్చరిస్తున్నాయి. భూషణ్, యాదవ్‌లు వివాదాస్పదులే కావచ్చు. కేజ్రీవాల్ పట్ల వారు మోసపూరితంగా వ్యవహరించి ఉండొచ్చు. అలాంటివారిపై సంస్థ ఏర్పాటు చేసుకున్న ప్రజాస్వామిక సూత్రాలను అతిక్రమించి కండబలంతో క్రమశిక్షణా చర్యలు తీసుకోవడం, బహిష్కరించడం సంస్థలో వ్యవస్థీకృతమైన వ్యక్తి కేంద్రిత (కేజ్రీవాల్) సంస్కృతికి అద్దం పడుతుంది. ఇది ఆప్ ప్రచారం చేసిన రాజకీయ ప్రాజాస్వామిక ఆదర్శాలకు భిన్నంగా వ్యవహరించడమే. పార్టీనిధులు వసూలు విషయంలో కేజ్రీవాల్‌పై వచ్చిన ఆరోపణల గురించి తన అభిమానులకు, ప్రజలకు ఆప్ ఏం సమాధానం చెబుతుంది?

దేశ రాజకీయ వ్యవస్థ ధనం, కండబలం, కులం, మతం వగైరా అంశాల ప్రభావంతో పూర్తిగా భ్రష్టుపట్టి, ఆ వ్యవస్థపై ప్రజలు విశ్వాసం కోల్పోయిన తరుణంలో స్వచ్ఛమైన, పరిశుద్ధమైన జనహితమైన రాజకీయం చేస్తామంటూ అరవింద్ కేజ్రీవాల్ ముందుకు వచ్చినప్పుడు సాధ్యాసాధ్యాలపైన అనుమానాలు ఉన్నప్పటికీ ముఖ్య మధ్యతరగతి ప్రజానీకం ఆహ్వానించింది. కొత్తగా ఉనికిలోకి వచ్చిన ఏ పార్టీ అయినా సామాజిక వ్యవస్థ మౌలిక స్వభావమైన కుటుంబపెద్ద అజమాయిషీ (అందరికీ పరిచయమున్న పదం–పితృస్వామ్యం) రూపాన్ని సంతరించుకోవడం సహజం. అయితే ఆ పార్టీ కార్యకలాపాలు మరింత విస్తృతంగా, లోతుగా విస్తరించేకొద్దీ తాను ఎంచుకున్న సామాజిక, రాజకీయార్థిక విధానాల ప్రాతిపదికగా అది సమాజంలోని పాలక లేదా పీడితవర్గాల ప్రయోజనాల పునాదితో ఏర్పడే సమష్టి యంత్రాంగాన్ని సంతరించుకోక తప్పదు. అలా కాకపోతే అది గిడసబారిపోయి, తన గురికి దూరమవుతుంది. కుటుంబపెద్ద అజమాయిషీ రూపం నుంచి తాను ప్రాతినిధ్యం వహిస్తున్న సామాజిక వర్గ అనుబంధిత సమష్టి పని విధానాన్ని అలవర్చుకునే సంధికాలంలో కొత్తగా వచ్చిన పార్టీలలో నాయకుల అహంకారాలు (ఈగో) సంఘర్షించుకునే రూపంలో అంతర్గత సంక్షోభాలు తలెత్తే అవకాశం లేకపోలేదు. ఈ చారిత్రక అనివార్యతను గుర్తించిన నాయకత్వం పార్టీ పరిణామం సాఫీగా జరిగేందుకు అనుకూలిస్తుంది. అలా గుర్తించనప్పుడు ఆ పరిణామం అంతర్గత సంక్షోభం రూపంలో సదరు పార్టీని అతలాకుతలం చేస్తుంది. తన వర్గసమష్టి పని విధానాన్ని సమర్థించే శక్తులు అంతర్గత బలాబలాల సమతుల్యతలో విజయం సాధిస్తే ఆ పార్టీ తాను నిర్దేశించుకున్న లక్ష్యాల వైపు మరో అడుగు ముందుకు వేస్తుంది. అలా కాని పక్షంలో క్రమంగా

కృశించిపోతుంది. కమ్యూనిస్టుపార్టీల విషయంలో కూడా ఇంతే. కార్మికవర్గ నాయకత్వంలో విశాల పీడిత ప్రజానీకాన్ని సంఘటితం చేసి సమాజంలోని వనరులన్నిటిపై ఆధిపత్యం వహిస్తున్న గుప్పెడు మంది ఆధిపత్య శక్తులకు వ్యతిరేకంగా పోరాడి అధికారంలోకి వచ్చేందుకు ప్రయత్నించే ఆశయం కలిగి వున్న కమ్యూనిస్టుపార్టీల పరిణామక్రమం ఇలానే ఉంటుంది. ఉద్యమించే క్రమంలో, మరింత విస్తృత ప్రజానీకంలోకి మరింత లోతుగా విస్తరించే క్రమంలో అది తన పనివిధానాన్ని, పద్ధతిని, నిర్మాణాన్ని మార్చుకోకపోతే గిడసబారిపోయి కనుమరుగయ్యే వీలుంది. అలాకాక ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవాలంటే, తాను లక్ష్యంగా పెట్టుకుని పనిచేస్తున్న విశాల ప్రజానీకాన్ని వివిధ కమిటీలు, యూనిట్లు, సంస్థల ద్వారా వివిధ స్థాయిల్లో సంఘటితం చేయడం, అందుకు అనుగుణంగా పార్టీలో అంతర్గతంగా సమష్టి కమిటీ విధానాన్ని పుణికి పుచ్చుకోవలసి ఉంటుంది. అయితే ఉనికిలో ఉన్న పాలకవర్గ రాజకీయార్థిక వ్యవస్థలో సమూలమార్పును కాక, ఆ వ్యవస్థ పర్యవసానంగా ఏర్పడే అవలక్షణాలైన అవినీతి, ఆశ్రిత పక్షపాతం వంటి అరూప విషయాల్లో మాత్రమే మార్పు రావాలని ఆప్ ఆశిస్తోంది. ఇదెలాంటిదంటే జబ్బు పోకుండా జబ్బుకు సంబంధించిన పైపై లక్షణాలు పోవాలని కోరుకోవడంలాంటిది. సమూల సామాజిక మార్పు రాకుండా ఈ వ్యవస్థలోనే తమ వంతు వాటా దక్కాలని ఆశించే మధ్యతరగతి ప్రజానీకానికి, సమాజంలో విప్లవాత్మక మార్పులు కోరే సామ్యవాదశక్తుల ప్రబలత్వాన్ని వ్యతిరేకించే కార్పొరేట్ శక్తులకు ఆప్ ఆశయాలు రుచిస్తాయి. ఉనికిలో ఉన్న కార్పొరేట్‌స్వామ్య వ్యవస్థలో కొనసాగుతూనే దానికి అంటుకున్న ఆశ్రితతత్వం, అవినీతి జాడ్యాలను జన్‌లోక్‌పాల్ వంటి వ్యవస్థల ద్వారా అరికట్టాలనేది ఆప్ లక్ష్యం. అంటే సమాజంలో ఉనికిలో ఉన్న ఆర్థికవిధానాన్ని లోపరహితం చేసి, సమూలమార్పును కోరే శక్తుల నుంచి ఆధిపత్య శక్తులను రక్షించేందుకు ప్రజల్ని పక్కదారి పట్టించేందుకే ఆప్ లక్ష్యాలు దొడ్డిరారిన ఉపకరిస్తాయి. ఉద్యమపార్టీగా ప్రాథమికస్థాయిలో ఉన్నప్పుడు కుటుంబపెద్ద యాజమాన్య రూపంలో నడిచిన ఆప్ పార్టీ అధికారంలోకి వచ్చిన సందర్భంలో నిర్మాణపద్ధతిలోను, పనివిధానంలోను మార్చుకోవాల్సిన అనివార్యత నుంచి అంతర్గత సంక్షోభానికి గురైంది. కేజ్రీవాల్ వ్యక్తిగత ప్రభావం, అసమ్మతిని గెంటివేయడంతో తాత్కాలికంగా ఆప్ సంక్షోభం పరిష్కారమైనట్లు కనిపించవచ్చు. ఆప్ భావవ్యవస్థ, వర్గ చారిత్రక పాత్రతో దాని పని విధానం, పద్ధతులు ఘర్షణ పడుతున్నాయి. తాను కాపాడదలచుకున్న ఆర్థికశక్తులతోనూ, ఆ విధాన భావజాలకర్తలతోనూ ప్రత్యక్షంగా, పరోక్షంగా ఒక సమష్టి అవగాహన, కార్యాచరణ యంత్రాంగాన్ని ఆప్ సంతరించుకోకపోతే దాని ప్రస్థానం ఢిల్లీతోనే ముగిస్తుంది. అలాగాక, తాను సంస్కరించదలచిన ఆధిపత్య ఆర్థికశక్తుల రాజకీయ ప్రాతినిధ్యతను ఆప్ సంతరించుకుంటే దేశంలో బలమైన రాజకీయశక్తిగా అవతరించే అవకాశం ఉంది.

రాజరికవ్యవస్థల్లో ఆర్థిక, రాజకీయ, న్యాయ పరిపాలన, పోలీసింగ్ వంటి రాజ్యవిధులు గ్రామ భూస్వామ్యవర్గం చేతుల్లో ఉండేవి. పెట్టుబడిదారుల మధ్య తీవ్ర ఆర్థికపోటీ మూలంగా రాజ్య కార్యకలాపాల్ని భూస్వామ్యశక్తుల్లాగా ప్రత్యక్షంగా నిర్వహించే తీరిక, అవకాశం ప్రజాస్వామిక వ్యవస్థలోని ఆధిపత్యశక్తి పెట్టుబడిదారీ వర్గానికి ఉండకపోవడం వల్ల తమ వర్గం తరఫున రాజ్య కార్యకలాపాలు నిర్వహించే యంత్రాంగం అవసరం. ఈ ఆవశ్యకత నుంచి రాజకీయపార్టీలు సహా వివిధ రాజ్యసంస్థలు, వ్యవస్థలు పుట్టుకొచ్చాయి. అలాంటి రాజకీయపార్టీలకు జవసత్వాలు అందించేందుకు వివిధ స్వచ్ఛందసంస్థలు (ఉదా. అమెరికాలో ఫోర్డ్, రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్లు) ఆవిర్భవించాయి. ఇవి కార్పొరేట్ భావజాలంతో పనిచేసే రాజకీయ నాయకులను తయారుచేయడం, శిక్షణ ఇవ్వడం వంటి కీలక బాధ్యతలు నిర్వర్తిస్తుంటాయి. అందుకే పాశ్చాత్య దేశాల్లోని మెజారిటీ నాయకులు ఇలాంటి ఫౌండేషన్ల శిక్షణ తీసుకున్నవారేనన్న విషయం గుర్తించాలి. అయితే భూస్వామ్య సమాజవాసనలు పూర్తిగా వదిలించుకోక, పెట్టుబడిదారీ స్వభావాన్ని పూర్తిగా వంటబట్టించుకోని భారతీయ సమాజంలో ఈ రెండింటికి మధ్యేమార్గంలో కుటుంబ వారసత్వ రాజకీయాలు ప్రబలంగా కొనసాగాయి. భూస్వామ్య మిగులు, దేశ, విదేశీ కార్పొరేట్ పెట్టుబడి, ప్రభుత్వ పెట్టుబడి వంటి ఆర్థిక మూలకాల సంశ్లేషిత రూపంగా తయారైన 'బ్యూరోక్రాటిక్ పెట్టుబడి' నేడు దేశ ఆర్థికవ్యవస్థను శాసిస్తోంది. ఇది రెండు దశలుగా సాగింది. స్వాతంత్ర్యానంతరం మిశ్రమ ఆర్థికవ్యవస్థ దేశంలో కొనసాగుతున్నంత కాలం వారసత్వ రాజకీయాలు కీలకపాత్ర పోషించాయి. అయితే 1990ల తర్వాత వేగవంతమైన ప్రపంచీకరణ ప్రక్రియ అనంతరం ఆర్థికవ్యవస్థలోని గణనీయమైన మార్పులు వాటికి అనుకూలించే రాజకీయ విధానాల్లో మార్పుకు దోహదం చేశాయి. రాజకీయాల్లో వారసత్వ అంశం తగ్గి, వివిధ ప్రాంతీయ అధికారకేంద్రాలు ఏర్పడ్డాయి. పైకి జాతీయపార్టీల ప్రాబల్యం తగ్గి, ప్రాంతీయపార్టీల ప్రాముఖ్యం క్రమంగా పెరిగింది. రాజకీయ వికేంద్రీకరణగా కనిపించినా మారిన సామాజికార్థిక పరిస్థితులకు అనుగుణంగా స్థానికంగా, ప్రాంతీయంగా రాజకీయాలు మరింత కేంద్రీకృత వ్యవస్థలుగా మారాయి. దేశంలో మరింత లోతుగా వ్యవస్థీకృతమవుతున్న బ్యూరాక్రటిక్ పెట్టుబడి ఆధిపత్యం పర్యవసానంగా ఇలాంటి రాజకీయ పరిస్థితులు నెలకొన్నాయి. ప్రాంతీయ పార్టీలు, వారసత్వ పార్టీలు, భావజాలపార్టీలే కాకుండా వాటి వైఫల్యాల నేపథ్యంలో స్వచ్ఛందసంస్థలు, ఫౌండేషన్ల ప్రాతిపదికగా ఉండే రాజకీయపార్టీలు మెట్రో నగరాల్లో పురుడు పోసుకున్నాయి. ఈ రాజకీయ వాతావరణాన్ని ప్రజాస్వామిక స్వభావాన్ని సంతరించుకున్న సంకీర్ణ రాజకీయాలయుగంగా కొంతమంది ఆధునికానంతర వాద, విశిష్ట అద్వైత మేధావులు అత్యుత్సాహంతో సూత్రీకరించారు. వీరి దృష్టిలో కేంద్రీకరణ అంటే అప్రజాస్వామికం; వికేంద్రీకరణ, వినిర్మాణం, విఘటన వంటి ప్రక్రియలు రెండూ ఒక వస్తుగత చారిత్రక నియమాలని, వివిధ చారిత్రక దశల్లో వివిధ వర్గాల అవసరాల రీత్యా వాటి పాత్ర పురోగామి, తిరోగామిగా ఉంటుందని వారు గుర్తించరు. కేంద్రీకృత జాతీయ రాజకీయాలు నిరంకుశ స్వభావంతో కూడినవని, సంకీర్ణ రాజకీయాలు ప్రజాస్వామికమని వారు గుడ్డిగా పరిగణిస్తారు. పునాది వర్గాల భిన్న స్వభావాలతో సంబంధం లేకుండా జాతీయ లేదా సంకీర్ణ రాజకీయాల స్వభావం స్వతంత్రంగా ఉనికిలో ఉంటుందని సూత్రీకరించడం శుద్ధ తప్పు. ఈ అవగాహన నేపథ్యంలో ప్రజాస్వామిక, సామాజిక స్వభావంతో

కవిత

# రెక్కలలసిన కోయిలమ్మా! అమ్మా! తెలుగమ్మా!



ఎవరే నిను పిలిచేరు?
పదే పదే పలుకుతావు?!
పచ్చదనం మాడిపోయి
మండుటెండ కసురుతుంటె!

ఎవరే నిను వినిచేరు?
పదే పదే పిలుస్తావు!!
పచ్చిస్వార్థ మావరించి
ఎండమావి కమ్ముతుంటె!

ఎవరికి కావాలి ఆమని తోడు?
నీ గొంతెండిన గుండెగోడు!

చరవాణిల సంగీతం
నీ ఆనవాలు దోచిందిగా!

ఎవరే నిను తలచేరు?
కవుల పైత్యమదికానీ!
పులుగూ-పుట్టా-చెట్టూ-చెరువూ
"రాజధాని" బలిపీఠికె!

తెలుగెవరికి కావాలి?
తెగులు రాజ్యమేలుతుంటె!
వెలుగెవరికి కావాలి?
ఇరులు చట్టమవుతుంటే

యువవసంత మెందుకో!
అడవి-చెట్లుగా కూలుతుంటె!

- ప్రజాసాహితి నాగరాజు
ఫోన్: 9441913829

సంబంధం లేకుండా కేవలం శుద్ధ భౌగోళిక తెలంగాణను కీర్తించిన మేధావులకు తాము చేసిన తప్పేమిటో ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది. ఈ సామాజిక నేపథ్యం నుంచి చూస్తేనే ఆప్ చారిత్రక స్వభావం అర్థమవుతుంది. ఆప్ విషయంలో కూడా ఇలాంటి అనుభవాన్నే వారు ఎదుర్కొనవలసిన పరిస్థితి వస్తుంది.

సామాజికార్థిక కార్యకలాపాల కొనసాగింపు లేదా ప్రతిఫలనమే రాజకీయాలు అనేది ఒక నానుడి. ఆకాశంలో స్వేచ్ఛగా, స్వతంత్రంగా విహరిస్తున్నట్లు కనిపించే గాలిపటంలా రాజకీయాలు కూడా ఆధిపత్య ఆర్థికశక్తులను శాసించే స్వతంత్రవ్యవస్థలుగా సాధారణ ప్రజలకు అనిపిస్తుంటాయి. అయితే గాలిపటానికి ఆధారసూత్రంలా సమాజంలోని ఆధిపత్య ఆర్థిక శక్తులకు అనువేయంగానే రాజకీయాలు వ్యవహరిస్తుంటాయన్న విషయం తరచూ మరుగున పడుతుంటుంది. 1990ల నుంచి దేశంలో కొనసాగుతున్న ప్రపంచీకరణ ప్రక్రియ నేపథ్యంలో రాజకీయాల కార్పొరేటీకరణ, కార్పొరేట్ ప్రాయోజిత రాజకీయాలు మరింత స్పష్టమైన రూపంలో వెలుగులోకి వచ్చాయి. ప్రపంచీకరణకు సహజాతంగా సమాజంలో అవినీతి మరింత లోతుగా, గాఢంగా, విస్తృతంగా వ్యవస్థీకృతమవడమే కాక, మరింత అనధికార చట్టబద్ధతను, సాంస్కృతిక ఆమోదాన్ని సంతరించుకుంది. కార్పొరేట్ల ఇష్టారాజ్యంగా సాగిన యూపీఏ పాలనలో వ్యవసాయరంగం తీవ్ర సంక్షోభంలో కూరుకుపోవడమే కాక, వివిధ సరళీకరణ సంస్కరణల వల్ల పారిశ్రామిక రంగం తొలుత సమాజంలోని కార్పొరేట్, మధ్యతరగతి వర్గాలకు లాభించింది. ప్రపంచీకరణ ఆర్థిక వికాసమనే బుడగ పగిలి 2007లో ప్రారంభమైన ఆర్థికమాంద్యం క్రమంగా రెండవ ప్రపంచ యుద్ధకాలంనాటి ఆర్థిక సంక్షోభం స్థాయిని మించిన నేపథ్యంలో ప్రపంచ సామాజిక రాజకీయ పరిస్థితుల్లో తీవ్ర పరిణామాలు చోటుచేసుకున్నాయి. వివిధ బహుళజాతిసంస్థలు, వాటి సహకార సంస్థలుగా ఉన్న జాతీయ కార్పొరేట్ అనధికార కార్యనిర్వాహక కేంద్రాలుగా దేశ రాజకీయ పార్టీలు పనిచేస్తున్న తీరు చూస్తే ఆ నానుడి మరింతగా అర్థమవుతుంది. ప్రధాన జాతీయపార్టీలు **కాంగ్రెస్, భా.జ.పా. సారథ్యంలో నడిచే యూపీఏ, ఎన్డీఏ కూటములు, వామపక్షాలు సహా వివిధ ప్రాంతీయపార్టీలు - అమెరికా, యూరోపియన్ యూనియన్ రాజకీయార్థిక కూటములు, వాటి అనుబంధ స్థానిక కార్పొరేట్ శక్తుల ప్రయోజనాల నేపథ్యంగానే కొనసాగుతున్నాయి.** ఢిల్లీ పాలనను సజావుగా కొనసాగించేందుకు, దేశవ్యాప్తంగా విస్తరించేందుకు ఆప్ కూడా ఈ జాతీయ, అంతర్జాతీయ యంత్రాంగంలో త్వరలో భాగస్వామి కాక తప్పదు. ఇప్పటికే అది ఆ యంత్రాంగంలో భాగస్వామి అయింది. అరవింద్ కేజ్రీవాల్, మనీష్ శిశోడియాలు నడిపే కబీర్ అనే ఎన్.జి.ఓకు గత మూడేండ్లలో ఫోర్డు ఫౌండేషన్ నుంచి లక్షల డాలర్ల నిధులు అందాయి. విదేశీ సంస్థలకు చెందిన సొమ్ము ప్రవాసభారతీయుల పేరుమీదుగా వివిధ అక్రమ మార్గాలలో ఆప్‌తో సహా రాజకీయపార్టీలందరికీ చేరుతూనే వున్నాయి. **ఈ వాస్తవికతకు భిన్నంగా ఆప్ దేశ రాజకీయాలను సమూలంగా మార్చివేయగలదని ఆశించడం దురాశే.**

రచయిత ఫోన్: 9441829339

ప్రకృతి-2

# సమన్యాయం !

- డా॥ కొప్పుల హేమాద్రి

అంబానీలూ, సాంసంగ్‌లూ, సోనీ ఆబులూ గట్రా - చిప్ప పట్టుకుని అడుక్కునేవాళ్ళ మీదా; గంప నెత్తికెత్తుకుని కూరగాయలూ, చేపలూ అమ్ముకునేవాళ్ళ మీదా; మేకల్నీ, గొర్రెల్నీ, బర్రెల్ని మేపుకునే గోపాలురు తదితర బడుగుజీవుల మీదా పడి ఎలా బ్రతికేస్తారో (సెల్ ఫోన్ల వాడకం ద్వారా) అలాగే... కొన్ని వృక్షాలు సైతం తమ దాపున పెరిగే, పెద్దగా గుర్తింపులేని మొక్కల మీద పడి మెక్కుతూ నిలదొక్కుకుంటాయి! ఉదాహరణకి - శ్రీ గంధం చెట్టునే తీసుకుందాం. శ్రీ గంధం విత్తనం మొలకెత్తీ యెత్తగానే, భూమిలోపల రూపు దిద్దుకుంటున్న దాని వేరు, పక్కనే పెరిగే మరేదో జాతి మొక్క తాలూకు మూలంలోకి దూరి, అది తయారుచేసుకున్న తిండిని పీల్చేస్తుంది! అలా ఆరంభంలో పరాన్నజీవి (పారసైట్)గా బ్రతికి బట్టకట్టి నిలదొక్కుకున్న శ్రీగంధం చెట్టు పెరిగి పెద్దదై నిలువెల్లా సుగంధభరితమై పోవడంతో పవిత్రవృక్షంగా పూజలందుకుంటుంది కాని, దాన్ని ఆదిలో ఆదుకున్న మొక్కను మాత్రం ఎవరూ పట్టించుకోరు అనుకుంటాం. ఐతే అసలు విషయం అదికాదు! మంచిగంధం చెట్టు అవలంబించిన పద్ధతి కూడా - ఆ అటవీప్రాంతం 'పర్యావరణ పరాకాష్ట (క్లైమాటిక్ క్లైమాక్స్)'ను చేరుకునే దిశానిర్దేశంలో ఒక దశగా 'ప్రకృతి' చేపట్టిన విన్యాసమే! ఇంకా చెప్పాలంటే - ఆ అనామక మొక్క పాత్ర సైతం ఆ విన్యాసంలో ఒక భాగమే!ఆ విధంగా ఆ రెండు మొక్కలచేతా ప్రకృతే సముచితమైన పాత్రలను పోషింపజేసి తద్వారా జీవావరణ సమతుల్యత (ఇకలాజికల్ ఈక్విలిబ్రియం) కు బాటవేసింది!

అరణ్యం అన్న తరువాత అక్కడ మొక్కలతోపాటు మృగాలూ ఉంటాయి కదా. జీవావరణం సమతుల్యంగా ఉన్నదంటే దాని అర్థం - ఆ ప్రదేశంలో ఉన్న గడ్డీ గాదం మొదలుకొని మహావృక్షం దాకా, సూక్ష్మజీవి నుంచి గజరాజు, వనరాజు దాకా, ఏ కొరతా లేకుండా బ్రతకడమే. మృగాలలో గడ్డితినేవి కొన్ని, మరో జాతికి చెందిన జంతువుల మాంసాన్ని తినేవి మరికొన్ని, గడ్డి తిని లేళ్ళూ, దుప్పులూ, దున్నలూ తమ సంతానాన్ని అభివృద్ధి చేసుకుంటాయి. వాటిని తిని పులులూ, సింహాలూ గట్రా తమతమ వంశాలను అభివృద్ధి చేసుకుంటాయి. ఈ చర్య సవ్యంగా జరుగుబాటు ఉన్న అరణ్యం 'ఇకలాజికల్ ఈక్విలిబ్రియా'న్ని కాపాడుకుంటున్నట్లే! ఎలా అంటే, ఇక్కడ గడ్డి తదితర మొక్కల పెరుగుదలను లేళ్ళూ, దుప్పులూ, దున్నలూ, ఏనుగులూ అదుపులో పెడితే - వీటిని పులులూ, సింహాలూ గట్రా అదుపులో పెడతాయి. కనుక జీవావరణ సమతుల్యతలో మార్పు ఉండదు.

కాని మానవుడనే మృగం ఉందే - దీని బుద్ధికి 'దురాశ' అనే జాఢ్యం పట్టింది! ఇది లక్ష సంవత్సరాల క్రితం 'హోమో ఎరక్టస్' (నిటారుగా నిలబడిన మనిషి)గా ఉండినవాడు కాస్తా 'హోమో సెపియన్స్' (Thinking Man: బుద్ధిజీవి) గా మారినప్పుడే మొదలై, ఇప్పుడు తారాస్థాయికి చేరుతుంది! జంతుప్రపంచంలో ఇతర జంతు జాతులకు లేని వివేచనా జ్ఞానం ఈ మనిషి సొంతం అయినా, అదేమి చోద్యమో కాని అతని చేత అతని కనులే అతని మనస్సును కలుషితం చేయిస్తాయి. అందుచేత ఆ మనస్సు సౌమ్యపద్ధతిలో పనిచెయ్యదు! అతనికి హితకరమైన జీవనం కన్నా సుఖప్రదమైన జీవనం అంటే మోజు! అసలు గొడవంతా ఇక్కడే మొదలై, ప్రకృతిపైనే పోటీ పడేంత వరకూ వెళ్ళింది.

ఇరవై యేళ్ళ క్రితం దూరదర్శన్ (టివి)లో జీవావరణ రక్షణ గురించి ఓ కార్యక్రమం వచ్చింది. అందులో కొంతమంది పిల్లల్ని వృత్తాకారంలో కూర్చోబెట్టి, ప్రతి ఒక్కరి కుడిచెయ్యి చూపుడువేలునూ ఆకాశానికి గురిపెట్టించారు. తరువాత వారిలో ఒకరి వేలికి ట్వైన్ దారాన్ని జారిపోకుండా ముడివేసి, ఆ దారాన్ని అతనికి అభిముఖంగా ఉన్న దాని వేలికీ, అక్కడనుండి మొదటివాడి పక్కన ఉన్నవాడి వేలికీ, అక్కడ నుండి అతని అభిముఖంగా ఉన్నవాడి వేలికీ - ఇలా అందరి చూపుడువేళ్ళకూ తగిలించారు. అందరూ వారి వారి వేళ్ళను బిగించి పట్టుకోవడంతో ఇప్పుడు అది అశోకచక్రంలా అమిరింది. అంతా సవ్యంగానే ఉన్నదనుకున్న సమయంలో ఒక కుర్రాడు తన వేలికి ఉన్న 'లింకు' ఊడిపోయేలా కుడి చేతిని కదిలించాడు. ఫలితంగా ఆ చక్రం కాస్తా అస్తవ్యస్తమైపోయింది!

పిల్లలు తమ చూపుడువేళ్ళకు ట్వైన్‌దారాన్ని చుట్టుకుని, తాము కూడా అందులో భాగమై తయారుచేసిన చక్రాన్ని జీవావరణ సిద్ధాంతం చట్రంలో బిగించి - ఏ ఒక్కరు తప్పిదం చేసినా మొత్తం వ్యవస్థ ఎలా కుదేలైపోతుందో జనరంజకంగా 'ప్రజంట్' చేసిన ఆ శాస్త్రవేత్తకు జేజేలు!

ఫోన్: 09848296865

**ఇదే మాదిరిగా మీరూ శాస్త్రీయ అంశాలను పత్రికకు రాయవచ్చు. - సం॥**



మన్నన

- శ్రీ సంకేపల్లి నాగేంద్రశర్మ



# డా॥ మలయశ్రీకి తెలంగాణా ప్రభుత్వ ఉగాది పురస్కారం

**తె**లంగాణా ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక తొలిసారిగా వివిధ రంగాలకు చెందిన 19 మంది ప్రముఖులకు ఉగాది పురస్కారాలనిచ్చి గౌరవించింది. పదివేల నగదుతోపాటు, శాలువాలు కప్పి ఎంపికైన అతిథులను ముఖ్యమంత్రి కల్వకుంట్ల చంద్రశేఖరరావు సన్మానించారు. తెలుగు సాహిత్యంలో ముగ్గురిని ముదిగంటి సుజాతారెడ్డి, మలయశ్రీ, గోరటి వెంకన్నలను ఎంపికచేశారు. మరో ఇద్దరు సాహితీవేత్తలు ఇతర రంగాల నుండి ఎంపికై పురస్కారాన్ని అందుకున్నారు. వేదపరిశోధన పేరిట ప్రముఖ హాస్యరచయిత ఎం.వి.నర్సింహారెడ్డిగారు (కరీంనగర్ జిల్లా) అందుకోగా, బాలసాహిత్యంలో 2011లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన డా. భూపాలరెడ్డి అందుకున్నారు. సంగీతం, జానపదం, శిల్పకళ, నృత్యం, పేరిణి నృత్యం, బుర్రకథ, మిమిక్రి, చిందుయక్షగానం, టివి, సినిమా, జానపద చిత్రకళ, హస్తకళలలో ఇతరులు అవార్డులకు ఎంపికయ్యారు. అంతేకాక తెలంగాణాకు చెందిన మరో ఇద్దరు - నవలారచనలో కె.వి.నరేందర్ చారిత్రక నవలారచనలో సి.శ్రీనివాసరాజు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు నుండి ఉగాది రోజున పురస్కారాలు అందుకున్నవారిలో వున్నారు. వీరిద్దరూ కరీంనగర్ జిల్లాకు చెందినవారే.

తెలుగుకు ఎనలేని సేవలు అందించిన కరీంనగర్ వాస్తవ్యులు డా.మలయశ్రీకి ఈ అవార్డుకు ఎంపిక కావడం తెలుగు భాషోద్యమ కారుల్ని, సాహిత్యాభిమానుల్ని ఆనందపరచింది. 74 ఏళ్ళ జీవితంలో యాభైరెండేళ్ళ సాహిత్యజీవితాన్ని పండించిన బహుముఖ ప్రజ్ఞాశాలి డా. మలయశ్రీ. తెలంగాణా ప్రభుత్వం తొలిసారిగా మన్మథనామ ఉగాది పురస్కారాన్ని వీరికి పట్ల ఇరు తెలుగు రాష్ట్రాలకు చెందిన రచయితలు, తెలుగుభాషాభిమానులు ఆనందపడ్డారు.

డా. మలయశ్రీ జీవితం తెరచిన పుస్తకం లాంటిది. ఇతరుల సాహిత్యాన్ని అభిమానించే సాహిత్యోద్యమజీవి. సన్మానాలు స్వీకరించడమే కాదు, ఎదుటివారి ప్రతిభాపాటవాలను గుర్తించి, సన్మానాలు చేయడం ఆయనకు పరిపాటి. ఆయన యదార్థ, హేతువాది, తొలుత సత్యార్థి పత్రికను నిర్వహించి, ప్రస్తుతం తెలంగాణా రాష్ట్రంలోనే తొలిసారిగా భౌతికవాది పేరుతో ద్వైమాసిక పత్రికను నిర్వహిస్తున్నారు. రచనలు చేయడమే కాదు, ఇతరుల రచనలను సరిచూడటం, వారి పుస్తకాలను ప్రచురించడం, తన రచనలకు ఇతరులచే పీఠికలు రాయించడం వంటివి ఆయన నిరుపమాన విశాల భౌతికవాద భావనలకు ప్రతీకలు. వీరు నవ్యసాహిత్య పరిషత్తును నెలకొల్పి పలు సాహిత్య సమావేశాలు నిర్వహిస్తున్నారు.

డా. మలయశ్రీ 10-10-1940న కరీంనగర్ జిల్లా మానకొండూరు మండలం చెంజర్ల గ్రామంలో మధ్యతరగతి రైతు కుటుంబంలో జన్మించారు. 1960 నుండి ఆయన తన రచనలను వెలువరించడం మొదలుపెట్టారు. ఆయన యాభై రెండేళ్ళ సాహితీ ప్రయాణం విజయవంతంగా కొనసాగుతోంది. పద్యకవిత్వంతో ఆయన కవిత్వం శ్రీకారం చుట్టింది. 20వ ఏట ధర్మశ్రీ బౌద్ధ పద్యకావ్య రచన కావించినా, 1968లో వీరి ఖండకావ్యం కావ్యసుందరి మొదటి పుస్తకంగా వెలువడింది. తదుపరి గేయ-వచన కవిత్వం, లలితగీతం, బాలసాహిత్యం, చరిత్ర, బౌద్ధం, హేతువాదం, నాటకాలు, నవల, కథ, సాహిత్య విమర్శ, పరిశోధన, లేఖాసాహిత్యం, అనువాదం, కథానిక వంటి వివిధ ప్రక్రియలలో ఆయన ఇప్పటికి 124 పుస్తకాలు రచించారు. బహుభాషా విశారదుడు, సంస్కృతంలో మానవగీతను రాశారు. ఆంగ్లంలో రైమ్స్, రిడిల్స్, హిందీలో దోహాలు రాశారు. గుర్తింపుపొందిన చరిత్రకారుడు. కేంద్రసాహిత్య అకాడమీలో బాలసాహిత్యకారుల ఎంపికకై జ్యూరి మెంబర్‌గా ఇటీవల వ్యవహరించారు. వివిధ యూనివర్సిటీ సెమినార్లలో చేసిన ప్రసంగాలు ఆయన విద్వత్తును ప్రస్ఫుటం చేశాయి. ఆయన రచనలు నేటితరం సాహితీవేత్తల సృజనలకు ఆకర గ్రంథాలుగా ఉపయోగపడుతున్నాయి. ఆయన రచనలపై విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు సాగుతున్నాయి.

డా॥ మలయశ్రీ ప్రతిఏటా తన జన్మదినోత్సవమైన కార్తీకపున్నమి రోజున ఎంపికచేసిన సాహితీవేత్తలకు ప్రతిభా పురస్కారాలు ఇచ్చి గౌరవిస్తున్నారు. నాలుగేళ్ళ నుండి వివిధ సాహిత్య, సాంస్కృతిక సంస్థలు డా॥ మలయశ్రీకి వరుసగా పురస్కారాలు ఇచ్చి సన్మానిస్తున్నాయి. అవార్డులకే అలంకారాలుగా నిలుస్తున్నారు. హైదరాబాద్ ఆంధ్రసారస్వత పరిషత్‌లో సెప్టెంబర్ 7, 2009న బి.ఎన్.శాస్త్రి స్మారక ప్రసంగం చేసి సాహితీప్రియులను అలరించారు. డా. మలయశ్రీ రాసిన నిర్ణయం నవల మూడు సంస్థల పురస్కారాలకు ఎంపికైంది. తెలంగాణా ప్రశస్తిని వివరించే వస్తునేపథ్యంలో రాసిన ఈ నవలలో భాష, భావం, శిల్పం

# తెలుగుజాతి కవి వేమన జయంతి వేడుకలు





ఈ ఉగాది (మార్చి 21)న గుంటూరుజిల్లా మోదుకూరు గ్రామంలో వేమన జయంతి సందర్భంగా రెండు సభలు జరిగాయి. మొదటిసభ వేమన విగ్రహం వద్ద అన్నపురెడ్డి రఘురామిరెడ్డి, అన్నపురెడ్డి వెంకటరెడ్డి, ఇమడాబత్తుని నాగేశ్వరరావు మొదలగువారి నిర్వహణలో జరుగగా, రెండవసభ పంచాయతీ కార్యాలయం వద్దగల వేమన కళావేదికపై 'వేమన జయంత్యుత్సవ సంఘం' ఆధ్వర్యంలో మొవ్వా శ్రీనివాసరెడ్డి, మొవ్వా సాంబిరెడ్డి, మున్నంగి సాంబిరెడ్డి మున్నగువారు నిర్వహించారు. రెండుచోట్లా కీ.శే.మొవ్వా వీరారెడ్డిగారి మనుమడు మొవ్వా శ్రీనివాసరెడ్డి సారథ్యం వహించారు. రెండు సభల్లోనూ 'వేమన వాక్కులు' గ్రంథరచయిత అంగత వరప్రసాదరావు, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥ సామల రమేష్‌బాబు, ప్రముఖ సామాజిక నాయకుడు శ్రీ మోదుగుల పాపిరెడ్డి మున్నగువారు పాల్గొన్నారు. మోదుకూరు వేమన జయంతి ఉత్సవసంఘ వ్యవస్థాపకులు కీ.శే.మొవ్వా వీరారెడ్డి జ్ఞాపకార్థం నెలకొల్పిన వేమన సాహిత్య పురస్కారాన్ని శ్రీ అంగత వరప్రసాదరావుకు ఇచ్చారు.

---

పోటీ పడ్డాయి. ఈ నవల 'నడుస్తున్న చరిత్ర' పత్రిక నిర్వహించిన మండలి వెంకట కృష్ణారావు స్మారక పోటీలకు 2009లో ఎంపికై ఐదువేల నగదు పురస్కారాన్ని పొందింది. ఇదే నవల 2011లో కడపలో జరిగిన కందుకూరి నవలా పురస్కారానికి ఎంపికైంది. వేయినవలల సృష్టికర్త కొవ్వలి శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకుని 2011లోనే నవలా పురస్కారానికి ఎంపికైంది. హైదరాబాద్‌లోని కిన్నెర ఆర్ట్స్ అకాడమి బాలసాహితీ పురస్కారం ఇచ్చి ఘనంగా సన్మానించారు. ప్రముఖ సాహితీవేత్త డా. తిరుమల శ్రీనివాసాచార్య వారి ధర్మనిధి సాహిత్య పురస్కారానికి ఎంపికై 2010లో సన్మానం పొందారు. నల్లగొండజిల్లా ఆలేరు తేజ ఆర్ట్స్ అకాడమి వారి సాహితీ జీవన సాఫల్య పురస్కారాన్ని హైదరాబాద్‌లో 2011లో డా. సినారె చేతుల మీదుగా అందుకున్నారు. తెలుగు సాహిత్య విమర్శలో, బాలసాహిత్యంలో తెలుగు విశ్వవిద్యాలయం నుండి రెండుసార్లు, 1977-78, 2007లో పురస్కారాలు అందుకున్నారు.

ఆయన 1989లో రాసిన కాకతీయుల కాలంనాటి సామాజిక జీవితం అన్న పరిశోధనా గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయం వారి పోటీ గ్రంథరచనకు ఎంపికై ప్రథమ బహుమతిని దక్కించుకుంది. వేయ్యేళ్ళ కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్రపై సిద్ధాంత పరిశోధన చేసి 1997లో ఉస్మానియా తెలుగుశాఖ నుండి పిహెచ్.డి. పట్టా పుచ్చుకున్నారు. ఈ గ్రంథ పరిశోధనతో వివిధ జిల్లాల తెలుగు సాహిత్య చరిత్రలకు దారి సుగమమైంది. డా. మలయశ్రీ రాసిన శాంతిపథం నాటకం (బౌద్ధవాదం) 1975-78 సంవత్సరాలకు ఇంటర్మీడియట్ తెలుగు ఉపవాచకంగా ఎంపికైంది. ఆయన 1997లో రాసిన అశ్వఘోషుని వజ్రసూచి సంస్కృతానువాదం సాహితీప్రియులను అలరించింది. తెలంగాణా చరిత్ర-సంస్కృతి, జనజీవనం అనెడి చారిత్రక పరిశోధక రచన 2010లో ప్రచురణ కాగా, ఇందులో ఎన్నో తెలంగాణా మూలచారిత్రిక సత్యాలు బయటపడ్డాయి. ప్రాక్ చరిత్రకారుడు స్వర్గీయ ఠాకూర్ రాజారాంసింగ్‌తో డా. మలయశ్రీకి వున్న సాన్నిహిత్యం ఎన్నో చారిత్రక పరిశోధనలకు దారితీసింది. తెలంగాణా పల్లెపాటలను జానపద పక్కీలో ఆయన 1970 తొలినాళ్లలో రాసి, ఆనాడే తెలంగాణా అభిమానాన్ని చాటుకున్నారు. ఆయన రాసిన వేమన నాటకం పలు ప్రదర్శనాలకు నోచుకొని, వారి సాహితీ గరిమను పెంచాయి. అందులో వేమన పాత్రను ఆయనే పోషించారు. ఆయన రాసిన తిరుగుబాటు, సహచరి నవలలు విశాలాంధ్ర బుక్‌డిపో, రచ్చబండ పత్రిక పురస్కారాలను పొందింది. కాళోజీ పురస్కారాన్ని జగిత్యాల పండిత కళాశాల నుండి 2013లో అందుకున్నారు. తెలుగులో లేఖాసాహిత్యంలో ఆయన రాసిన గ్రంథాన్ని 1991లో తెలుగు అకాడమీ వారు ప్రచురించారు. కాళోజీ జన్మదినమైన సెప్టెంబర్ 9ని 'తెలంగాణా మాండలిక భాషాదినోత్సవం'గా కాళోజీ బతికి వున్నపుడే ఆయన అనుమతితోనే డా॥ మలయశ్రీ ప్రకటించారు.

తెలంగాణా రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖలో నలభైఏళ్ళు అధ్యాపకుడిగా పనిచేసి 1998లో రిటైరయిన డా. మలయశ్రీ ఇన్నేళ్ళ తన సాహిత్యరచనా వ్యాసంగాల గూర్చి ప్రస్తావిస్తూ 'నేను ఇన్నాళ్లూ నా మాతృభాష తెలుగుపై మమకారంతో రచనలు చేస్తున్నానని, బౌద్ధంలో, హేతువాదంలో, చరిత్ర పరిశోధనలో తన రచనలు వాసిగాంచాయని, తెలంగాణాలోనే తాను ముందుంటానని' అన్నారు. 20 ఏళ్ళ నుండే నాస్తికవాదంపై మమకారం పెంచుకున్నారాయన. చదువుకునే రోజుల్లోనే బౌద్ధంపై మక్కువ కలిగింది. బౌద్ధ జాతక కథలు, పంచతంత్ర కథలు ఆయన్ని ప్రత్యేకంగా ఆకర్షించాయి. సాహిత్యంలో స్వతంత్ర దృక్పథం అప్పుడే వారి మదిలో రూపుదిద్దుకుందని భావించవచ్చును. కరీంనగర్ వేమననగర్‌లోని ఆయన విశాలమైన డాబా ఇల్లు ఒక యూనివర్శిటీ గ్రంథాలయంగా కనబడు తుంది. వచ్చిపోయే సన్నిహితులు, సాహితీవేత్తలు, పరిశోధక విద్యార్థులతో కళకళలాడుతూ వుంటుంది.

**రచయిత ఫోన్ : 9441797650**

గల్పిక

- శ్రీ గంగుల బాబు

# మన'మద' నామ సమచ్చరం...!

**పొద్దుగాల...**

మా యింటి ముంగెట... యేపసెట్ల మీద, సందడెక్కువైంది.
ఇంటెనక్క, పునాస మామిడి సెట్టు మీదట్లనే వుంది.
ముస్గు దియ్యకుంటనే, మా మన్మనితో, ఏందిరా ఆ లొల్లి అంటి. ఈ దినం పేపరు దెచ్చి, ఒక్కో అచ్చరం కూడబలుక్కొని, ఆకిరికి జెప్పె...
ఈరోజు జయనామ సంవచ్చరం వోయిందట. మన్మద నామసమచ్చరం వచ్చిందట.
పండ్గ జేస్తున్నట, తాతా అంట వాడూ, వేప సెట్లెక్త డేమొ, బయటికి పోనడు
అయ్యో! జయనామ సంమచ్చరమంతా మనకు జయమాయె.
గీ మన్మదుడూడి వద్దడు. గెట్లుంటదో, యేమొ అన్కుంట వుండగనే
పూలబానాల్ సేతవట్కని, సెలకల్ దోల్కుంట గనవడె
ఏ! మన్మదా! అచ్చినవా!
నీవసలే కతర్నాకోన్వి.
ఆపైన ఫోర్ టొంటీగాన్వి.

అంత పెద్ద సివయ్య గుండెల్లో, దూరి గుబుల్ బుట్టించినోన్వి. మేమెంతగని, సిన్న ముచ్చేట జెప్త యిను.
ఇక్కడ, అయ్య లాగంగ గూడవెట్టి
కొడుకు లడక్కముందె, లచ్చరూపాయిల్ వెట్టి
రెండుపయ్యల బండిగొనిచ్చిరి
సిత్తరమైన నిక్కర్లు, బనీన్లేస్కుని,
బిరాస్లైట్లు సేతికేస్కుని,
అందరూ జూడనికి
సెయ్యూపుకుంట, వందమైల్ల యిస్పీడ్‌ల,
ఆరన్‌మీద సెయ్యిదీయకుంట
గాల్లో వోతుంటే, నా గుండె దడదడ గొట్కుంటంటే
ఒకపోరన్నాపి, ఏందిరా ఆ యిస్పీడు అంటి.
నాగుండె, గుబులైతాందిరా, అంటి
ముసలోన్వి నీ గుండె గుబులైతేంటి,
ఆగిపోతేమట్కి ఏంటి.
ఎవలయిన పోరి గుండె గుబులైందంటె సెప్పు,
అడ్డమేస్త నా గుండె, అని ఎక్కిరిచ్చుకుంట వోయె,
గుండగొయ్యోడు
మొన్నామద్దె మాసందుల వోతాంటె
ఒకపోరెదురచ్చింది
దస్తీ కంటె జర పెద్దది
తుండ్గుడ్డ కంటె జర సిన్నది
ఔ! గసుంటి గుడ్డనే, మొలకు జుట్టి
బెత్త, బెత్తెన్నర, పేలిక పైన, ముడేసింది
దాన్నాపి, ముసలోల్లకు సెమటల్, వట్టిస్తుండవ్
అందరికి పిరీగ సినెమా జూపిస్తండవ్
ఏమె! గిదేం, యాసమేసినవ్
నీకు, నీయయ్యకు, గుడ్డల్, కరువా?
అనడిగితే, నవ్వుకుంట



యాసాల్ల, ఏయి తరీకలున్నయ్, తెలుసా?
ముసలోన్వి, నీకేం దెలుసు అన్కుంట
దొబ్గిపాయె

తెల్లారి మా గల్లీల వోతున్న.
వులిక్కివడ్డ, ఎవల్లో నాఏపే, వస్తాన్రు
నేను, నేనేనా?
నిద్దట్ల కలగంటున్ననా?
ఆని గిచ్చుకుని, జూసిన
సురుక్కున గోరు గుచ్చుకునె,
ఔ! నే, మేలికనే వున్న, నిద్రవోతలేను.
మరిదేంది! నిజమే. పోరికి పెయి మీద నూలుపోగు లేదు.
దెయ్యం గాదు గద!
దెయ్యమైతే, మెడ మున్గ, తెల్లబట్టలో, నల్లబట్టలో వుండాలి గద!
మన పోర్లు, రోజుకో యాస మేస్తున్నట్టు
మాడరన్ దయ్యాలు మాడరన్ తరీకల, వస్తన్నయేమొ
నే బారిపోత, అన్కుంట వుండగనే, రానె వచ్చె
నేపారివోయినా వట్కుంటది, వోకున్నా వట్కుంటది
అని బిక్కసచ్చి, బిగదీస్కుని, ఎండినకొయ్యగుంజలెక్క నిల్వడితి
ఏంది తాతా నిల్వుగుడ్లేసి గట్ల జూడవడ్తివి
నిన్న నువ్వేగంద! గుడ్డ కరువొచ్చిందా అని ఎకసక్కెమాడినవ్
గిదిగొ, గిప్పుడు జూడు. మెడనుండి, సీలమండలదనక్క, ఒకటే డ్రస్సు
అని, మెడల ఏల్డార్సి, లాగి వదలంగనే, టప్పుని, పెయికంటుకున్నది.
ఓసినీ, వండవడ, బంబాతున్నవని, దడ్సుక, జచ్చినగాదె
మరేంది, గుడ్డను పెవికాలెట్టి, పెయి కంటిచ్చిన వేందే, అంటి.

నీ దమాగ్, కరాబైంది, తాత!
నువ్వర్జంటుగ, దవాకాన్ల జూపించుకో, పో తాతా, అనె.
గట్లనె గని, ఔ! పోరి, నిన్న యామన్నవ్, యాదుందా!
యాసాలు యేయి తరీకలని.
గిప్పుడు దెల్సిందే, ఎర్రి గూడ ఏయి తరీకలని.
అయ్యో దేవుడ.. వీల్లను నువ్వే జర అరుసుకోవాలె.
కాని సివయ్యా దేవుడవు, నిన్ననరాదు గని
నీ ఎర్రిగాకుంటె, గీ మన్మదున్ని,
కంటిమంటల్ల, గాల్చుటెందుకు
రతీదేవమ్మ యేద్పుజూసి, వీన్ని బదికిచ్చుటెందుకు
పెయిలేని, పాన మిచ్చుటెందుకు
మా పానాలు దీసెటందుకుగాక!
మన్మదయ్యా నువు చిందుల్ దొక్కుడు, జర ఆపి
నేజెప్పే, గీ సివరి మాటా గూడ, వినిపో!
మా, మానసిక శాస్త్రవేత్తలు జెపుతాన్రు
ప్రతి రెండు నిమిషాలకు మగాల్లు
ప్రతి ఐదు నిమిషాలకు ఆడాల్లు
నిన్నే యాదిసేస్తరని.
మావాల్ల తరీక జూసెవు.
ఇది నీ సంమ్మచ్చం నిపుచరం గాకుంట జూస్కో అంటుండగానే
మా బుడ్డోడు, తాతా
కారక్కారంగ, తీయతీయంగ,
సేద్పేదుగ, వొగరొగరగ,
రొడ్డరొడ్డగున్నా, తినసీన్కి
శాన, రుసిగున్నది తాతా! లెగి.... అంట లేపె

రచయిత ఫోన్ : **9391685686**

# కొత్త పుస్తకాల సమీక్షలు, సభల, ఉద్యమాల వార్తలు

1. వచ్చే సంచిక నుండి కొత్త పుస్తకాల పరిచయం / సమీక్ష ఇవ్వబడతాయి. ఇందుకోసం ప్రతులను పంపాలి.

2. **'అమ్మనుడి'**లో పత్రిక ఆశయలక్ష్యాల కనుగుణమైన సభల, సమావేశాల వార్తలు, ఫొటోలతో సహా ఇవ్వబడతాయి. అయితే ఆ వార్తల్లో సభ జరిగిన స్థలం, తేదీతో సహా ఇవ్వాలి. ఆహ్వానపత్రికను కూడా జతపరచాలి. తెలుగుభాష, సాహిత్యం, సంస్కృతితో పాటు తెలుగు ప్రజాజీవనంలో మార్పు కోసం వివిధ రంగాలలో జరిగే ఉద్యమాల వార్తలు కూడా క్లుప్తంగా ఇస్తాము.

కవిత

# బ్రౌన్‌కు నమస్కారం



బ్రౌన్ అంటే ఒక రంగు పేరు కాదు.
రంగు వెలిసిపోతున్న తెలుగు ఇంటికి
సున్నం వేసిన మహానుభావుడతడు.

చెదలుపట్టి చినిగిపోతున్న
తాటాకు పుస్తకాల పగుళ్ళను
కాలం జిగురుతో అతికించిన సాహిత్య మేస్త్రీ

చెరిగిపోతున్న కరక్కాయ సిరాక్షరాలను
రక్తరేఖలతో దిద్ది రక్షించిన సారస్వత బాలుడు

ఆరిపోతున్న భాషాదీపానికి
ఊపిరిలోంచి ప్రాణవాయువు దానం చేసిన సంజీవనుడు

బానిసల భాషను ఛీ కొడతారు గాని తలకెత్తుకుంటారా!
అవును
తెలుగు భాషావ్యసనానికి బానిసగా మారిన కారణజన్ముడతడు
బ్రౌన్ అంటే ఒక రంగు పేరు కాదు.

గడ్డం పెంచుకొని వెళ్తున్న వేమన్నను చూసి
'నా కవీ' అంటూ వెంటపడ్డవాడు
ఆరని జీవసమాధి చుట్టూ తిరిగి
ఆత్మతో సంభాషించిన అక్షర మాంత్రికుడు
తెల్లదొరలు క్లబ్బుల్లో తాగి తందనాలాడే రోజుల్లో
సాహిత్యాన్ని నేలదాకా ఉద్ధరించిన రసహృదయుడు
పెళ్ళి చేసుకున్నట్టు లేదు గానీ
సతీసహదహనాన్ని భంగం చేసిన మానవీయ రక్షకభటుడు
తన జీతాన్ని అనేక జీతాలుగా మార్చి
పేద పండితులను పోషించిన ఉదార గుణసంపన్నుడు
చీకటి గదుల్లో మూల్గుతున్న మాటల కుప్పలకు
నిఘంటువుల కిటికీలు తెరచిన తెలుగు సూర్యుడు.
బ్రౌన్ అంటే ఒక రంగు పేరు కాదు.

తాతాచార్ల వారి చేయిపట్టుకొని
వాడుకభాషలోని జీవనాడిని
చెవులకద్దుకున్న గిడుగు పంతులుకు పితామహుడు
వ్యాకరణాలకు కలుపు తీసినవాడు
ఛందస్సుల స్పందనలు విన్నవాడు
పంటలు లేని కరువునేలకు
సాహిత్య జలాలను మళ్లించిన భగీరథుడు
అవినీతిని ఎదిరించి ఉద్యోగం పోగొట్టుకున్న అమాయకుడు
ముక్కిపోయిన మన బియ్యాన్ని బాగుచేసి
మళ్ళీ మనకే బిచ్చంగా వేసిన విశ్వదాత
బ్రౌన్ అంటే ఒక రంగు పేరు కాదు.

అతడు లేకుంటే వసుచరిత్ర లేదు
అతడు లేకుంటే మనుచరిత్ర లేదు
పోతన భాగవతానికి స్కంధాలు సాధించి
అందాలు నిలబెట్టాడు.
మహాభారత పర్వాలకు మరోసారి పట్టం కట్టాడు.
అతని చూపు పడకపోతే రంగనాథ రామాయణాన్ని
ఏ దొంగలెత్తుకపోయ్యేవారో!
బ్రౌన్ అంటే ఒక రంగు పేరు కాదు.

ఆఖరి శ్వాస దాకా అక్షరాలను మథించిన పిచ్చివాడు
ఎవరండీ! ఎవరాతడు?
సర్వం సహా చక్రవర్తి మాత్రం కాదు
అంకితాలు తీసుకున్న మహామంత్రీ కాదు
కేవలం ఒక ఆంగ్లేయ ఉద్యోగి
అక్షరంగా ఎదిగిన యోగి
అతడు పుట్టి రెండు శతాబ్దాలు దాటిందట!
మరో వెయ్యేండ్లు అతన్ని గుర్తుంచుకోకపోతే
తెలుగు మనుగడకే ముప్పు
అది మనం చెయ్యగూడని తప్పు
బ్రౌన్ అంటే ఒక రంగు పేరు కాదు
రంగు వెలిసిపోతున్న తెలుగు ఇంటికి
సున్నం వేసిన మహానుభావుడతడు

అజరామరం అతని సంస్కారం
సి.పి.బ్రౌన్‌కు మన నమస్కారం

*(సి.పి.బ్రౌన్ 200వ జయంతి మహోత్సవాలలో
వినిపించిన కవిత : నవంబర్, 1998)*

**- ఆచార్య ఎన్.గోపి**
ఫోన్: 040-27037585

# విజయవాడలో అట్టహాసంగా జరిగిన 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు





(ఎడమ) స్వాగతోపన్యాసం చేస్తున్న ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి గౌ॥ శ్రీ మండలి బుద్ధప్రసాద్ ;
(కుడి) వందేళ్ళ జీవిత ప్రతీక బాలాంత్రపు రజనీకాంతరావు గారిని సత్కరిస్తున్న కేంద్రమంత్రి గౌ॥ శ్రీ ముప్పవరపు వెంకయ్యనాయుడు, శ్రీ మండలి బుద్ధప్రసాద్, కేంద్ర హిందీ సంఘ సభ్యులు ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

**కృ**ష్ణాజిల్లా రచయితల సంఘం 'ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు' ఇంతకుముందు రెండుసార్లు నిర్వహించింది. మూడవ మహాసభల్ని రెండేళ్ల క్రితమే ప్రకటించినా, అప్పటిలో రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితుల్లో వాటిని వాయిదావేసి 2015 ఫిబ్రవరి 21, 22 తేదీలలో విజయవాడ పటమటలోని శ్రీకృష్ణవేణి టాలెంట్ స్కూల్‌లో ఘనంగా నిర్వహించారు. పెద్దఎత్తున ఏర్పాట్లు చేశారు. రాష్ట్రం నుంచి, పొరుగురాష్ట్రాల నుంచి 1200 మందికి పైగా ప్రతినిధులు విచ్చేశారని నిర్వాహకులు ప్రకటించారు. మహాసభలకు గౌ॥ శ్రీ మండలి బుద్ధప్రసాద్ గౌరవాధ్యక్షులుగా, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ కార్యనిర్వాహకులుగా పూనుకొన్న తర్వాత ఇక లోటేముంటుంది? ప్రభుత్వం కూడా భారీ ఆర్థిక సహాయంతో ముందుకు వచ్చింది. ఇక ఇలాంటి కార్యక్రమాల నిర్వహణలో ఆరితేరిన శ్రీ గుత్తికొండ సుబ్బారావు (కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షులు), డా॥ జి.వి.పూర్ణచందు (ప్రధాన కార్యదర్శి) లు సభలను విజయవంతంగా నిర్వహించారనే అనుకోవాలి. స్థానికంగాగాని, ఇతర ప్రాంతాల నుంచి గాని పెద్ద రచయితలనెవ్వరినీ సభలో పాల్గొనండని ప్రత్యేకించి ఆహ్వానించలేదనే విమర్శ వచ్చింది. ఒక విధాన నిర్ణయంగానే నిర్వాహకులు వారెవరినీ పిలువలేదని కార్యదర్శి డా॥ పూర్ణచందు చెప్పారు. రచయితలందరూ కలవడం మాత్రమే కార్యక్రమంగా పెట్టుకొన్నాం. అందరూ పాల్గొనాలనే ఆశించాం. ప్రత్యేకించి బొట్టుపెట్టి ఒకరిని పిలిచీ, మరొకర్ని పిలవక వివాదాల్ని తెచ్చుకోదలచలేదు. అయినా అంతసంఖ్యలో ప్రతినిధులు వచ్చారంటే దాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలి" అంటున్నారాయన. మొత్తం ప్రతినిధుల్లో తెలంగాణ నుంచి వచ్చినవారే ఎక్కువగా ఉన్నారని, ఏ విధంగా చూచినా ఇది విజయవంతమేనంటున్నారాయన. అయినా పెద్ద, ప్రముఖ రచయితలనేవారు ఇందులో ఎందుకు పాల్గొనలేదో వారే చెప్పాలంటున్నారాయన. ప్రత్యేకించి పిలవనందునే వారు మహాసభల్లో పాల్గొనలేదంటే – వారి ఆలోచనావిధానం ఏమిటో అర్థం అవుతోంది అనేది ఆయన పరిశీలన.

సభల్లో కొన్ని ముఖ్యమైన అంశాలను చర్చకు పెట్టారు. వాటిపైనే రెండురోజులూ చర్చ జరిగింది. ఎటువంటి తీర్మానాలూ చెయ్యలేదు. ఎన్నాళ్లు తీర్మానాలు చేసుకుంటూపోతాం? పాల్గొన్న మంత్రులు, ఇతర పెద్దలు అంతా ఆ అంశాల సాధన కోసం కృషిచేస్తామన్నారు. అందరినీ కలపడం, చర్చలు జరపడం మాత్రమే ఈ మహాసభల కార్యక్రమం అని డా॥ పూర్ణచంద్ చెప్పారు. సభల్లో పాల్గొన్నవారిలో ప్రముఖులు : భారత సర్వోన్నత న్యాయస్థానం న్యాయమూర్తులు జస్టిస్ జాస్తి చలమేశ్వర్, జస్టిస్ ఎన్. వెంకటరమణ; రాష్ట్రమంత్రులు దేవినేని ఉమామహేశ్వరరావు, పల్లె రఘునాథరెడ్డి, గంటా శ్రీనివాసరావు, కామినేని శ్రీనివాస్; శాసనసభ్యుడు గద్దె రామ్మోహన్, శాసనమండలి సభ్యురాలు నన్నపనేని రాజకుమారి, విజయవాడ మేయర్, జిల్లా పరిషత్ అధ్యక్షురాలు పాల్గొన్నవారిలో ప్రముఖులు. కేంద్రమంతి శ్రీ వెంకయ్యనాయుడు కూడా ప్రముఖంగా పాల్గొన్నారు. ఈ సభల సందర్భంగా 'తెలుగుయువత' పేరుతో ఒక ప్రత్యేక సంచికను, 'తెలుగు భారతి' అనే పేరుతో ఒక పరిశోధనావ్యాస సంపుటిని ప్రచురించారు. గతంలో కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురించిన భారీ పుస్తకాలకు ఇవి ఏమాత్రం తీసిపోకుండా ఉన్నాయి. నూరేళ్ల జీవితం గడిపిన ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ బాలాంత్రపు రజనీకాంతారావుగార్ని సభలో ఘనంగా సత్కరించారు. మొత్తం మీద ఈ సభలు వేడుకల్లాగా, నిర్వాహకుల ప్రతిష్టకు తగినట్లుగా ఉన్నాయి. నిర్దిష్ట ప్రయోజనాలు ఇలాంటి సభల వల్ల ఏం సమకూరాయి అని ఆలోచించడం కంటే అందరినీ కలిపి పలు అంశాలను చర్చకుపెట్టి, వాటిపై వెలుగును ప్రసరింపజేయడం, పాలకులు, ఇతర సామాజికబాధ్యులలో ఆలోచనను కలిగించి, ముందుకు సాగడమే ఈ సభల లక్ష్యం అని నిర్వాహకుల ఉద్దేశంగా స్పష్టం అవుతున్నది. నిర్వాహకులు అభినందనీయులు.

– **'అమ్మనుడి'** ప్రతినిధి

# 'అమ్మనుడి' చదువరుల మాటలివి...




'నడుస్తున్న చరిత్ర' కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకొని **'అమ్మనుడి'** రూపంలో తిరిగి ప్రచురిస్తున్నందుకు ధన్యవాదాలు. తెలుగు భాష పరిస్థితి చూస్తుంటే కొంత ఆశ కొంత నిరాశ కలుగుతున్నది. 'కుక్కతోక వంకర' లాగా ఎన్ని భాషా సంఘాలు ప్రాధాన్యత కోసం పోరాడినా, ఎన్ని ప్రపంచ సభలు పెట్టి తీర్మానాలు చేసినా ప్రభుత్వానికిగాని, ప్రసార సాధనాలకు గాని, విద్యావేత్తలకు గాని భాషను ప్రచారం చేయలేకపోతున్నారు. ఆంగ్లభాషా వ్యామోహంతో విద్యాశాఖ గాని, ప్రసార సాధనాలు గాని ఆ చెర నుండి విముక్తి పొందలేక పోతున్నాయి. ముఖ్యంగా కొన్ని ప్రసార సాధనాల వారు దుస్తులు, ఆంగ్లభాషతో వారు లండన్ నుంచి గాని, అమెరికా నుంచి గాని మాట్లాడుతున్నామనే భావనతో ప్రేక్షకులకు అదే సంస్కృతి అలవాటు చేస్తున్నారా అనిపిస్తుంది. ఇక ధారావాహికలు కూడా అశ్లీలత, హింసతో స్త్రీపాత్రలు తుపాకుల దాకా వచ్చాయి. మంచితనం, శాంతి ప్రసారం చేసి జాతిని మంచివైపు మరల్చాల్సింది పోయి యువత బలహీనతలు (పొగాకు, మద్యం, హింస) వంటివి అధికంగా ప్రసారం చేస్తున్నారు. వారికి బయటినుంచి, లోపలినుంచి కట్టడి లేక భావస్వాతంత్ర్యం, పత్రిక స్వేచ్ఛ అనే ముసుగులో సమాజానికి మంచికంటే చెడు ఎక్కువ చేస్తున్నారు. హద్దులు లేని 'స్వేచ్ఛ' ప్రమాదం.

'నడుస్తున్న చరిత్ర' తెలుగుజాతి పూర్వాపరాలు, ఉన్నతి గురించి ఎంతో జ్ఞానాన్ని అందించింది. అది ఒక మేలుకొలుపు. శ్రీలంక వార్తలు 62వ పేజీలో చక్కగా అందించినారు. శ్రీలంక రాజవంశీయులు చిత్తూరు జిల్లాలో రైల్వేలో పనిచేసి దుర్భరజీవితం గడుపుతున్నారని ఇంతకుముందు 'నడుస్తున్నచరిత్ర'లో చదివినట్లు గుర్తు వున్నది. అదే చివరిపేజీలో 'వివిధ దేశాలలో జరుగుచున్న కార్యక్రమాలు' ప్రతినెలా ఒక దేశం గురించి ప్రచురించగలరు. మన దినపత్రికలు ఎక్కువ స్థలం ఇవ్వవు. తెలుగుభాష వ్యాప్తికి జరుగుతున్న ప్రయత్నాలు తెలుసుకుంటాము. **'అమ్మనుడి'** కి నా సహకారం ఎప్పుడూ వుంటుంది. చివరిపేజి కొరకు ఆర్థికంగా నా శక్తికొలది సహకారం అందించగలను. **– యోగానంద నరసింహం**
విశ్రాంత ఆచార్యులు, కోరమంగళ, బెంగుళూరు

నడుస్తున్నచరిత్ర తిరిగి ఈ రూపంలో ప్రచురిస్తున్నందుకు మీకు నా హృదయపూర్వక అభినందనలు. మార్చి 15 సంచిక చివరిపేజీలో 'తెలుగు నేర్చుకుంటున్న తెలుగువారు' అనే శీర్షికలో వచ్చిన చిన్నవ్యాసంలో–ఇక్కడ ఉన్న తెలుగు వారిలో వడ్డెరలు, మాదిగలు, కంబరనాయకర్లు (తెలుగుగొల్లలు) పెద్ద సంఖ్యలో ఉన్నారన్నారు.

శ్రీలంకలోని వెద్దజాతివారి గురించి గిడుగు రామమూర్తిగారు కొంత సమాచారమందించారు. ఆ వెద్దజాతివారినే వడ్డెరలు అని ఇప్పుడు వ్యవహరిస్తుంటే వారు తెలుగువారు కాదు.

గిడుగు రామమూర్తిగారు వారి సోర – ఇంగ్లీషు నిఘంటువుకు వ్రాసిన పీఠికలో శ్రీలంకలోని వెద్దజాతివారి గురించి ఈ విధంగా వ్రాశారు: "ఒక ఉదాహరణ ఏమంటే పాల్, ఫ్రెడరిక్ సరసిన్ సోదరులు, సి.జి.సెలిజ్‌మన్‌తో కలిసి సింహళదేశానికి చెందిన వెద్దజాతివారు వాడే పదాల పట్టికను తయారుచేశారు. అవి సింహళదేశపు భాషలోని పదాలతో పోలి లేవు. అవి వెద్దజాతివారి స్వీయభాషావదాలు. ఇప్పుడా భాష పూర్తిగా కనుమరుగైపోయింది. అయితే ఆ పదాలకు ముండారీభాషలోని పదాలకు దగ్గరి పోలికలున్నాయి.

| | వెద్ద | ముండారీ |
|---|---|---|
| 1. మనిషి | హుల్ | హెరె, హోరె, హుర్ లేదా ఉర్ |
| 2. పులి, చిరుత | కుల | కుల |
| 3. గొడ్డలి | తబల | తబ్ల (వేటగొడ్డలి) |
| 4. నీరు | డియె | ద |
| 5. పారుతున్న నీరు | డియెగమ | దగమ (వర్షం) |

రామమూర్తిగారి పీఠికలోని సంబంధిత భాగం యొక్క జెరాక్సు కాపీని వ్యాసకర్త పరిశీలనార్థం పంపుచున్నాను.

**– కణుగుల వేంకటరావు, శ్రీకాకుళం**

నడుస్తున్నచరిత్ర **'అమ్మనుడి'**గా వస్తున్నందులకు సంతోషం. కృష్ణశాస్త్రి సాహిత్యసౌరభాలు సమీక్షలో తిలక్: "కవిత్వం ఒక ఆల్కెమీ/ అది కృష్ణశాస్త్రికి తెలుసు/శ్రీశ్రీకి తెలుసు, విశ్వనాథకు తెలుసు" అన్నట్లు రాశారు. మాకు తెలిసి... కవిత్వం ఒక ఆల్కెమీ. కాళిదాసుకు తెలుసు. పెద్దన్నకు తెలుసు, కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు అని మాత్రమే అన్నారు. సమీక్ష అంటే శల్యపరీక్షలాంటిది కనుక శ్రద్ధ వహించగలరు.

**– గంధం శేషేంద్రరావు, అత్తిలి**

**'అమ్మనుడి'** పత్రిక నడుస్తున్న చరిత్రకు నిజమైన వారసురాలని నిరూపించుకొంది. ముఖ్యంగా కతల విషయంలో ఏ ఇతర పత్రికా చేయనిరీతిలో పలు తెలుగు ప్రాంతాల స్థానికతను, వారి నుండి తీరును ప్రతిబింబించే కతల్ని వేయడంలో నడుస్తున్నచరిత్ర బాటలోనే **'అమ్మనుడి'** కూడా నడుస్తున్నది. తొలిసంచికలో గుత్తి చంద్రశేఖరరెడ్డి గారి బళ్లారి మాండలిక కతను ప్రచురించి కొత్తచరిత్రను నెలకొల్పింది. ఇంతవరకూ – నాకు తెలిసినంతవరకు – బళ్లారి మాండలికంలోనే పూర్తిగా వ్రాసిన తొలికత ఇదే. ఇందుకు రచయితను మనసారా మెచ్చుకోలేకుండా ఉండలేము. **– ఎం. బంగారుబాబు, చెన్నై**

పత్రిక అంతా బాగుంది. పత్రిక పేరుకు తగ్గవిధంగా తెలుగునుడి పటాన్ని ముఖచిత్రంగా వేయటం ఎంతో ఆనందాన్నిచ్చింది. తెలుగుజాతి మొత్తానికి సమ్మతం కాగల విధంగా పత్రిక వుంది. 'నడుస్తున్న చరిత్ర' ఇరవైఏళ్ల అనుభవాన్నుంచి వెలికివచ్చిన **'అమ్మనుడి'** కి జేజేలు. **– ఎస్. గంగిరెడ్డి,** విశాఖపట్టణం

నడుస్తున్న చరిత్రలో వరుసగా చెంచుల బతుకు కతలు ప్రచురించి గొప్ప పనిచేశారు. ఇప్పుడు కొండరెడ్ల గురించి మొదలు పెట్టారు. ఈ రచయిత పల్లాల బొర్రరెడ్డి గారికి, వారిచేత వ్రాయించిన 'శక్తి' శివరామకృష్ణగారికి, ప్రచురిస్తున్న మీకు మప్పిదాలు. ఒక సూచన : 'గోదావరి లోయలో కొండరెడ్లు' అనేకంటే 'గోదావరి లోయలో కొండరెడ్ల బతుకుకతలు' అంటే బాగుంటుంది కదా. అలాగే 'తెలుగు సంస్కృతి పునాదిశిలలు' అని దీర్ఘాలు తీయడం మనపత్రికకు తగింది కాదు. 'తెలుగు సంస్కృతికి పునాదిరాళ్లు' అంటే ఎంత హాయిగా ఉంటుందో గదా! **– ఎం.ఎన్.రెడ్డి,** విశాఖపట్టణం

(తరువాయి 50వ పుటలో..)

## 'అమ్మనుడి' విడుదల సభ (2వ పుట తరువాయి)

సభాధ్యక్షులు డా॥ దక్షిణామూర్తి మాట్లాడుతూ – తాను 'నడుస్తున్నచరిత్ర'ను తొలినుండీ చదువుతున్నానని, తక్కిన పత్రికలకు భిన్నంగా ఒక ప్రత్యేకతతో ఆ పత్రిక ఇన్నాళ్లు నడిచిందని, ఇప్పుడదే పత్రిక 'అమ్మనుడి'గా రావడం స్వాగతించదగిన పరిణామమని అన్నారు. భాషోద్యమ నిర్మాణంలో పత్రిక, సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు చేసిన కృషి వర్తమాన చరిత్రలో భాగంగా నిలిచిపోతుందని అన్నారు. 'అమ్మనుడి'ని కాపాడుకొని, వృద్ధి చెందించాలని, ఇందుకు మనమంతా పూనుకోవాలని ఆయన పిలుపునిచ్చారు. సంపాదకుడు డా॥ రమేష్‌బాబు తన సమగ్ర ప్రసంగంలో – పత్రిక మొదలుపెట్టినప్పటినుండీ దాని ఎదుగుదల, మార్పులు, భాషోద్యమ నిర్మాణానికి పత్రిక చేసిన కృషినీ వివరించారు. 'నడుస్తున్న చరిత్ర' తొలుత ఒక సామాజిక, రాజకీయపత్రికగా 1993లో మొదలుపెట్టానని, 2000 నాటికల్లా అది భాషోద్యమ నిర్మాణానికి అంకితమైందని తెలిపారు. 20 ఏళ్ల కృషి తనకు సంతృప్తి కలిగించిందని, ఏడాదికిపైగా పత్రిక నిలిచిపోయిందని, 'అమ్మనుడి'గా ఇప్పుడది మళ్లీ ప్రచురణ సాగించడం ఒక చారిత్రక పరిణామమని చెప్పారు. పత్రికకున్న స్పష్టమైన ఆశయలక్ష్యాలను ఇప్పుడు పత్రిక పేరు, తీరు పూర్తిగా ప్రతిఫలిస్తున్నాయని, తొలి సంచిక ముఖచిత్రమే 'అమ్మనుడి' ఆలోచనకు అర్థంపడుతున్నదని అన్నారు. పత్రిక ప్రచురణను విజయవాడ నుండి కాక, తెనాలికి మార్చడానికి – నా పుట్టిన వూరిలో ఈ మజిలీ సాగాలనే బలమైన ఆశయం, తమ్ముడు లక్ష్మణబాబు ప్రచురణకర్తగా బాధ్యతను తీసుకోవడం కారణాలయ్యాయన్నారు. 'తెలుగుజాతి' ట్రస్టు నిర్మాణాన్ని గురించి సభికులకు తెలియజేసి, పత్రిక, పుస్తకాల ప్రచురణ కోసం ట్రస్టును నిర్మాణం చేస్తున్నామని, దీనికి మీ అండదండలు కావాలని విజ్ఞప్తి చేశారు.

ముఖ్యఅతిథి శ్రీ ఆలపాటి రాజేంద్రప్రసాద్ తొలుత 'అమ్మనుడి' పత్రికను విడుదల చేసి, ప్రసంగించారు. మన భాషాసంస్కృతులను కాపాడుకోవాలని, భాష లేనిదే తెలుగుజాతి లేదని ఆయన అన్నారు. భాషోద్యమ నిర్మాణం కోసం చేస్తున్న కృషికి ఇంతవరకు 'నడుస్తున్నచరిత్ర', ఇక 'అమ్మనుడి' పూర్తిగా అంకితమైనాయన్నారు. భాషోద్యమం విషయంలోను, 'అమ్మనుడి' నిర్వహణకు – తాము పూర్తిగా ప్రోత్సాహిస్తామని ఆయన వాగ్దానం చేశారు.

విశిష్ట అతిథి శ్రీ కొత్తమాసు తులసీదాసు ఎంతో అనారోగ్యంగా వున్నా, ఓపిక చేసుకొని ఈ సభకు విచ్చేశారు. సంపాదకుడు రమేష్‌బాబుతో తొలినుండీ తనకున్న సాన్నిహిత్యాన్ని తెలిపి, పూర్తి మద్దతును తెలియజేశారు.

ఆత్మీయ అతిథి శ్రీ కొత్తపల్లి రవిబాబు మాట్లాడుతూ నాడు సాగిన వాడుక తెలుగు భాషోద్యమానికి, నేడు సాగుతున్న తెలుగు భాషోద్యమానికి మౌలిక లక్ష్యాలను వివరించి, 'నడుస్తున్నచరిత్ర' నిర్వహించిన పాత్రను ప్రశంసించారు. 'అమ్మనుడి' కి శుభాకాంక్షలందించారు.

ఆత్మీయ అతిథిగా విచ్చేసిన ప్రముఖ బౌద్ధ రచయిత శ్రీ బొర్రా గోవర్ధన్ – తెలుగునేలపై బౌద్ధ ప్రభావాన్ని వివరించారు. తెలుగుపై సంస్కృతం దాడిని, ఇప్పుడు ఆంగ్లభాషదాడిని ఎదుర్కొని, తెలుగును కాపాడుకోవాలని అన్నారు.

డా॥ కొత్త శివరామకృష్ణప్రసాద్, శ్రీ కొలసాని విష్ణుప్రసాద్ 'అమ్మనుడి' పత్రికకు తమ మద్దతును తెలిపారు. ప్రచురణకర్త సామల లక్ష్మణబాబు తొలుత వేదికపైకి అతిథులను ఆహ్వానించి, సభానంతరం అందరికీ మప్పిదాలు తెలిపారు. వివిధ రంగాల ప్రముఖులు, పత్రిక చదువరులు, అభిమానులు సభలో పాల్గొన్నారు.

---

### 'అమ్మనుడి' చదువరుల మాటలివి...

'నడుస్తున్నచరిత్ర' **అమ్మనుడి** గా తెలుగువారి గుడిగా, వరవడిగా, వడివడిగా వరవడి చెందినందుకు సంతోషంగా వుంది. **అమ్మనుడి** కమ్మని పేరు. రసరమ్యమైన భావనా సెలయేరు. **అమ్మనుడి** ఇక ద్విగుణీకృత అంకితభావంతో పరుగిడి, ఇద్దరు తెలుగువారి మధ్య – ఎక్కడ, ఎప్పుడు కలిసినా – హృద్యమైన మల్లెల వారధిగా, తేటతెలుగు పలుకుబడిగా భాసించాలని ఆకాంక్షిస్తున్నాను.

– డా॥ **చిలకపాటి విజయరాఘవాచార్యులు,** హైదరాబాదు

భాషోద్యమ పత్రికను నడపడం కత్తిమీద సాము వంటిది. మీరీకృషిలో కృతకృత్యులయ్యారు. అభినందనలు. 'నడుస్తున్నచరిత్ర' **అమ్మనుడి**గా ఆవిర్భవించడం మంచి పరిణామం. 'నడుస్తున్నచరిత్ర' ఎందరో రచయితలను ముందుకు తెచ్చింది. ఎన్నో పత్రికలకు స్ఫూర్తి నిచ్చింది.... సమస్యలన్నింటినీ ఒక వేదికమీదకు తీసుకువచ్చి ఉద్యమ స్ఫూర్తితో కృషిచేయగల చేవ 'నడుస్తున్నచరిత్ర' నుంచి వారసత్వంగా **అమ్మనుడి**కి అందింది. ఇక నడక మరింత ముందుకే.

– డా॥ **పాయసం సుబ్రహ్మణ్య మహర్షి,** నెల్లూరు

'ఉగాది' కానుకగా అందజేసిన **'అమ్మనుడి'** బాగుంది. అన్నిరకాల అభిరుచులకు అద్దం పడుతూ వైవిధ్యంగా పత్రిక చరిత్ర సృష్టించాలని ఆశిస్తున్నాను.

– **గబ్బిట దుర్గాప్రసాద్,** ఉయ్యూరు

---

అభినందనలు, స్పందనలు చాలా వచ్చాయి. ఫోన్ చేసి అభినందించినవారెక్కువమంది. వాటినిక్కడ పేర్కొనడం లేదు. ఉత్తరాలుగా వచ్చినవాటిలో కొన్నిటిని మాత్రమే ఇక్కడ ఇవ్వగలుగుతున్నాం. అందరికీ మప్పిదాలు తెలుపుతున్నాం. – **సంపాదకుడు**

---

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL 14381/7/1/2015 TC



చిత్రసుందరం!

# ఆకృతి ఆర్ట్ గాలరీ



**అవి** రంగులు కావు. కళాకారుల మనసులను పొంగించిన చిత్రసుందరాలు. ఊహలకందని రేఖాసౌందర్యాలు. ఒకటి కాదు, రెండు కాదు, 27 మనోహర వర్ణచిత్రాలు.

తరతరాల తెలుగువారి సాంస్కృతిక కేంద్రంగా భాసిల్లిన విజయవాడ – కవులకే కాదు, కళాకారులకు కూడా పుట్టినిల్లు. ప్రతిరోజూ కాన్వాసుకు వన్నెలద్దుతున్న వందలమంది కళాకారుల ప్రతిభ తమతమ స్టూడియోలకే పరిమితమైంది. ఒక్క ఆంధ్రా ఆర్ట్ అకాడెమీ ప్రదర్శనశాల తప్ప, కళాకారుల కుంచెలనుంచి జాలువారిన అపురూప కళాఖండాల ప్రదర్శనకు అనువైన ఒక్క గాలరీ కూడా విజయవాడలో లేనిమాట నిజం.



కళాకారులు, కళాభిమానుల కోసం లక్ష్మీగ్రూప్ అధినేత యార్లగడ్డ హరిశ్చంద్ర ప్రసాద్, కళామతల్లికి తన వంతు సేవచేయాలనుకొని, మొగల్‌రాజపురంలోని మధుమాలక్ష్మి ఛాంబర్స్‌లో విజయవాడ కళాకేంద్రాన్ని ప్రారంభించారు. అంతరిస్తున్న చేతికళలు, కళారూపాలను, సంస్కృతి, సంప్రదాయాలు, సాహిత్య పరంపరను పరిరక్షించి భావితరాల కందించాలన్న తపనతో ఈ కళాకేంద్రాన్ని స్థాపించారు.



ఒకప్పుడు గొప్ప సాంస్కృతిక కేంద్రంగా విలసిల్లిన విజయవాడ వైభవప్రాభవాలను మళ్లీ తేజరిల్లజేయటానికి ఆకృతి ఆర్ట్‌గాలరీ, సాహితి లిటరరీ సెంటర్, సంస్కృతి కల్చరల్ సెంటర్‌లనే మూడు విభాగాలు గల విజయవాడ సాంస్కృతిక కేంద్రం రూపుదిద్దుకొంది. కేంద్రమంత్రివర్యులు వై. సుజనాచౌదరి ప్రారంభించిన ఈ సాంస్కృతిక కేంద్రంలోని ఆకృతి ఆర్ట్‌గాలరీలో ప్రారంభ ప్రదర్శనలో 12 మంది ప్రఖ్యాత, వర్ధమాన కళాకారుల 27 వర్ణచిత్రాలు చూపరులకు కనువిందు చేస్తున్నాయి. ఆనంద్ కె బెక్వాడ్ నీటిరంగుచిత్రాలు ప్రకృతి రమణీయతకు అద్దం పడుతుండగా, హెచ్‌ఆర్ దాస్, యాక్రిలిక్ ఎద్దుబొమ్మ పొగరుబోతు గిత్తల్ని గుర్తుకుతెస్తున్నాయి.మరో విలక్షణ చిత్రకారుడు జగన్నాథ్‌పాల్ చార్‌కోల్–యాక్రిలిక్‌లను కలిపి కాన్వాస్‌పై చిందించిన బెల్లరినాన్నత్యం, దీపకళిక దృశ్యాలు ఆకట్టుకొంటున్నాయి. శ్యామల్ ముఖర్జీ తైలవర్ణచిత్రాల్లో బాబా, బీబీలు వైవిధ్య వ్యక్తిత్వాలను, గ్రామీణ నేపథ్యంలో చూడవచ్చు. సోఘం కురసాని కుంచె అలవోకగా రూపుదిద్దిన 'సైలెంట్ ఫీల్డ్స్' నైరూప్య ఉడ్‌ఫీట్ ప్రింట్లు కొత్తదనాన్ని సంతరించుకొన్నాయి. పసుపులేటి గణేష్ అనే మరో చేయి తిరిగిన చిత్రకారుడు గ్రామీణ వాతావరణాన్ని ఒడిసిపట్టి ఇళ్లు, పూలమొక్కలు, కోడిపుంజులను హృద్యంగా చిత్రీకరించి మనం మరచిపోతున్న పల్లెపట్టుల్ని కళ్లముందు కదలాడేట్లు చేశారు.



కౌశిక్‌రహా తనదైనశైలిలో పట్టణ వాతావరణాన్ని ఎత్తైన భవనాలున్న వీధులుగా చిత్రించి ఆధునిక నగరజీవనానికి ప్రతీకలుగా అందించారు. సుబ్రతాదాస్ చిలకరించిన రంగులతో రూపు దిద్దుకొన్న ప్రేమికుల దృశ్యం, ముగ్ధమనోహర రూపలావణ్యాన్ని పుణికిపుచ్చుకొని ఆహ్లాదాన్ని పంచుతుంది.



ఇన్ని వర్ణచిత్రాల్లో మొట్టమొదటి బౌద్ధభిక్షుణి గౌతమిని సంఘానికి ఆహ్వానిస్తూ, ఆదరిస్తున్న బుద్ధుని తెలుపు–నలుపు పలుమాధ్యచిత్రం ప్రత్యేకతను సంతరించుకొంది. బుద్ధుని చీవరాలను తీర్చిదిద్దిన వైనం, శాంతిస్వరూపుడైన బుద్ధుని మంగళస్వరూపం చిత్రకారుడైన దత్తాబన్‌సోడే చేతివాటానికి, చిత్రకళా పాటవానికి కాలమానమని చెప్పొచ్చు. పాతకాగితంపై పౌడర్ పిగ్మెంట్‌తో హెతల్ సూడసమ చిత్రించిన రెండు నైరూప్య చిత్రాలు చిత్రకారుని పరిపక్వతను సూచిస్తున్నాయి. ఆనంద్ పంచాల్ యాక్రిలిక్‌తో కాన్వాస్‌పై మంత్రించిన యువతి, యువకుల వర్ణచిత్ర సౌందర్యం వర్ణనాతీతం. చివరగా, మనుషులు, చెట్లు, పక్షులు, ప్రకృతికి భిన్నంగా, జంతురూపచిత్రం జయప్రకాష్ ప్రతిభకు పట్టంకడుతూ, ఊహల్ని అభివ్యక్తీకరించటంలో పరాకాష్టను తెలియజేస్తూ సందర్శకులను మంత్రముగ్ధుల్ని చేస్తుంది. కళాకారులను, కళాప్రేమికులను రారమ్మన్ని పిలుస్తున్న ఈ చక్కటి ప్రదర్శన, ఇప్పటివరకూ విజయవాడలో ఏర్పాటుచేసిన చిత్రకళా ప్రదర్శనల్లో తలమానికమని చిత్రకళా విమర్శకులు కొనియాడుతున్నారు.

AMMANUDI (Telugu Monthly)
April 2015, Vol.1, Issue : 2

RNI-APTEL 14381/7/1/2015 TC
Postal Reg. No.